# అలంకార మంజరి.

(కావ్య ప్రకాశానువాదము)

# తొలి పలుకు

అలంకారశాస్త్ర మగాధము నపారమునై చెలంగును. సముద్రమువలెనే దీనికింగూడ నొక యంచు నొక దరియుం గానరాదు. భరతమునిచంద్రుఁడు మొదలు జగన్నాథ పండితరాయలవరకు రమారమి ముప్పదిమందికి మించి యాలంకారికులు గ్రంథముల రచించిరి. మనకు దొరకని గ్రంథము లెన్నియో చెప్ప నలవికాదు. ఇంక లభ్యములైనవన్నియు నొక మతమున నొక మార్గమున లేవు. అందుచేఁ బ్రాచీనమతములు నవీనమతములనుపేర నవి వేరొందెను. రసాలంకార గుణరీతులను బ్రాచీనములనియు, ధ్వని వక్రోక్త్యనుమా నౌచిత్యముల నవీనములనియు సంగ్రహముగా వచింతును. వీనిలో ధ్వని మతము సర్వతోముఖముగఁ బెంపొందెను. ధ్వని మతానుసారులు పెక్కండ్రు గలరు. వారువారు ప్రత్యేకగ్రంథముల రచించినను రసధ్వనుల నంగీకరించిరేకాని వానిని ని[illegible]చేను. కావ్యాత్మ నిర్ణయమునమాత్రము వివిధవి[illegible]ి. ఈ భేదములును నాయాగ్రంథ సంగ్రహము[illegible]ంపఁబడిన "కావ్యాత్మ" యందుఁ గాంచఁగలరు.

ఇంక ధ్వని మతానుసారులలో మమ్మటాచార్యుని కావ్యప్రకాశము మిగుల వన్నెకెక్కెను. ఇతఁడు వాగ్దేవతావతారుఁడని ప్రసిద్ధిఁగాంచెను. కావ్య ప్రకాశమున

కెన్నియో వ్యాఖ్యానములు, టీకలును గలవు. "కావ్యప్రకా
శస్యకృతా గృహే గృహే। టీకా తథాప్యేష తథైవ దుర్గమః"
యనియు "కావ్యప్రకాశే టిప్పణ్యః సహస్రం సంతి" యనియు
"టీకా కావ్యప్రకాశస్య కామం సంతు పరః శతాః" అనియు
వచింపఁబడుటచే నీగ్రంథప్రాశస్త్యము సహృదయులకే
విశదమగును. దీని కాంగ్లానువాదము రచింపఁబడి విదేశములఁ
గూడ విఖ్యాతిఁబొందెను, అట్టి సుప్రసిద్ధగ్రంథమునకు నాం
ధ్రానువాదము గాకున్న మానె, ఛాయాకృతియైన లేకుంట
చింతనీయము. సంస్కృత సాహిత్యాచార్యులకు మూల
గ్రంథములే కరతలామలకములగుట వారిచాయ దిలకింపరు.
కళాశాలయందు విమర్శనాగ్రంథములఁ జదివివిసిన యాంధ్ర
భాషా పారీణులకీ ప్రాప్తియేవలదు. అందుచే కావ్యాలం
కార సంగ్రహము, కావ్యాలంకార చూడామణియును రెండు
పుస్తకములతో నాంధ్రవిద్యార్థిలోక మానందింప వలసినదే.

ఆంధ్రమునందున్న యలంకార గ్రంథద్వయము విద్యా
నాథుని ప్రతాపరుద్రీయాదుల ననుసరించి రచింపఁబడుట పండి
తుల కందరకును విదితమే. ఆపుస్తకములలో లక్ష్యలక్షణ
సమన్వయము నెరుంగుట కనువైనవృత్తి, వివరణ, వ్యాఖ్యాన
ములు సంస్కృతగ్రంథములందున్న పగిదిఁగానరావు. సంస్కృ
తమున కారికావృత్తు లొకరిచేతను, లక్ష్యశ్లోకము లింకొ
కరిచేతను, వ్యాఖ్యానము మఱియొకరిచేతను రచింపఁబడును.
అందును కావ్యప్రకాశి కనేక టీకావ్యాఖ్యానము లున్నను
గ్రంథసరణి దుర్గ్రాహ్యము, దురవగాహమునై చెలంగును.

మఱియు మూల గ్రంథములం జదివి, వివిధమతముల నెఱింగుట కవకాశము చేసి పాఠకులకు వీలగునటుల భిన్నమతములనుగూడ నీ పుస్తకమున పొందుపఱచవలెనను కోరిక నా డెందమున నంకురించెను. ఈ కారణములచేం గావ్యప్రకాశమందలి కారికల సూత్రప్రాయముగ ననువదించి, వృత్తిని వివరించి, లక్ష్య పద్యములను రచించి, లక్ష్యలక్షణములకు సమన్వయ మొనరించి 'అలంకారమంజరి' యని పేరిడితిని.

"అందమగువస్తు వానందమందిరంబు"

"A thing of Beauty is a joy for ever"

"సత్యమే యంద మందమే సత్యమంచు।
నెఱుగుమిది చాలునే మీర లెఱుగవలయు॥"

"Beauty is Truth, truth beauty" - that is all ye know on earth, and all ye need to know"

"మధురమై వాచ్యశబ్దముల్ ముదమునించు।
మధురతరమయి వ్యంగ్యముల్ మదిగరించు"

"Heard melodies are sweet, but those unheard Are Sweeter"

అని పాశ్చాత్య కవీంద్రులును, "సత్యంశివం సుందరం" అని ప్రాచ్యసాహిత్యాచార్యులును వచించిరి. అందుచే నందమైనవస్తువె సత్యమైన యానందమునకు స్థానమని సహృదయావతంసులు సమ్మతింతురు. ఒకానొక వస్తువునందలి

యుండ చందములం గనులాటగాంచి, తనివిదీరం జవిగొనందలంచి
నచో దాని సముదాయరూప సౌకుమార్యమును, ప్రత్యేకాం
గరామణీయకమును రెంటినిగూడ జతపరచి పరికింపవలయు.
అప్పుడే వస్తువునందలి సమగ్ర సౌందర్య సర్వస్వమును స్వీకృతిక
పూర్తిగ సహృదయ శిరోమణులు కొల్లలాడనోపుదురు.
ఇట్టుల చక్కని రసంపుసిరుల విరివిగా జుర్రిగొనినంగాని సత్యమైన
యానందము సరసులడెందములం గందళింపదు.

ఇది యెట్లుల లభించునన్నచో, నాంగ్ల భాషావిమర్శనా
వివేకమునకు గీర్వాణ్వేషణ వాణీశత్వాలా విజ్ఞానమును జోడిం
పవలయును. ఈ సాహిత్యద్వితయమునకు దాంపత్య సౌఖ్యము
సంభవించినపుడే, యాంధ్రసారస్వత సుధాంశువదన షోడశ
కళావిలాస వికాసములను రసికశేఖరులు నయనానంద
ముగ వీక్షించి హృదయాహ్లాదకరముగ భావించి రససుధా
సాగరధ్వని తరంగసంచయముల దేలియాడుదురు.

ఇందులకు చేయూతగనే 'యలంకారమంజరి' యందు
ప్రాచీన నవీనాలంకారికుల సాంప్రదాయముల ననుసరించి రస,
వస్త్వలంకారాది వ్యంగ్యముల తత్త్వము నారోపించి యంత
ప్రదర్శించితిని. ఈ విషయమున కావ్యప్రకాశాది గ్రంథముల
లోని శ్లోకములలో కొన్నిటి నాలేఖ్యప్రాయములుగను, మరి
కొన్నిటి బింబప్రతిబింబ భావములుగను, వేరొక కొన్నిటిని
కేవల ఛాయారూపకములుగను, గైకొని తేటతెలుంగున
పద్యములుగా రచించితిని. ఈ యనువాదానుకరణముల

పట్టున, శబ్దశక్తివలఁ గలిగిన పద్యములలో, విరోధముచేనను ప్రాణితములై చెలంగు శ్లోకములకును, శ్లేషమూలమున నుపజీవితములై మెలంగు లక్ష్యములకును, సమాసోక్త్యాదుల మహిమవలన స్వతఃప్రకాశితములై వెలుంగు పద్యములకును, వానివానికిఁగల చమత్కార ప్రాధాన్యమును బాటించి యాయా పదములనే, యలంకారంబు ననుసరించియు, నర్థంబు నవలోకించియు, ఔచిత్యంబు నాదరించియు, నేను ప్రయోగింప ప్రయత్నించితిని.

ఈపద్యములలోని ప్రతీయమానార్థ విశేషములఁ జదువరులు సులభముగ నెఱుంగుట కాయాపద్యములఁ గొన్నిటికి విపులముగను, మఱికొన్నిటికి విరళముగను, వ్యాఖ్యాతల మతానుసారముగానే, గురులఘు టీకల రచించితిని. అందుచే చిత్రవర్ణ రచనా విన్యాసముంగాంచి కందోయికి విందుఘటింప నభిలషించు చతురభృంగ సంఘమునకును, కేసర రజోధూసర మిళిత పరిమళసమితిఁ దార్కొని, మూర్కొని, హర్షా ఘుః కలితస్వకీయ మధురగీతికానురణనముల శ్రవణపేయముగ వినఁ గాంక్షించు రసికద్విరేఫ సంతానములకును మకరందబిందువుల గుత్తుకబంటిగా ద్రావి మైమఱచి సంచరింప దలంచు సరస చంచరీక సంచయంబునకును, తదీయ ధారా పారముల దలమున్కలుగాఁ దేలియాడి డెందమును బరమానంద వివశము గావింప భావించు సహృదయ మిళిందబృందమునకును, సకలేంద్రియ సౌఖ్యమును ప్రసాదించి 'అలంకారమంజరి' తనుపనోపునని నా చిరతరాశయమై చెలువొందు

చున్నది. దీని చరితార్థతను జర్చింప సహృదయ హృదయులే సాక్షులనినచో సత్యదూరము గానేరదు.

ఇంక నీ పుస్తకమునందలి యలంకార ప్రకరణమునందు మమ్మటాచార్యుని మతమే పాటింపబడెను. కొన్నిచోట్లనితర మతములఁగూడ తిఙ్మాత్రము చర్చించితిమి. ఇంక కేవలాలంకారముల గురించియు, వానివానికిఁగల ప్రత్యేక వ్యక్తిత్వములఁగూర్చియు, వానిలోని భేద విభేదములను వివరింప బూనినచో నొకపుస్తకము పట్టును. దాని నెరుంగఁగోరువారు నాచే రచింపఁబడిన 'అలంకార చంద్రిక' యందు ప్రత్యేకాలంకారముల సంపూర్ణచరిత్రమును దిలకించఁగలరు.

'అలంకారమంజరి' లోని అభిధా, లక్షణా, వృత్తులును, భట్ట, లొల్లట, శ్రీశంకుక, భట్టనాయక, అభినవగుప్త పాదాచార్యుల రసమత విచారములును దురవగాహములుగనున్నవని మిత్రులుకొందరు వచించుటచే గ్రంథాంతమున ననుబంధముల విధించి వానిని సాధ్యమైనంతవరకు సుగమములుగా రచించితిని. మరియు చదువరుల యుపయోగమునకై యితర మతములఁగూడ వివరించితిని.

ఈపుస్తకమునందలి గుణదోషముల నారసి, గుణగ్రహణ పారీణులు దోషముల సూచించి, వాని నాకెరుకపరచినచో ముందు ముద్రణమున సవరించుకొందును.

అలంకారమంజరి నామూలముగ పఠించి, స్ఖాలిత్యముల నెన్నిటినో సరిజేసిన నామిత్రులు ఉభయభాషా ప్రవీణు

లైన బ్రహ్మశ్రీ శిష్టా లక్ష్మీకాంత శాస్త్రిగారి కెంతయుం గృతజ్ఞుఁడను.

ఈగ్రంథమును ముద్రించుట కెంతయు నాకును తోడ్పాటు గలిగించి ప్రూపుల నన్నిటి నత్యంత శ్రద్ధతో సరి జూచిన సౌభాగ్య ముద్రాశాలాధికారులు డి. సూర్యనారాయణగారి కెంతయు కృతజ్ఞుఁడను.

శ్రీముఖనామసంవత్సర
మార్గశీర్ష శుద్ధ తదియ
భానువాసరము,
విజయవాడ.

ఇట్లు,
సహృదయవిధేయుఁడు,
గ్రంథకర్త.
శే॥ వేం॥ రాఘవయ్యంగారు

# కృతికర్త వంశానుక్రమణిక

శ్రీరమణీ శిరోమణి యశేషసపర్య లొనర్చుచుండ శృం
గార గుణాభిరాముఁడనఁగాఁ గనకాచల సౌధమందు వి
స్తారముదమ్మునన్ దనరు తామసనాశునిలోకసన్నుతా
కారము సామవేదము జగన్నుతమయ్యెను గానమాధురిన్

అట్టి సామవేదమున ద్రాహ్యాయణశాఖ
సూత్రమందు భారద్వాజగోత్ర మలరు
లోకవిఖ్యాతమగుచు నాలోన శెట్టు
టూరువంశమ్ము లోక విస్తారితమ్ము.

ఆవంశాంబుధి చంద్రుఁడై పొడమె వేదాంతాదిశాస్త్రార్థ వి
ద్యావేశుండు తపఃప్రభావకలితుం డాభోగసత్కీర్తి ల
క్ష్మీవాల్లభ్యుఁడు సామవేదపఠనా శీలుండు గీర్వాణభా
షావార్యస్ఫురణుండు మూలపురుషుండౌ వేంకటాచార్యుఁడున్

ఆతఁడు కేతకీపుర జనాధిపు డాదరణమ్ము సేసి వి
ద్యాతిశయమ్ముగాంచి హృదయంబున సంతసమంది దివ్యభూ
షాతి ధనాగ్రహార వసనాదిసపర్యల గౌరవించ వి
ఖ్యాతితపోవిభూతి నలరారె మహాత్తకీర్తియుక్తుడై

అతనికి జన్మించిరి సం
తత వేదాధ్యయనరతులు ధర్మవిధిజ్ఞుల్
చతురవచోవిభవులు సూ
నృతగుణగణమూర్తులైన యేవురుపుత్త్రుల్

వారిలోన గనిష్ఠుం డశరథాసు
రాగ మాంతవార్ధి మంథనాచలుండు
వ్యాకరణ తర్క ధర్మశాస్త్రాది విదుండు
రాజరాజార్పితాగ్రహార నికరుండు

ఆతనికి జనించెను చతురాస్యుండు విబు
ధాగ్రగణ్యుండునగు నిఖిలాగమ ప్ర
సిద్ధ వాణీమనోహరుం డిద్ధగుణుండు
వీరరాఘవాచార్యుండు భూరియశుండు

తుంబురనారదాది మునితోయము లెల్ల మనంబులందు నా
డంబరమీగి భూమికి హుటాహుటిగాం జనుదెంచి మారువే
షంబులతోడ శిష్యులనుసంతతముం గుమిగూడి సామగా
నంబుల నేర్చుకొండ్రను దినంబును తత్ప్రధవయ్య చెంగటన్

మాడభూషికులాబ్ధి రమాలతాంగి
పరమసాధ్వీ శిరోమణి భవ్యచరిత
కనకవల్లిక యిల్లాలుగాగ సతము
గాంచె వేంకటాచార్య లోకప్రసిద్ధు

మెరపించునొకమారు మీమాంసశాస్త్రార్థ
వాదనాశేముషీ వైభవంబు
చవిచూపునొకమారు సామగానసుగాన
చాతురీనైపుణ్య సౌష్ఠవంబు

ప్రకటించునొకమాఱు భామతీవార్త్తిక
వ్యాఖ్యానవైఖరీ పాటవంబు
రచియించునొకమాఱు రమణీయసాహిత్య
శాఖినీవచన సంకర్షణంబు
సతతంబు కువలయానంద కళాకరుండు
వృషభసర్వజ్ఞమాళి విభూషణుండు
మాననీయుండు లలితసన్మార్గచరుఁడు
చంద్రసదృశుండు వేంకటాచార్యవరుఁడు

బంధుజనములపాలిటి భాగ్యరాశి
యర్థిచాతకావళికి వర్షాగమంబు
సీతమాంబికయందుఁ బ్రసిద్ధుఁడతఁడు
గాంచె వెంకటాచార్యు నఖండయశుని.

బంగరుపల్లకీల భటవర్గము నాల్గుకెలంకులందుఁ గొల్వంగఁ బురంబు సేగిన కళాకలితుండతఁడా గమాంతశాస్త్రాంగములభ్యసించి ఘనునాంగ్లము నేర్చియు రాజకీయులందుం గడుగౌరవార్హుఁడయి తుష్టివహించెను వేంకటార్యుఁడున్

అతనికిఁబోడమిరి నరసమాంబయందు
సుతులుముగ్వురు వితతయశోభరితులు
నందు నగ్రగణ్యుండు విఖ్యాతమూర్తి
రాఘవార్యుండు గుణములరాఘవుండు

పూర్వజన్మంబునందలి పుణ్యఫలమొ
కులసమాగత క్షేమలక్ష్మీవిలసనంబొ
శాక గురువునాశీర్వాద కారణంబొ
బాల్యమందునె పాండిత్యప్రతిభగాంచె

మొదిమొదిచెప్పిన మగని పొందు గోసి
శారదామహాదేవి యశ్రాంతమునని
సంస్కృతాంధ్ర కర్ణాట సాహిత్యభాష
లనెడు శాస్త్రచతుష్టయ మాశ్రయించె

పతిహిత ప్రవర్తనమందు బంధుజన స
మాదరణమున విలసద్గుణాళియందు
నెలతల తలమానికము మాణిక్యమాంబ
తనకు భార్యయై సేవింపఁదగ మనలెఁబు

బెజవాడ
10-7-34

ఉభయభాషాప్రవీణ
శిష్ట్లా లక్ష్మీకాంతశాస్త్రి
అష్టావధాని

———

# కృతిసమర్పణ

—:O:—

గీ॥ మాతృభూమికి తిలకాయమానులగుచు
మదనమోహనమూర్తులై ముదమునించి
సకలజనులకుఁ జిత్తరంజనులునగుచు
మందమందహాస ముఖారవిందులును మ
హాత్ములగు భారతీయుల కంకితంబు

గీ॥ వీరశృంగారములకు రవీంద్రులవలె
చెలువుగులుకు కళల సరోజినులరీతి
సరసులగువారి చిత్తరంజనమొనర్చు
కస్త్రల కవితల వర్ణింపగా దరంబె॥



## మం గ ళా చ ర ణ

సీ॥ వీనులవిందుగా వీణారవంబుతోఁ
గలకంఠగీతమునఁ గలిపి పాడ
"శారదా! దేవి! నీ సంగీతసాహిత్య
సరసతానములఁ గరఁచి వైచె
వాసిపరిపాక ప్రౌఢిమ వాణీశుఁ
డొక్కఁడే వినుతింప నోపుగాని
శ్రీనాథ సర్వజ్ఞ శేఖరులకు శక్తి
చాలదం"చు విరించి జాణతనము
గీ॥ నెరప మానిసి ముసిసగవుల మురువు గురిసి
పలుకులు తేఁజిలుకు కనుగొలఁకులఁ జూపు
జిహ్మ పైటకొంగును జక్కఁ జెక్కుకొని వి
ఱంచి పాయించు కాంతఁ దలంచువాఁడ

## గు రు స్మ ర ణ

గీ॥ సంస్కృతాంధ్రంబులం దపశబ్దభయము
పాయు భాషాసముద్రుని పగిదినన్నుఁ
జక్కఁదీర్చిన సహృదయచక్రవర్తి
'అప్పలాచార్య' వర్యుల నభినుతింతు
గీ॥ శబ్దవాక్య ప్రమాణ శాస్త్రము నేర్పి
కావ్యనాటకాలంకార కలితుఁ జేయు
విబుధుఁ 'వేమూరి రామగోవిందశాస్త్రి'
వరుల కర్పింతు భక్తిమై వందనములు

## నివేదన

కం॥ డెందముగరఁగించు రస
స్యందని కావ్యప్రకాశమంజూష విబుధుల్
మందప్రజ్ఞుఁడనగు నా
కుం దగమా వ్రాయ? శక్తిఁ గొలఁది యత్నింతుఁగా

ఆ॥ వె॥ తప్పులిందు కుప్ప తిప్పలు గలవంచు
బుధు లుపేక్ష సేయ బోలదిలను
ముండ్లతోడ నిండు మొగలిపూ రేకుఁ
దరుణులెలమిఁ దలను దాల్పరొక్కొ

గీ॥ వ్రాసె 'భరతుఁడు' కావ్యాత్మ "రస" మటంచు
నల "యలంకారసహిత శబ్దార్థసమితి"
జీవమని 'భామహాదులు' చెప్పినారు
"గుణము" ప్రాణమటంచు వాకొనియె 'దండి'
పలికె కావ్యాత్మ "రీతి" గా 'వామనుండు'

గీ॥ "ధ్వని" యటంచు 'నానందవర్ధనుఁడు' నుడివె
'కుంతలుండు' జీవంబు "వక్రోక్తి" యనియె
'మహిమ భట్టారకుఁ' "డనుమాన" మనియె
"నౌచితి" యటంచు క్షేమేంద్రుఁ డాడెఁ గాని
మతములన్నిట "ధ్వని" మహోన్నతి వహించె

గీ॥ తలప వాచ్యలక్ష్య వ్యంగ్యములను మూట
ముదమునించు వాచ్యార్థము మధురమయము
మదిగరంచు లక్ష్యార్థము మధురతరము
వలపుముంచు వ్యంగ్యార్థము మధురతమము

# విషయసూచిక

# పండితాభిప్రాయములు

—:O:—

1929 సంవత్సరములో నేను ప్రయోజనాంతరముపై బెజవాడకుఁ బోయియున్నపుడు శ్రీమాన్ శేట్లూరి వేంకట రాఘవ అయ్యంగారు తాము రచించిన అలంకారమంజరియొక్క వ్రాతప్రతిలోఁ గొంతభాగమును జదివి నాకు వినిపించిరి. ఇపుడుపూర్తిగా ముద్రితమైన యీగ్రంథము నొకప్రతిని నాకు వారు దయతో నంపిరి. నేనుదాని నామూలాగ్రముగాఁ జదివి పరిశోధించితిని. ఇందులోఁ బ్రాచీనాలంకార శాస్త్రములయందుఁ బ్రతిపాదింపఁబడిన ఉత్తమ మధ్యమాది కావ్యభేదములు, రసము, భావము, ధ్వనిభేదములు. వ్యంగ్య భేదములు, గుణములు, అలంకారములు మొదలగు విషయములు నిర్దుష్టముగా విశదమైనతెలుఁగుభాషలో మంచిశైలిని ప్రతిపాదింపఁబడినవి.

అలంకార శాస్త్రజ్ఞానము నభిలషించువారికిది మిక్కిలి యుపయోగకరము. ఇది విద్వాన్ శిరోమణి మొదలగు పరీక్షలకు పాఠపుస్తకముగా నేర్పాటు చేయఁబడదగినదని నా యభిప్రాయము. ఇట్టిపని మున్నెవరు చేసియుండలేదు.

అయ్యంగారలంకారశాస్త్ర ప్రవీణులయి యున్నందున ఆంధ్ర లోకమునకొక గొప్ప యుపకృతిని గావించియున్నారు.

ఇట్లు విన్నవించు,

విద్వద్వరేణ్య పాదరేణు పరమాణువు,
మేడేపల్లి వెంకటరమణాచార్యుడు.
(విజయనగరాంగ్లేయ కళాశాలా సంస్కృతాంధ్ర భాషాధ్యాపకులు.)

విజయనగరము,
15—12—1933.

---

మహారాజశ్రీ యస్. వి. రాఘవయ్యంగారుచే రచింపఁబడిన యలంకారమంజరియను గ్రంథమును సామోదముగఁ జదివితిని. కావ్యప్రకాశాది సంస్కృతాలంకార శాస్త్ర గ్రంథ నిక్షిప్త సిద్ధాంతోపన్యాసముల యథాస్థితముగ నాంధ్రీకరించుచు గ్రంథకర్తగారు తమ గాఢపరిశ్రమమును రూఢముగాఁ జూపియున్నారు. ఆంధ్రమున నలంకారశాస్త్రమును వచనరూపమున రచించుటలో నిదియె ప్రాథమికమనియు, నాంధ్రపాఠకుల కత్యంతోపకారి కాఁగలదనియు జెప్పుటకు సందియములేదు.

ఇట్లు సుజనవిధేయుఁడు

వఝల చినసీతారామశాస్త్రి
(ఆంధ్రవిశ్వ విద్యాలయ, కళాశాలా సంస్కృతాంధ్రోపాధ్యాయులు.)

విశాఖపట్టణము,
24—12—1933.

నేను S. V. రాఘవయ్యంగారి అలంకార మంజరి యను లక్షణగ్రంథమును సాకల్యముగా చూచితిని. ఇందు వ్రాసిన నవీనాలంకారిక సిద్ధాంతములను తేటపఱచిరి. మఱియు వైశేషిక ప్రాభాకర మతములకును నాలంకారిక సమయములకును గల భేదములను విశదీకరించిరి. ధ్వనులకుఁగల లక్ష్యలక్షణములను వివరింపుచు లక్ష్యంబులగు శ్లోకంబులను సామాన్యముగా నర్థము చెప నియుక తెలిగించిరి. ఈచేసినకృషి పండితమాత్రులకే వేద్యమగునను అలంకారశాస్త్ర పరిజ్ఞానమునకు దాదాపుగా నాటపట్టయి యున్నది తెలుఁగునందరుదుగ నున్న యాలంకారిక గ్రంథములలో కొఱంతను యీగ్రంథము తీర్చగలదు.

శిష్టా నరసింహశాస్త్రి గారలు.

బెజవాడ,
26-12-1935,

మిషను కళాశాలా ప్రధాన సంస్కృతాంధ్రోపాధ్యాయులు,
బందరు.

శ్రీ మ త్ప ర దే వ తా యై న మః

శ్రీమదుభయ వేదాంత ప్రవర్తకుల గు
యస్. వి. రాఘవయ్యంగారికి.

అయ్యా!

తమ అలంకారమంజరి గ్రంథమునుగూర్చి బ్ర॥ శ్రీ॥ శిష్టా నరసింహశాస్త్రులవారి అభిప్రాయముతో నేనేకీభవించు చున్నాను.

చిత్తగించవలెను,

కడియము
తూ॥ గోదావరి,
24—1—'4

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి,
(శతావధానులు.)

శ్రీ రాఘవయ్యంగారు రచించిన అలంకారమంజరి అను లక్షణగ్రంథము సాంతముగా సాదరముగాఁ జదివితిని. లక్ష్యలక్షణ వివరణాదులఁ జాలవఱకు కావ్యప్రకాశాది గ్రంథముల ననుసరించియుఁ గొంతవఱకు స్వతంత్రించియు నున్న యీలక్షణము తెలుఁగున నాలంకారిక లక్షణము లతిస్వల్పముగా నున్నవనెడి కొఱంత నించుక తీర్చినదనియుఁ దలంచితిని. గ్రంథకర్త దాని నించించుక సవరించియు, తెలుఁగు రుచికిఁ దగినట్లు పెంచియు నాంధ్రుల ప్రోత్సాహమున నచిరకాలమున ద్వితీయముద్రణమునకుఁ దెచ్చి యాంధ్రమున కుత్తమసేవ చేయుఁగాక యని యభిలషించుచున్నాను.

ఇట్లు,

విశాఖపట్టణము,
1—3—1934

మల్లాది సూర్యనారాయణశాస్త్రి.
(ఆంధ్రవిశ్వ విద్యాలయ కళాశాలా
సంస్కృతాంధ్రోపాధ్యాయులు.)

---

Dear Sir,

Your P. C. and the book-along with it, in Camp......

The book is really useful for the Telugu Students undergoing Vidwan course as it is a fairly good version into Vernacular of the Classic writers on Rhetoric ... .....

Yours Sincerely,

Camp
Udipi
31-8-33

L. VENKATA RATNAM, M.A., L.T.,
[Superintendent of Sanskrit Schools
Madras Presidency.]

---

I have read this translation of Alamkara Manjari by S.V. Raghava Iyengar with greatest delight. I had observed his aptitude and interest in Alamkara Sastra while in College. I am so glad he has not only kept up his zeal for the subject but also thought it fit to enrich Telugu Literature by such translations as the present work.

There are only three old works, worth the name in Telugu the కావ్యాలంకార చూడామణి of విన్నకోట పెద్దన; the నరసభూపాలీయ of మూర్తి and చంద్రాలోక of అడిదము సూరకవి. In modern times, the చంద్రాలోక has been again translated by M.R.Ry., Taduri Lakshmi Narasimham Garu of Rajahmundry· but all the above are in difficult Verse which

is so unsuitable especially in Telugu for the expression of scientific thought.

The present translation by Mr. Raghava Iyengar is just the kind of treatise that can create interest in Alamkara Sastra among the Telugu public. It shows grasp, simplicity & comprehensiveness. The anxiety of the translator to make himself as intelligible as possible to his readers is evident throughout. The Verses written in illustration of the main rules & explanations thereof are fine and running as is generally not the case in similar translations now being made.

I congratulate Mr. Raghava Iyengar on the very able rendering of the work and wish him to add to such works in Telugu.

Anantapur,
20-1-1934

C. NARAYANA RAO,
M.A., L. T., Ph. D,
Lecturer in Languages
Sanskrit Telugu & Canarese,
Ceded Districts College.

# అలంకారమంజరి.

## ప్రథమసుమము.

### ధర్మార్థ కామమోక్ష ఫలప్రదమై కావ్యము వెలుంగును.

అనఁగాఁ గాళిదాసాదులకువలెఁ గీర్తినిఁ జేకూర్చి, శ్రీహర్షాదులకుఁబోలె ధనమును సంపాదించి, మయూరాదులరీతి దుఃఖములఁబోఁదోలి, విగళిత వేద్యాంతరము సకలప్రయోజనమౌళి భూతము, పరబ్రహ్మాస్వాద సబ్రహ్మచారియునైన రసాస్వాదానందమును సత్కావ్యము సమకూర్చునని కావ్యతత్త్వవిదులు వచింతురు. ఇట్టి చతుర్వర్గఫలసంపాదకమైన సరసకావ్యము, వేదపురాణేతిహాసాదులకన్న విలక్షణమై ప్రకాశించుచుండును. శబ్దప్రధానములయిన వేదములు ప్రభుసమ్మితములుగను, నర్థతాత్పర్య ప్రధానములైన పురాణేతిహాసములు మిత్రసమ్మితములుగను వెలుంగుచుండును. ఇంక కావ్యములన్నచో శబ్దార్థగుణభావసముపేతములై రసాంగభూత వ్యాపారప్రవణములై లోకోత్తర వర్ణనానిపుణ కవివ్యాపారాశ్రయములయి కాంతామణికైవడి సరసతాపాదకములై, చదువరుల నభిముఖులుగా నొనరించి రామాదులవలె వర్తింపవలయు ననియు, రావణాదుల

పగిదిఁ జరింపరాదనియు, బోధించి సన్మార్గవర్తనులఁ గావించి వారికపరిమితానందము నొసవించును.

ఇంక నిట్టికావ్యముల రచించువారలకు, లోకవ్యవహారము, శాస్త్రజ్ఞానము, కావ్యచింతనము, కావ్యాభ్యాసకౌశలము, విమర్శనావివేకము, ప్రతిభావికాసము మొదలైనవి సాధనములై క్రాలుచుండును. 2

ఈహేతువు మూలముననే దోషరహితము, గుణసహితము, కొన్నివేళల నలంకారదూరమునై శబ్దార్థసముపేతమైన కావ్యముల రచించుటకుఁ దగిన శక్తి లభించునందురు. 3

అలంకారదూరమనినచో నలంకారము స్ఫుటముగాఁ గానరాకుంటయే. ఇచట నలంకారభూషితముగాకున్నను గావ్యమున కెట్టిలోటును సంభవింపదనియే మన మెఱుఁగవలయును.

ఇందులకు నుదాహరణము.

సీ॥ ఆకారరేఖాదులరయంగఁ గౌమార
హారుఁ డెవ్వఁ డాతఁడే హరుఁడు సుమ్ము
అయ్యదియేకూడ నరవిచ్చిపూచిన
మాలతీసురభిసంపదలు సుమ్ము
ప్రౌఢకదంబానిలంబులు నవియె ను
న్మత్తయ్యాపిగనే చైత్రయామినులును
నేనుగూడను నాపెనే యాదునైనను
సుఖపరంపరమేను సొమ్మసిలదు

గీ॥ మనపు రేవానదీ తీరమునఁ జెలంగు
వేతసీ వృక్షతలమున వివిధలీలఁ
జరుపు సురతపు వ్యాపార చర్యలందు
మానసము సముత్కంఠతఁ బూనుచుండె

ఇచట నేయలంకారమును స్ఫుటముగాఁ గన్పట్టదు. ఇచట రసము ప్రధానమేకాని, యలంకారమునకు ప్రాముఖ్యత లేదు. కొందరీపద్యమున విశేషోక్త్యలంకారమనియు, మఱికొందరిందు రసవదలంకారమనియు వచింతురు. ఈ యలంకారము లస్ఫుటములై ప్రకాశించుటవలన వీనికి ప్రాధాన్యము గానరాదు. ఇంక నీపద్యమున స్ఫుటముగా రసధ్వని కానవచ్చును. అందుచేతనే దీని నుత్తమ కావ్యమునకు లక్ష్యముగా సహ్రుదయశిరోమణు లంగీకరించిరి. ఇందు రసముచిందుచున్నను నది వ్యంగ్యమూలకమై యందములొలుకుచుఁ జదువరులడెందముల నానందమును బొందించుచున్నది. ఈ పద్యమున ధ్వనియే కావ్యాత్మగా బరిగణింపఁబడెను.

మఱియుఁ గొందరీపద్యమునుగూడ నుత్తమకావ్యముగ నంగీకరింతురు.

చ, చనుమొనపైని చందనము జారెను; కాటుకమాసె కన్నులందున; నధరంబునం దెరుపుతొలఁగెను; నీనును మేను పుల్కరించెను; నన్నృతోదరీ ! చెలులచెట్టఁదలంపనిదాన ! దూతికా ! కొనకొని బావికేగితివొకో ? యధమాధము చెంతకేగక ॥ 2

ఇచట 'నీవు వానితోడ రమించుటకేగితివ' ని 'యధమాధమశబ్దము' సూచించుచున్నది.

ఎచట శబ్దార్థయుగళము గప్పఁబడి దానిమూలమున నతిశయానందసంధాయకం బైన విశేషార్థముచదువరులకు స్ఫురించుచుండునో, యచట ధ్వనియని బుద్ధిమంతులు పలుకుదురు.

దీనినే ధ్వన్యర్థము, వ్యంగ్యార్థ మని బుధులు వ్యవహరింతురు. ఈధ్వని ముఖ్యముగ మూఁడువిధములు. రసధ్వని, వస్తుధ్వని, యలంకారధ్వని యని. ఈమూటిలో రసధ్వని యుత్తమోత్తమమై భాసిల్లును. అందువలననే పై పద్య ముత్తమకావ్యముగా నెన్నఁబడెను.

ఇంక గుణీభూతవ్యంగ్యమును మధ్యమకావ్యముగాఁ జెప్పెందురు వ్యంగ్యమెచటప్రధానముగాక వాచ్యముతో సమప్రాధాన్యమును వహించునో లేక దానికి వన్నెకూర్చునో దానినే గుణీభూతవ్యంగ్యమందురు. 5

ఎట్లనః—

గీ॥ నవ్యవంజుల మంజరీ సాధకరుని
గ్రామ తరుణావతంసుని గాంచినంత
తరుణరమణీముఖచ్ఛాయ తనకుఁదానె
మాటిమాటికిఁ గళబాసి మలినమయ్యె 3

ఈ పద్యమున వాచ్యమే ముఖ్యమై చెలంగుచున్నది. వ్యంగ్యార్థము వాచ్యార్థమునఁ గలసిపోయెను. ఇచట 'వంజుల

లతానికుంజము.' ను సంకేతముగ నేర్పరచి నీవచటకు రాకుంటి వను వ్యంగ్యార్థము (ముఖచ్ఛాయ తనకుఁదానె మాటిమాటికిఁ గళదాసి మలినమయ్యె' నను వాచ్యముపై నాధారపడి యున్నది. అందుచే దీనిని గుణీభూత వ్యంగ్య మనియు, నా కారణమున నిది మధ్యమకావ్య మనియుఁ గావ్యతత్వ కోవిదులు కొనియాడుదురు.

ఇంక శబ్దచిత్రము, వాచ్యచిత్రముఁలఁ జెలంగుచు ప్రతీయమానార్థ రహితమై మెలంగుదానినే యవర మందురు. 6

అవరకావ్యమనఁగా నధమకావ్యమని యర్థము. ఈ యప్రసిద్ధకావ్యమునకు నుదాహరణమును జదువరులు స్వయముగ నూహింపఁగలరు. ఎట్లన-

గీ॥ ఏడ దార లుదారలో యాడఁ జూడఁ
గాంతులెన్నంగఁ గాంతులు గారనుమ్మ
ఏడ కాంతులు కాంతులో యాడఁజూడ
దారలరయ నుదారలు గారుచుమ్మ

మరియు,

గీ॥ బాలమలయానిల మిలనోల్బణములైన
లలిత కలకంఠ కలకలాలాపములను
మధురమధువిధురాలప మధుపసంత
తులను మాధవుఁడీ ధరవలపుఁగులుకు. 5

# ద్వితీయ సుమము

కావ్యమునందు వాచకము, లాక్షణికము, వ్యంజకము
లన శబ్దములు మూఁడు విధముల వెలుఁగొందును. 1

వాచకాదుల యర్థము వాచ్యము, లక్ష్యము, వ్యంగ్యమనఁ బడును. కొందరిమతమున తాత్పర్యార్థముకూడ వచింపఁబడెను. వక్ష్యమాణస్వరూపములైన పదార్థములకు పరస్పరసమన్వయమున, నాకాంక్షా, సన్నిధి, యోగ్యతా వశమున నపదార్థమైనను వాక్యార్థము తాత్పర్యార్థమనుపేర విశేషాకృతిని విలసిల్లుచుండునని యభిహితాన్వయ వాదులమతము. ఇఁక నన్వితాభిధానులన్నచో వాచ్యమే వాక్యార్థమని వాదింతురు.

ఇచట మొదటిది వైశేషికమతము లేక భాట్టన్యాయమని పేరొందెను. రెండవది మీమాంసమతము లేక ప్రాభాకరమతమని పిలువఁబడును. భాట్టన్యాయమునఁ దొలుత సామాన్యార్థ ప్రతీతికలుగును. పిదప నన్వయసందర్భమునం బదార్థములకు విశిష్టార్థప్రతీతి సంభవించును. పదములు తమతమ యర్థమును వచించి నివృత్త వ్యాపారములగును; ఈ యవగతార్థము పిదప నర్థాంతరమును బోధించునని భాట్టమతము లేక యభిహితాన్వయవాదిమతము. ఇంక ప్రాభాకరపక్షమున నాకాంక్షాది వశమున నొండొంటితో సామాన్యముగ నన్వితములైన పదములే ప్రధానగుణత్వమున ననుగతపద సమూహరూపమై విశేషా

కృతిని వాక్యార్థమును బలుకుటంజేసి వాచ్యమే వాక్యార్థమని ప్రఖ్యాతివహించెను. ఇదియే యన్వితాభిధానవాది మతముగా గణనకెక్కెను. ప్రాయికముగ నర్థముల కన్నింటికిని వ్యంజకత్వము సంభవించును.

గీ॥ అమ్మరో! నీవు సాధించినట్టి యింటి
వంటకంబులు చెల్లెను; నాకిప్పు
డేమి చేయంగవలయునో యెఱుగఁ జెపుమ
నీడఁ జూచినచోఁ బ్రొద్దునిడుపు లేదు॥

ఇచట వాచ్యమునకు వ్యంజకత్వము లభించుచున్నది. ఈపద్యమున వక్త్రవైశిష్ట్యమున స్వైరవిహారార్థిత్వమును; గృహోపకరణత్వమున నవశ్యవిధేయకత్వమును వ్యంగ్యమగుచున్నది.

గీ॥ లలన! నామూరు సాంత్వనాలాపములను
సుందరాకారువకుఁజేసి సొలసితకట
నిజము; సద్భావవృత్తియు స్నేహగుణము
చేయుకార్యము లితరిఁ జేయఁబడియె॥

ఈ పద్యమునందు లక్ష్యమునకు వ్యంజకత్వము గలుగుచున్నది. ఇచట నాప్రియునిఁగూడి నాకు శత్రుత్వ మాచరించితి వని లక్ష్యార్థము. దీనివలన గాముకవిషయ సాపరాధత్వ ప్రకాశనము వ్యంగ్యమగుచున్నది.

గీ॥ కనుము! నిశ్చలనిష్పందకలితమతినిఁ
బ్రాలెడిబలాక మఱ్ఱపత్రంబునందు
సురుచిరాకార మరకతహారితపాత్ర
దాపఁబడినట్టి శంఖ ముత్యంబులీల

ఇందు వ్యంగ్యమునకు వ్యంజకత్వము సంభవించుచున్నది. ఈపద్యమున నిష్పందత్వమనుటచే నాశ్వస్తత్వము లేక భయరాహిత్యమును, దానివలన జనరహితత్వమును, సూచించును. కావున సంకేతస్థానమిదియని యొకానొక నాయిక నాయకునితోఁ బలుకుచున్నది. అట్లు కానిచో 'నీవుబొంకుచుంటి వచటకు నీవురాలే' దను వ్యంగ్యార్థము స్ఫురించును.

ఏశబ్దము సాక్షాత్సంకేతితార్థమును ప్రచురించునో యదివాచకము. 2

ఇచట నగృహీతసంకేతములైన శబ్దములకు, నర్థప్రతీతి సంభవింపదు; కావున సంకేత సహాయమునసే శబ్దములర్థవిశేషమును ప్రతిపాదించును. అందుచే నెచట నవ్యవధానమున సంకేతము గృహీతమో దానినే వాచకమందురు.

సంకేతము చతుర్విధము; జాత్యాదుల వలన నదికలుగునందురు. కొందరు జాతిమూలమున నే లభించు నందురు. 3

ప్రవృత్తి నివృత్తి యోగ్యమై వ్యక్తియే యర్థక్రియాకారియై విలసిల్లును. అయిన నానంత్యము, వ్యభిచారములను దోషములవలన సంకేత మను విధించుటకు శక్యము గాదు. మఱియుఁ "గట్టి యూవు పోవుచున్నది బుట్టి" యను వోఁ బదములకు విషయ విభాగ మొనరించుటకు నీలు లేదు. అందుచే వాని యుపాధుల యందే సంకేతము సంభవించును.

ఇంక నుపాధి ద్వివిధము. వస్తుధర్మము; వక్తృయదృచ్ఛాసన్నివేశితము. నన: జెలంగును. వస్తుధర్మము, సిద్ధము సాధ్యమన రెండు తెరంగులు. పదార్థమునకుఁ బ్రాణప్రదము, విశేషాధానహేతు వన సిద్ధము ద్వివిధము. ఇందు మొదటిదే జాతినాఁ బడును. ఆవు స్వరూపముచే నావు కాదు. ఆవుకాకపోదు. గోత్వాభి సంబంధమునసే గోవుగాఁ జెలంగు నని వాక్యపదీయమునఁ జెప్పఁబడెను. ఇంక రెండవది గుణమనఁబడును. కట్టి మొదలైనవి లబ్ధసత్తాకమై వస్తువుకన్న వేరుగానుండును. పూర్వాపరీ భూతావయవ క్రియారూపమే సాధ్యమనఁబడును. బుట్టి మొదలైన శబ్దములలో నంత్యబుద్ధి నిర్గ్రాహ్యము. సంహృత క్రమ స్వరూపమై వక్తృ యదృచ్ఛచే బుట్టి మొదలైన యర్థములందు పాధిత్వమున సన్నివేశితమైన నదియే యదృచ్ఛాత్మక సంజ్ఞా రూపమనఁ జెలువొందును.

"కట్టి యూవు పోవుచున్నది బుట్టి" యను దాని యందు శబ్ద ప్రవృత్తి చతుష్టయమని మహా భాష్యకారుఁడు వచించె. పరమాణ్వాదులకన్న చో గుణమధ్యపాతమువలన

గుణత్వము పారిభాషికము. గుణక్రియా యదృచ్ఛములకు సామాన్యముగ నేకరూపమైనను నాశ్రయ భేదమున భేదమున్నట్లే కనుపట్టును. ఎట్లన ఖడ్గ ముకుర తైలాద్యాలంబన భేదమువలన ముఖ మొకటియే యైనను భేదము గానవచ్చును. హిమ పయశ్శంఖాద్యాశ్రయములందుఁబరమార్థము నకుఁ దెల్లఁదనము వేర్వేరైనను, దేనివలనఁ దెలుపు తెలుపనఁ బేరున సామాన్యముగఁ బలుకఁబడునో యారీతినే జాతియని వ్యవహరింపఁబడును. ఇటులే గుడతండులపాకాదులయందుఁ గూడ పాకత్వాది వ్యవహారము లభించును. బాలవృద్ధ శుకాదు లుచ్చరించిన బుట్టి మొదలైన పదములు ప్రతిక్షణమున భేదించుచున్నను- ఏట్లన "బుట్టి" యను పేరును వేరొక నిముషమున మఱియొక వస్తువునకు పెట్టవచ్చును- బుట్టి యను పేరు లేక దాని యర్థ మా వస్తువునందు వర్తించును. కావుననే శబ్దములన్నింటను జాతియే ప్రవృత్తి నిమిత్తమని యన్యులు లేక మీమాంసకు లందురు.

జాతి మతి వ్యక్తియే శబ్దార్థమని వైశేషిక మతము. మఱియునపోహయే శబ్దార్థము బౌద్ధసిద్ధాంతము. ఈ మతములు ప్రకృతానుపయోగము లగుటను, గ్రంథగౌరవ భయమునను వివరింపఁబడలేదు.

ఈ సాక్షాత్సంకేతితార్థమే ముఖ్యార్థము.
దీనినిబోధించు వ్యాపారమే యభిధావ్యాపార
మనఁబడును. 4

ఈ వాచ్యావగమన శక్తిని నభిధాశక్తి యందురు.

> ముఖ్యార్థమునకు బాధకలుగఁగా, దాని వెను
> వెంటనే రూఢిలేక ప్రయోజనాపరముగ వేరొక
> యర్థము కలుగుచో నదియే లక్ష్యార్థ మనఁ
> బడును. దీనినే యారోపిత క్రియాలక్షణ యని
> పేర్కొందురు. 5

"పనియందుకుశలుఁడు,, ,,గంగయందు గొల్లపల్లె" యను వాక్యముల, దర్భగ్రహణాద్యయోగము వలనను, గంగాదుల ఘోషాద్యాధారత్వాసంభవమునను, ముఖ్యార్థమునకు నన్వయానుపపత్తి కలుగుచున్నది. ఇంక మొదటి వాక్యమున వివేచకత్వమునకును, రెండవ వాక్యమున సామీప్యమునకును సంబంధము సుప్రసిద్ధము. మొదటి వాక్యమున లక్ష్యార్థము రూఢిమూలము. ఇంక గంగయొడ్డున గొల్లపల్లె యను వాక్యము ప్రయోగింపఁబడినచో గంగయందు గొల్లపల్లె యను దాని యందువలెఁ బావనత్వాది ధర్మములకుఁ బ్రతీతి సంభవింపదు. అందుచే నిందు లక్ష్యార్థము ప్రయోజనామూలము. ఇచట ముఖ్యార్థమున నముఖ్యార్థము లక్షితమగుచున్నది. ఇచట నారోపితమైన శబ్దవ్యాపారము, సాంతరార్థ నిష్ఠ మగుటచే లక్షణ యనుపేరఁ బరగుచున్నది. ఇంక నిరంతరార్థ నిష్ఠశబ్ద వ్యాపార మభిధ యనఁ జెలంగును.

స్వసిద్ధికొఱకు పరాక్షేపము సంభవించినచో
నుపాదానయనియు, పరార్థమునకై స్వసమర్ప
ణముచేయఁబడినచో లక్షణయనియు, శుద్ధలక్షణ
రెండుతెరంగులఁ జెలంగును. 6

„ఈకెలుపవేశించుచున్నవి” „కట్టెలువచ్చుచున్నవి”
యనునప్పుడు ఈకెలు మొదలైనవి తమకుతాము రానేరవు
కాన, నవివచ్చుటకై వాటినిధరించిన పురుషులను గూడ
గ్రహించుటంజేసి దీనినే „యుపాదానలక్షణ”యందురు.

„ఈయావు చంపఁబడవలె” ననుచో శ్రుతిచోదితమైన
యనుబంధ మెట్లుకలుగవలెనను ప్రశ్నముదయించును. జాతిచే
వ్యక్తియే గృహీతమగునుగాని శబ్దమున నాక్షేప్యము కానేరదు.
„విశేషణము క్షీణశక్తిగలదగుటచే విశేష్యమభిదనుపొంద”
దనున్యాయమునను సరించి యిచట నుపాదానలక్షణ యనుటకు
వీలులేదు. ఇచటఁ బ్రయోజనము గానరాదు. ఇంక నిట రూఢి
లేదు. వ్యక్తి యవినాభావిత్వము గలదగుట జాతిచే వ్యక్తి
యాక్షిప్యమగును. ఎట్లన „చేయఁబడుఁగాక” యనుచోఁ
గర్తయుఁ; “జేయుమ” నుచోఁ గర్మయుఁ „దినుమ”నుటచే నన్న
మును, „రమ్మ”నుటచే నింటిలోనికనియు మనము గ్రహించు
చున్నాము. ఉపాదానలక్షణను నజహల్లక్షణ యనియు; లక్షణ
లక్షణను జహల్లక్షణ యనియుఁగూడ పలింతురు.

"బలిసిన దేవదత్తుఁడు పవలు భుజింపఁడ" నుచో రాత్రి భుజించుట లక్షితముకాదు. ఇంకనది శ్రుతార్థాపత్తి లేక యర్థాపత్తి మూలకమును సంభవించును.

"గంగయందు గొల్లపల్లె" యనుచోట గొల్లపల్లె యొక్క నుండుటఁజేసి గంగా శబ్దము స్వార్థము నర్పించుచున్నది. దీనినే లక్షణామూలకమైన లక్షణగా భావింతురు.

ఈ రెండు రూపములు శుద్ధ లక్షణ చెలంగును. ఇది యుపచారమనే యమిశ్రితత్వమై సంభవించును. అనఁగా స్వభేదప్రతిపత్తి పూర్వకముగ నభేదము గలదు. ఇచట లక్ష్య లక్షకములకుఁగల భేదరూపము తాటస్థ్యముకాదు. గంగాది శబ్దములకు తటాది ప్రతిపాదనము తత్ప్రతిపత్తిప్రయోజనాది సాధ్యసిద్ధి కొఱకే సంభవించును. ఇంక గంగా సంబంధ మాత్ర ప్రతీతి కొఱకుగానే భావింతుమేని "గంగ యొద్దున గొల్లపల్లె" యను ముఖ్య శబ్దాభిధానమునకును లక్షణకును భేదమేమికలదు?

ఎచట విషయీ విషయములు చెప్పఁబడునో
దానిని సారోప లక్షణయని పేర్కొందురు. 7

ఆరోప్యమాణమను నారోప విషయమును గూడ నన పహ్నుత భేదములై సామానాధికరణ్యమున నిర్దేశింపఁబడునో దానినే సారోపలక్షణయందురు. ఈలక్షణనే యుపచారమిశ్రము లేక గౌణ మని వచింతురు. గవాదులు విషయి వాహీకాదులు విషయము.

విషయియందు మఱొకటి యంతర్నిగీర్ణమైనచో
దానిసి సాధ్యవసాన లక్షణయందురు. 8

ఆరోప్యమాణమునందు నారోప్యవిషయము నిగీర్ణమైనచో దానినే సాధ్యవసానమందురు. ఇచట విషయిమాత్రమే నిర్దేశింపఁబడును. విషయము తిరోభావము సెంది యుండును. ఇట భేద మనుపస్థితము.

ఈభేదములు సాదృశ్యాత్మకములు, సంబంధాం
తరములు నై సంభవించును. సాదృశ్యాత్మక
ములు గౌణము లనియు సంబంధాంతరములు
శుద్ధములనియుఁ దెలియవలయును. 9

ఇచట నారోపాధ్యవసాన రూపలక్షణలు సాదృశ్యహేతుక భేదములు „ఎద్దేబండి వాఁడు" „ఎద్దేవీఁడుసుమా" యనునవి వీనికి నుదాహరణములు. ఇచట నర్థసహచారిణు లయిన గుణములు జాడ్యమాంద్యాదులు (చండితనమును, మొద్దుతనము మొదలయినవి) కన్పట్టుచున్నను ననఁగా లక్ష్యమాణములగుచున్నను నెద్దనుమాట పరార్థాభిధానమునందు ననఁగా బండివానివిషయమున ప్రవృత్తి నిమిత్తత్వమును బొందుచున్నదని కొందరిమతము. స్వార్థసహచారి గుణాభేదము నందే పరార్థగత గుణములే లక్షితములు కాని పరార్థాభిధానములేదని మఱి కొందరందురు. ఇట్లు కాక సాధారణ గుణాశ్రయముచేఁ బరార్థమే లక్షితమని యపర మతము. ఇదియే మమ్మటాచార్య మత మందురు.

అవినాభూత ప్రతీత్యభిధేయమే లక్షణగా వచింపఁబడును. లక్ష్యమాణ గుణయోగము వలనఁగలుగు వృత్తియే గౌణమనఁబడు ననితంత్రవార్తికమునఁ జెప్పఁబడెను.

ఇచట నవినాభావము సంబంధమాత్రమేకాని నాంతరీయకత్వము గాదు. రెండవ పక్షమున ననఁగా నాంతరీయకమైనచో "మంచెలు మ్రోయుచున్న" వనుచోట లక్షణకానేరదు. ఇట్టిచో నవినాభావ మపేక్షా మూలమననే సిద్ధించుటం జేసి లక్షణవలన నుపయోగము లేకుండును.

"ఆయుర్వేఘృతము" „ఆయువదియే సుమా" యను వాక్యములలో సాదృశ్యమునకన్న వేఱైన కార్యకారణభావాది సంబంధాంతరముగలదు. ఇట్టిచోట్ల కార్య కారణ భావాది లక్షణ పూర్వమై యారోపాధ్యవసానములుండును. అభేదమైనను గౌణ భేదములఁ దాద్రూప్య ప్రతీతి యన్నిటను నభేదాగమనమును బ్రయోజనమై కానవచ్చును. ఇంక శుద్ధభేదములలో నన్య వైలక్షణ్యమునను నవ్యభిచారమునను గార్యకారిత్వాది ప్రయోజనము సంభవించును. కొన్నియెడలఁ దాదర్థ్యమున నుపచారము - ఎట్లన „నింద్రార్థము స్థూణము; ఇంద్రుడు" కొన్నిట స్వస్వామిభావమున-ఎట్లన „రాజుయొక్క-మనిషి; రాజు" కొన్నిచోట్ల నవయవావయవిభావమువలన; నెట్లన „ ముంజేయి" యనుచో ముందున్న యవయవమైన చేయియనియర్థము. కొన్నిపట్టులఁ దాత్కర్మ్యమువలన; నెట్లన „వడ్రింగి" యనఁగా వడ్రింగికానివాఁడనఁగా గొల్లవాడు మొదలయినవారని భావము.

ఈవిధమున లక్షణ యాఱుప్రకారములఁ జెలంగును

మొలుత లక్షణ శుద్ధము గౌణమని ద్వివిధము. అందు శుద్ధ ముపాదానలక్షణ లక్షణలక్షణ యని రెండు తెఱంగులు. ఇవి రెండును ప్రత్యేకముగ సారోప సాధ్యవసానము పేరుల శుద్ధలక్షణాభేదము నాలుగుప్రకారములు. ఇంక గౌణలక్షణ సారోప సాధ్యవసాన మన ద్వివిధము. ఇవియన్నియుఁ గలసి లక్షణషడ్విధములు. ఇది సంక్షేపముగ లక్షణావిచారము.

రూఢిమూలక మైనచో వ్యంగ్య రహితమై
ప్రయోజనామూలకమైనచో వ్యంగ్యసహితమై
వెలుంగును. 10

వ్యంజనవ్యాపారగమ్యమై ప్రయోజనము వెలుఁగును.

అది గూఢము లేక యగూఢమునయి కాన
వచ్చును. 11

అది యనఁగా వ్యంగ్యము. కావ్యభావనా పరిపక్వ బుద్ధులే సహృదయులు. వారికిమాత్రమే తెలియునది గూఢము. ఇతరుల కందఱకును దెలియునది యగూఢ మనఁబడును.

గూఢము.

9 చ॥ కలికి మెఱుంగు వాల్గనులు, కైవశముం బొనరించు రూపముల్
గులుకు బెడంగు పోకడలు, కొంచెముకాని పిఱుందు చందముల్

మొలక కుచంబు సొంపులును మోహము మోదముఁగూర్చు మేలు పొం
దళుకులనీను జవ్వనము లేఁపురసాననమేన బాపురే!

అగూఢము

గీ॥ జడులు నైతము శ్రీపరిచయము చేత
గురుకులుంగుడుగు విదగ్ధ సంవేశులను
దలఁపఁగా యౌవనమదంబె లలితములను
గామినుల కుపదేశించుఁగాద సతము.

ఇచట నుపదేశించు ననుటచే ననాయాసముగ శిక్షా
దానము వాచ్యమూలకము ననే స్ఫుటముగాఁ జదువరులకుఁ
బ్రతీతమగును.

ఇది యవ్యంగ్యము, గూఢవ్యంగ్య మగూఢవ్యంగ్య మని
మూఁడువిధముల (గథితము.) దాని కాశ్రయమైన శబ్దమే లాక్ష
ణికము. అచట వ్యాపారము వ్యంజనాత్మకము. ఎట్లనిన

శబ్దైక గమ్యమై లక్షణాసముపాస్యమై ఫలము
నకుఁ బ్రతీతికల్గునపుడు వ్యంజనమునకన్న వేరు
వ్యాపార ముండదు. 12

అనఁగా లక్షణాశ్రయ శబ్దప్రయోగ మూలముననే
దానిప్రయోజనము ప్రతిపాదిత మగునుగాని వేరొండుక్రియచేఁ

గా నేరదని భావము. కావున వ్యంజనకన్న భిన్నమైన వ్యాపారములేదు.

సముదాయాభావము కతమున నిది యభిధవలన
సంభవింపదు 13

„గంగయందు గొల్లపల్లె" మొదలైన వాక్యములఁ బావనత్వాదులైన ధర్మములు తటాదులఁ బ్రతీతమగుచున్నట్లు గంగాదిశబ్దముల సంకేతితముగాదు.

హేత్వభావమున లక్షణకాదు. 14

ముఖ్యార్థబాధాదిత్రయ హేతువు ముఖ్యార్థమునకు ననుపపత్తి, రూఢి, ప్రయోజనము, నీమూడును లేనిచో లక్షణ వర్తింపదు. ఏలయనఁగా

లక్ష్యము ముఖ్యము కాదు; అచటబాధయు,
ఫలయోగమునులేదు. ప్రయోజనము గూడ కాన
రాదు; మఱియుశబ్దమునకు స్ఖలద్గతిలేదు. 15

ఎట్లన, గంగయనుపదము నదికిఁ జెప్పినచో బాధకలదు. కాన యొడ్డునుఁ దెలియఁజేయును. మఱియు నొడ్డునకుఁగూడ చెప్పుటకు వీలులేకుండుటవలన దానిప్రయోజనమునుఁ దెలియఁ జేయును. మఱియు నిచట నొడ్డు ముఖ్యార్థముకాదు. అచట

బాధలేదు. గంగాశబ్దమునకు నొడ్డునకును పావనత్వాదిలక్షణా సంబంధము కానరాదు. తుదకు ప్రయోజనమును దెలియఁ జేయునని తలంచుటకు నంతయుఁ బ్రయోజనములేదు. మఱియు గంగాశబ్దము తటమును దెలియఁజేయునట్లు ప్రయోజనమును బ్రతిపాదించుటకు సమర్థముకాదు.

ఇట్లులైనచో, మూలక్షయకారిణి యగు
ననవస్థ సంభవించును. 16

అనఁగాఁ బ్రయోజనముకూడ లక్షితమైనచో, దానికి వేరొకప్రయోజనమును, మఱల దానికింకొక ప్రయోజనాంతరము నీరీతిఁ బ్రయోజనము లనంతములగును. ఇదియే ప్రకృతమునకు నప్రతీతిఁ గలిగించు ననవస్థగాఁ జెలంగును.

అట్లైనచోఁ బావనత్వాది ధర్మయుక్తముగనే తటము లక్షితము. „గంగయొడ్డున గొల్లపల్లె" యనుదానికన్న నధికార్థమునకుఁ బ్రతిపత్తియే ప్రయోజనమన్నచో లక్షణావిశిష్టాత్మకము. కావున వ్యంజనను సమ్మతింపనేల యనినచో

ప్రయోజనసహితముగ, లక్షణీయ ముపయో
గింపఁబడదు. 17

ఎందువలన ననఁగా

> జ్ఞానవిషయ మస్త్రముగను ఫల మస్త్రముగను నుదాహృతము. 18

నీలాదులు ప్రత్యక్షాది విషయము ప్రకటతయు, లేక సంవిత్తియు దానిఫలము; ఇచట ప్రకటత్వ మనఁగా వస్తుధర్మము; భాట్టమతము. సంవిత్తియనఁగా నాత్మధర్మము; ప్రాభాకరమతము.

> కావ్యఫలలక్షణ విశిష్టాత్మకముకాదు. ఇంకవిశేషములు లక్షితములు. 19

లక్షితములైన తటాదుల పావనత్వాది విశేషము లభిధా తాత్పర్య లక్షణా వ్యాపారాంతరముననే గమ్యములు. అందువలన వ్యంజన ధ్వనన ద్యోతనాది శబ్దవాచ్య వ్యాపారము నవశ్యముగ సమ్మతింపవలయును. ఇటుల లక్షణామూల వ్యంజకత్వము విలసిల్లును. ఇంక నభిధామూల మెట్లనఁగా.

> శబ్దముయొక్క వాచకత్వము నందనేకార్థములు నియంత్రితము లగుచుండ, సంయోగాదులచే నవాచ్యార్థధీకృతము లగుచో వ్యంజనము చెలువారును. 20

| | |
|---|---|
| 1 సంయోగము | 4 విరోధము |
| 2 విప్రయోగము | 5 అర్థప్రయోజనము |
| 3 సాహచర్యము | 6 ప్రకరణము |

7 లింగము
8 అన్యశబ్దసాన్నిధ్యము
9 సామర్థ్యము
10 ఔచిత్యము
11 దేశము
12 కాలము
13 వ్యక్తి
14 స్వరాదులు.

ఇవి యన్నియు శబ్దార్థము సందిగ్ధముగా నున్నపుడు విశేషస్మృతిహేతువులని పండితులందురు. ఎట్లనగా 1 „సశంఖచక్రుఁడు హరి" 2 „అశంఖచక్రుఁడు హరి" యనుచో మొదటివాక్యమున సంయోగ మనఁగా శంఖచక్రములతోఁ గూడియుండుటయు; రెండవవాక్యమున విప్రయోగమనఁగా శంఖచక్రములు లేకుండుటయు హరికివిశేషణముగా వచింపఁబడెను. 3 „రామలక్ష్మణు" లనుచో సాహచర్యమున దశరథునికుమారులని యర్థము 4 „వారిది రామార్జునుల వైఖరి సుమా" యనుచో విరోధ కారణమునఁ బరశురామ కార్తవీర్యార్జునులని భావము; 5 „భవచ్ఛేదమునకై స్థాణువును భజింపు" మనునపు డర్థప్రయోజనము ననుసరించి స్థాణు వనఁగా శివుఁడని భావము; 6 „సర్వము నెఱుఁగుదువు దేవ యనుచోఁ బ్రకరణమువలన దేవ యనుపదమునకు „నీవ" ని యర్థము వచ్చును. 7 „మకరధ్వజుఁడు కుపితుఁడ"ను వాక్యమున లింగ బలిమిచే మకరధ్వజుఁ డనునపుడు మన్మథుఁడని తలంప వలయును. 8 „దేవతలలోఁ బురారాతి" యనుచోఁ బురారాతియను నన్యశబ్దసాన్నిధ్యమున శంభుఁడని చెప్పవలయును. 9 „మధుమహిమఁ గోకిలము మైమరచె" ననునపుడు సామర్థ్యము వలన మధు శబ్దమునకు వసంతుఁడని యర్థము;

10 "ప్రేయసీ ముఖముఁ గాపాడుఁగాత;" మిచట నౌచితి ననుసరించి ప్రసాదసాముఖ్య మని కాపాడుటకు నర్థము గ్రహింపవలయు; 11 "పరమేశ్వరుఁడటఁ బ్రకాశించుచున్నాఁడ"ను వాక్యమున దేశాను కూలముగ ననఁగా రాజధానిలో నుండుటంజేసి మొదటి పదమునకు రాజని యర్థము చెప్పనగును; 12 "చిత్రభానుఁడు భాసించుచున్నాఁడు" ఇచట పగటివేళ సూర్యుఁడనియు, రాత్రి సమయమున వహ్ని యనియుఁ గాలమునను సరించి భావమువచ్చును; 13 "మిత్రము వెలిఁగె" ననుచో నపుంసకమగుట స్నేహితుఁడనియు; "మిత్రుఁడు వెలిఁగె" ననుచోఁ బుంలింగమగుట, సూర్యుఁడనియు నర్థము స్వీకరింపనగును. 14 "ఇంద్రశత్రువ" నుచో స్వరభేదము వేదమునందే; ఇంక కావ్యమున స్వరము విశేష ప్రతీతినిఁ గలిగింపదు. ఇచట స్వరాదు లనునవు డాదిపదమునకు నభినయము మొదలైనవి గ్రహింప వలయును. ఎట్లన,



కం. తలిదండ్రుల వశుఁడగుటఁ
జెలియా! కడుదూరమేఁగ సిద్ధపడెడు నీ
యలికుల కోకిలలలితం
బులగు కటా! సురభిసమయములకుఁ రాడా!

గీ॥ ఇంతమాత్రమె యున్నవా యింతిచనులు
నింతమాత్రమె యున్నవా యింతికనులు
నింతమాత్రంపు స్థితిని వా యింతియుండె
నిన్నిదినముల కాయింతి యిట్టులయ్యె.

ఇచట మొదటిపద్యమునఁ గాకుస్వర మూలమునను రెండవపద్యమునఁ జేష్టాభినయ విశేషమునను వ్యంగ్యమునకుఁ బ్రతీతి కలుగుచున్నది. "భిన్నకంఠధ్వనియే కాకువని ధీరు లందురు" ఎట్లన "కేటా! సురభిసమయములకుఁ రాడా" యను వాక్యమునగల యుచ్చారణా వైచిత్ర్యము లవలన "సురభి సమయము లకుఁ దప్పకవచ్చు" నను విశేషార్థము వెలువడును. ఇంక రెండవపద్యమున చేతిసంజ్ఞలవలనను వ్రేళ్లుచూపుట వలనను నవయవపరిమాణము దివససంఖ్యావిశేషమును నభినయమూలమున వ్యంగ్యమగును.

ఇటుల నర్థాంతరాభిధాయకత్వమునందు, శబ్దముల ననేకార్థములు సంయోగాదుల వలన నివారితములగుచుండఁ గొంచెమో గొప్పయో చేకూరు నర్థాంతరప్రతిపాదన మభిధ వలన సంభవింపదు; ఏలయన నది నియతమయ్యెను. ముఖ్యార్థ బాధాద్యభావము వలన నది లక్షణామూలముకాదు. కావున నింక వ్యంజనావ్యాపరము నంగీకరింపక తప్పదు. ఎట్లనఁగా

గీ॥ దురధిరోహశరీరము; వరవిశాల
వంశము; కృతశిలీముఖ పరిచయమ్ము
విమలగతుల; భద్రాత్మతో వేల్గిదాన
ధారపరవారణకరంబు దనరుసతము. ॥ 3

ఈపద్యమునఁ బ్రకరణమున భద్రాత్మమొదలైన పదములవలన రాజవృత్తాంతము వాచ్యము. ఇచట గజ

వృత్తాంతము వ్యంగ్యము. ఇది యభిధామూల వస్తుధ్వనికి లక్ష్యము.

> వ్యంజనముతోఁ గూడినదే వ్యంజక శబ్దము. ఇది యర్థాంతర సహితము. నుఱియు సహకారిత్వ మున నర్థముఁగూడ వ్యంజకమై వెలుంగును. 21

---

# తృతీయసుమము.

> అభిధ లక్షణ వ్యంజన యని శబ్దము మూఁడు విధ ములుగ విభజింపఁ బడినట్లే యర్థము కూడ వాచ్యము, లక్ష్యము, వ్యంగ్యమని మూఁడు తెఱ గులఁ బిలువఁబడుచున్నది. 1

ఇంక నీవ్యంగ్యార్థము వివిధభంగులఁ జెలువారుచుండును. చెప్పువారి యొక్కయు, వినెడు వారియొక్కయుఁ బలుకుబడి లేక నుడికారము ననుసరించియు, నన,గా కాకుస్వరమువలన బ్రస్తావము లేక ప్రకరణము, దేశము, కాలము మొదలైన విశే షములపై నీప్రతీయమాన మాధారపడి యుండును. వీనిలోఁ గొన్నిటి నిట వివరింతును.

గీ॥ అతిపృథులమైన జలకుంభ మక్కటకట!
సఖియరో! తాల్చివచ్చితి సత్వరముగ
శ్రమను స్వేదాంబుపూర నిశ్వాసచయము
నిస్సహంబాయె క్షణమిట నిలచిపొమ్మ.

ఇచటఁ జౌర్యరతగోపనము గమ్యమగును. ఒకానొక కాముకురా లొనరించిన పరపురుషసంగమమును, జెలికత్తె యొకతె కాయగతవికార విశేషమునుఁ గప్పిపెట్టి కాంచువారి మానసముల మొలకలెత్తు సంశయాంకురంబుల నూడఁబెరుకు చున్నది. కావున నీపద్యమునందు నపహ్నవమూలకమై వ్యంగ్యము వెలుంగును.

గీ॥ సఖియరో! నిద్రలేమి, నిశ్వాసభార
దుర్బలవిచారములఁ జాలఁ దూలిపోతి
మందభాగినినైన నామాఱు నీవు
పంపఁగాఁబడి పీడింపఁ బడితివకట!

ఇచట నాయకుని బిలువఁగాఁబోయిన దూతిక కానిత వలనఁగలిగిన సురతవిశేషము, నాయికామణి పలుకు నుడి కారముచేత వినువారికిఁ దెలియవచ్చును. ప్రకృతార్థము ననుసరించి స్వరము కావ్యమున కుపయోగింపకున్నను బ్రతీయమానార్థము నపేక్షించి లక్ష్యానుసారముగఁ గాకువు కావ్యోపయోగమై చెలువారుచుండును.

౧౬ గీ॥ అటులనాగండపాళి నీవనఘు! యేల
లీనమగుచూపు మరలింప లేకపోతి?
తెలిసె; నా మొగముఁ గొను తెలఁగుకాని
నాకపోలము లంగాంచు నడతకాద.

ఇందు నాయికాలలామము 'నాకపోలతలమునఁ బ్రతిఫలించిన నీప్రియురాలిని రెప్పవాల్చక కాంచుచుంటి'వని పలుకుటవలన 'నీప్రచ్ఛన్న కాముకత్వమును నే గురుతించితి' ననువాక్య విశేషము వ్యంగ్యముగుచున్నది.

౧౭ గీ॥ అకరుణ మనంబుతోడ మాయత్తనాకు
సకలగృహకార్య భరము వశంబుచేసె
సంజవేళను క్షణము విశ్రాంతికలుగు
నొకట నదియునుఁగూడ లేకుంటఁ గలదు.

ఇచట నత్తగారి యెదురనే తటస్థుఁడై నిలచియున్న మేలుకానికిఁ దెలియునటులఁ గోడలు సంకేతకాలమును సూచించుచున్నది. 'సాయంకాలము నుంత తీరిక దొరకు' ననుటచే మనమత్తరిఁ గలసిమెలసి చరింపవచ్చుననను నన్యసన్నిధి వ్యంగ్యము ప్రకాశించును.

గీ॥ ఇప్పుడొకజాములోన నోయింతి! నీదు
ప్రియుఁడు చనుదెంచునను మాట వింటివో కో?
యేల బేలవై యీరీతి నూరకుందు
వర్ణ్యాకరణీయములను నాచుత్తపఱచు.

ఇదికూడ నన్యసన్నిధి వ్యంగ్యమే. నీటుకానికూటమికై వడివడిఁ బోవుచున్న కాముకురాలినిఁ గాంచి దానిమేలుఁ గోరిన చెలికత్తె యామెపోకడ నాపుటకై కనువారికిని వినువారికి ననుమానము పుట్టకుండునటు లీరీతిగా వారికట్టెదుటనే పలుకుచున్నది.

గీ॥ ఏనిచటఁ గోతు! వేరొక యెడకు నేగి
సఖియరో! నీవు కుసుమాప చయముసలుపు;
చాలదూరము త్రిమ్మరఁజాల; నీకు
నంజలి రచించెదఁ; బ్రసన్నురాలవగుము;

ఈ ప్రదేశ మేకాంతమున కనుకూలముగా నున్నది. నావలపుగాఁడు నాతోడి కూటమిఁ గోరి యీ చోటికి వచ్చును, గాన ,నీవు వేరొక దూరదేశమున కరుగు' మని విశ్వాసపాత్రురాలైన సఖీమణిని నాయిక చాల బ్రతిమాలుచున్నది. కాన నీపద్యము దేశవిశేషధ్వనిని వెలిబుచ్చును.

గీ॥ అల్పభాగ్యను నాతోడ నకట! యేమి
పలుకఁబోయెదు గురుజన పరవశుండ!
యిత్తరి ప్రవాసమున కేగుదేని పొమ్ము
ప్రియుఁడ! కరణీయమును నీవె వినఁగఁగలవు॥ ౭౧

ఇచట "నిత్తరి ప్రవాసమున కేగుదేని పొమ్ము" నుటచేఁ గాలము మధుమాసమనియు, ,నీవు ప్రియుఁడవగుటచే నీ యెడబాటు నాకు సైప శక్యముగాదనియు, పాపము! నీవేమి చేయఁగలవు నీవు తలిదండ్రులమాట జవదాటనివాఁడ వగుటచేఁ

బోవుచుంటివికాని వేరొండుకాదు. ఇంక జరుగునది నీవే యెఱుంగఁగలవనుటచే ,నేను నిజముగఁ బ్రతుకఁజాలనను' ధ్వన్యర్థము కాలవిశేషము నాశ్రయించి చదువరుల మదికిఁ దోచును.

ఇంతవఱకు నొసంగిన లక్ష్యము లన్నియుఁ గొన్నిచోట్లఁ బలుకువారి వాక్యముల వలనను, మఱికొన్నిచోట్లఁ బలుకబడినవారి భావనావిశేషమువలనను, నింకనొక కొన్నిపట్టుల వినువారి యర్థకల్పనా చమత్కారము ననుసరించియు, నీరీతిగా నేదియో యొకానొక విధమైన ప్రతీయమానార్థ రామణీయకము చదువరుల డెందములకుఁ దగిలి ముదము నొదవించును.

ఇంక నొకేపద్యమున రెండు మూడు తెఱఁగుల ధ్వన్యర్థము చెప్పువారికి, వినువారికి, దటస్థులైన వారలకుఁగూడ స్ఫురింపవచ్చును. దీనినే ద్వికభేదము, త్రికభేద మని పండితులు వచింతురు.

అందు రెండురకముల ధ్వని యెట్లన,

గీ॥ అచట నాయత్త నిద్రించు; నిచట నేను;
దివసకంబుననే నీవు తేరిచూడు;
పాన్పుజేర; రేఁ జీకటి బాటసారి!
వలదు నాశయ్య మున్గిపోఁగలవుచుమ్ము॥

ఈ పద్యమునందలి ప్రతి పదమును వింత వింత భావముల వెదజల్లుచునే యున్నది. దీనినే వక్తృబోద్ధవ్య వ్యంగ్య

మందురు. ఇట లక్షణా మూలక మగుఁగా నభిధా పుచ్ఛభూ
తమై ధ్వన్యర్థము వెలుంగుచున్నది. ఇచట పైపైన నిషేధము
నియతమై కన్పట్టుచున్నను, లోలోన విధిరూపమై వ్యంగ్యము
ప్రకాశించుచున్నది. ఈ పద్యము వస్తుమాత్ర ధ్వనికిని, శృంగా
రాభాసము నకును లక్ష్యమై చెలఁగును. ఇచటఁ బ్రోషితపతిక
యైన నాయిక స్వయందూతికయై తన మనములోని కోరికను
దానే వెలిఁబుచ్చెను. ఈమెపై మేలుపడిన యొకానొక పౌరు
గువాఁడు, బాటసారి రూపమున వచ్చి తాను రేయిఁ బరుండు
టకుఁ దావొసంగుమని వేఁడుకొనును. అత్తరి నా నెరజాణ, యత్త
చిత్తమునకు ననుమానముదాకనిరీతి, మేలుగానికి బుద్ధులు
గరపును. ఇటులనే శబ్దార్థ మర్థాంతరమునకు సహకారి మొన
రించునని శబ్దప్రమాణవేదులైన వైయాకరణులు వచింతురు.

---

# తురీయసమము

ధ్వనికావ్య ముత్తమమనియు, గుణీభూత వ్యంగ్యము
మధ్యమకావ్యమనియు, వాచ్యార్థమునకన్న మిన్నయై వ్యం
గ్యార్థము వన్నెలొలుకు చుండుటచే దానినే యుత్తమముగా
సహృదయులు వచింతురనియు మున్ను బేర్కొంటిమి.

ఇంక మహోత్తమముగా గణింపఁ బడిన ధ్వని
కావ్య మనేక భేద విభేదములఁ జెలువారు

చున్నది. అందు స్థూలదృష్టిని ధ్వని కావ్యమే
బదియాఱు ప్రభేదములుగఁ బరిగణింపఁ
బడెను. 1

అదియెట్లన. మొట్టమొదట ధ్వని లక్షణామూలమున
నవివక్షిత వాచ్యమనియు, నభిధామూలమున వివక్షితాన్య
పరవాచ్యమనియు రెండు విధముల వచింపఁ బడెను.

ఈ రెంటిలో మొదటి భేదమైన యవివక్షితవాచ్యము,
మఱల నర్థాంతరసంక్రమితము, నత్యంతతిరస్కృత మని
రెండురీతుల నిరూపింపఁ బడెను ఇవి రెండును బదగతము,
వాక్యగతమని మఱల రెండు తెఱఁగుల విభజింపఁ బడి తుదకు
నాల్గు విధములయ్యెను.

ఇంక రెండవభేదమైన వివక్షితాన్యపరవాచ్య మని
నచో నది, సంలక్ష్య క్రమవ్యంగ్యమనియు, నసంలక్ష్య క్రమఁ
వ్యంగ్యమనియు రెండువిధముల భాగింపఁ బడెను.

ఈ రెంటిలో సంలక్ష్యక్రమము శబ్ద శక్తి మూల
మునఁ జెలంగుచు, నది వస్త్వలంకార భేదముల రెండు విధ
ములై, మఱల వాక్యగత పదగత భేదముల నాల్గు తీరుల
మెలంగును.

ఈ సంలక్ష్యక్రమవ్యంగ్యము మఱల నర్థశక్తిమూల
మున దీపించును. ఈఅర్థము స్వతస్సంభవ మనియు, కవిప్రౌ

ఢోక్తిసిద్ధధ్వనియు, కవినిబద్ధ వక్తృప్రౌఢోక్తిసిద్ధధ్వనియు మూడు రీతుల విలసిల్లును. ఈమూడుభేదములును దిరుగ వస్త్వలంకారభేదముల నారు తెరగులఁ జెలంగును. ఈ యారు విభాగములును వ్యంగ్యమూలకము, వ్యంజకమూలకమై మొత్తము పదియురెండు విధముల వెలుఁగొందును. ఈపండ్రెండు రకముల సంలక్ష్యక్రమవ్యంగ్యము ప్రబంధగతము, వాక్యగతము, పదగతము లను మూడువిధములై తుదకు ముప్పదియారు ప్రకారముల నర్థశక్తిమూలమై యనుస్వానోపమవ్యంగ్యము లేక యనురణనరూపధ్వని ప్రకాశించుచుండును.

ఇంక శబ్దార్థోభయశక్తిమూలమైన ధ్వని కేవలము వాక్యగతమై, యొకవిధముననే లభించును. పై విధములన్నియుఁ గలిపినచో సంలక్ష్యక్రమవ్యంగ్యము మొత్తమున నలువది యొక్క తెరఁగులఁ జెలఁగునందురు. [4 శబ్దశక్తి; 36 యర్థ శక్తి; 1 యుభయము. 41]

కడపటి భేదమైన యసంలక్ష్యక్రమమును రసాదిధ్వని యనివచింతురు. ఇది ప్రబంధగతము, వాక్యగతము, పదగతము, పదైకదేశము, రచనాగతము, వర్ణగతము అని ఆరువిధములఁ జెలువారును. ఇటుల వివక్షితాన్యపరవాచ్య ధ్వని నలువదియేడు తెరఁగుల మెలంగును. మునుపటి యవివక్షిత వాచ్యధ్వనిభేదములనాలుగింటినిఁగూడఁ గలిపినచో మొత్తమున ధ్వని ప్రభేదము లేబదియొక్క ప్రకారముల, బ్రకాశించుచుండు నని కావ్యార్థతత్త్వజ్ఞులు విధించిరి. ఈ ధ్వనిప్రభేదములకుఁ

గల విభేదములఁ చదువరు లెఱుంగుటకై వీనిలోఁ గొన్నిటికి లక్ష్యముల నీక్రిందఁ బొందుపరతును.

అవివక్షితవాచ్యధ్వని, అర్థాంతర సంక్రమితము అత్యంత తిరస్కృతము.

అర్థాంతర సంక్రమిత వాచ్యము. పునరుక్తి మూలకము పదగతము.

ఉదా. గీ॥ ఎపుడు సహృదులచేత గ్రహింపఁబడునో
గుణములప్పుడు పెంపొంది ఘనతఁ గాంచుఁ
బృథివి రవి కిరణాను గృహీతములయి
కమలములు కమలంబులై గణుతికెక్కు.

ఇచట రెండవ కమలశబ్దము సౌరభాది గుణగణములఁ దెలియఁ జేయును.

అత్యంత తిరస్కృతవాచ్యము. వాక్యగతము.

గీ॥ పేరుకొననేల నీ యుపకారములను
మించి వర్ణించె నీ మంచితనము
ఇట్టిపనులను గలకాల మీవొనర్చి
మిత్రరత్నమ! నూరేండ్లు మేలుగనుము.

దీనిని జహత్స్వార్థలక్షణ లేక లక్షణలక్షణ యని వచింతురు. ఇచట వ్యంగ్యము వాక్యగతమై గూఢముగఁ జెలంగు

చున్నది. ఇచట ధ్వని విపరీతలక్షణామూలకమై భాసిల్లును. ఎదుటివాఁడు తన కొనరించిన యపకారములు లెక్కకు మించి పోయి నోట వచించుటకుఁ దగనివై యున్నను నేనుమాత్రము నీకు సర్వకాలములందును మేలునే కోరుచుందునను భావమీ పద్యము చదువరుల కొదవించును. నీకు నేను మేలే తలంతునను టచేఁ బలుకువానియొక్క మంచితనమును వినువాని చెడు బుద్ధియు బయలుపడుచున్నది.

వివక్షితాన్యపరవాచ్యధ్వని; లక్ష్యక్రమము, నలక్ష్య క్రమము.

లక్ష్యక్రమము- వస్తురూపశబ్దశక్త్యుద్భవధ్వని - అనురణన రూపవ్యంగ్యము, వాక్యగతము.

గీ॥ ఓయి పాంథుఁడ! ప్రస్తరయుతము గ్రామ
మిచట ప్రస్తరమించుకంతేనిలేదు
ఉన్నత పయోధరంబుల యుబ్బుఁ గాంచి
యుండఁగోరిన నీవిట నుంటమేలు ప్రా॥

ఇచటఁ "ప్రస్తరయుతము గ్రామ"మనుటయు, "ప్రస్తర మించుకంతేనిలే" దనుటయు, "నున్నతపయోధరంబుల యుబ్బుఁగాంచు" మనుటయు శ్లేషమూలకమై చెలంగును. ఇచట ప్రస్తర ప్రస్తర పయోధరము, లను శబ్దముల శక్తివలన ,,నాతో భోగించుటకు నీకు సామర్థ్యమున్నచో నీవిచట నాగు

మ"ను వ్యంగ్యార్థమువచ్చును. మఱియు వస్తుధ్వనికి వేరొక యుదాహరణము.

౩౬ గీ॥ ఏరిఁ గోపింతువో రాజ! వారిసెల్ల
శనియు నశనియునై వేగ జంపుచుండు
వేరి ప్రేమింతువో వారలెల్ల ధరను
దారల నుదారులై సిరుల్ చూరగొంద్రు.

ఇచట "శనియునశనియునై" చంపుచుందువనునపు డీ రెండువాచకములలోఁగల విరోధము నశించి నీయనువర్తనార్థమిూశనియు నశనియు నేకకార్య మొనరించుటకు సిద్ధమగుచుందురను భావము గలుగుచున్నది. ఇది విరోధవాచక మూలకమైన శబ్దశక్తివలనఁ గలుగు వ్యంగ్యార్థము.

ఇఁక నర్థశక్తివలనఁ జనించు ధ్వని స్వతస్సంభవమనియుఁ బ్రౌఢోక్తి మాత్ర సిద్ధమనియుఁ గవిప్రతిభోత్థాపిత మనియు మూఁడువిధములఁ దనరారును.

ఇందు మొదటిది కేవల భణితిమాత్ర నిష్పన్నముకాదు. ఇందు వ్యంగ్య మౌచిత్యయోగముననే స్వయముగ సంభవించుచుండును. ఇంక రెండవది నిజమునకు లేకున్నను గవిప్రతిభాప్రభావమునఁ గల్పింపఁబడును. కడపటి విభాగమునందుఁ గవికౌశలమువలననే వ్యంగ్యార్థము నాయకాది వక్తృప్రౌఢోక్తిసిద్ధమై చెలువ మలరుచుండును. నవీనులలోఁ గొందరు రెండు

మూఁడు విభాగముల విభేదము నంతగా లెక్కింపక యీ యర్థశక్తి మూలధ్వనిని స్వతస్సంభవము కవి ప్రౌఢోక్తి సిద్ధ మని రెండుప్రకారములుగనే స్వీకరించిరి.

అర్థశక్త్యుద్భవధ్వనికి నుదాహరణములఁ గ్రమముగ వివరింతును.

స్వతస్సంభవధ్వనికి లక్ష్యములు-వాక్యగతము.

గీ॥ "ఈతఁ డలస శిరోమణి, యితఁడు ధూర్త
జనములం దగ్రగణ్యుఁడో సరసిజాక్షి
యితఁడు ధనవంతుఁడ" నుమాట లెల్ల వినఁగఁ
జాన వినతాంగి పుల్లలోచనయునయ్యె.

ఇచట నలసుఁడనుటవలన వేరొకపనిమీఁద నిల్లువిడిచి పోఁజాలఁడనియు, ధూర్తుఁడనుటచే రతాసక్తుఁడనియు, ధనవంతుఁడనుటచే నాహార విహారముల కనుకూలించునంత విత్తమును వెచ్చింపనచ్చుననియు నిదికాక నాయకుఁడు కృపణుఁడనియు, నందువలన నితరుల చిత్తము నాకర్షింపనేరఁడనియుఁ గావున నీచేత నీతఁ డుపభోగ్యుఁడనియు వ్యంగ్యాత్మకమై పుల్లలోచనాది పదములం దర్థశక్తిచే వస్తువు స్వతస్సంభవముగ వ్యక్తమగును. మఱియు,

సీ॥ తరుణీమణీ! వీధితలుపాఁరఁ బైచితిఁ
బరులెవ్వ రైనను వత్తు రేమొ

కావున నాయందుఁ గాసంత దయఁబూని
కడకంటవాకిటఁ గాంచుమమ్మ
బావినీళులు నవి గావంచు బిడ్డని
తండ్రిగారిట వానిఁద్రావకుఁట
దారితెన్నులులేక దట్టంబుగా ముండ్ల
పాదలెల్ల నలుదెసఁ బొదలియున్న

గీ॥ మేనఁ గుచ్చిన గ్రచ్చిన యేని మఱియు
నక్కటా! యొంటికత్తియనైన నేని
నేను సెలయేటినీటిని నింపుకొంచుఁ
బరుగు పరుగున నింటికి వత్తునమ్మ॥

ఈపద్యమునఁ గూడ స్వతస్సంభవముగనే వస్తువువలన మాటలాడు బోటికి సెలయేటి యొడ్డున నీటుకాస్తిరోఁ గలుగ నున్న కూటమి వలని పలుగాటులను గోటిపోటులను గప్పి పెట్టుటకుఁ దగినవస్తువు సూచింపఁ బడుచున్నది.

౩౫ గీ॥ ధన్యురాలవు! ప్రియరతాంతరమునందుఁ
గూడనెన్నియో ముచ్చట లాడుచుందు
చెలువుఁ డీపికి సఖులార! చేయిసాచ
మేనెఱుగనంచు నేనాఁ బూనుదాన॥

ఇచట నాయిక స్మరాంధయు, స్వల్ప వ్రీడాకులయు నై విలసిల్లును. ఇందు వాచ్యము ‘నీవు ధన్యురాలవుకావు; నేనే ధన్యురాలను సుమా’ యనుభావమును వ్యతిరేకాలంకార మూలకమునఁ దెలియఁ జేయును. ఒకానొక తె ‘ప్రియునితో రతికేళిలో సరససల్లాపములాడి నేను సుఖింతు’నని ప్రగల్భములు

పచరింప, వేఱొకతే యామెను 'నీవు సరసురాలవు కావ' ని గేలి సేయుచు 'వలపుచెలికాఁడు పోకముడి సడలించుటకుఁ గేలు దమ్మినిసాచినంతటనే, నేను మైమఱచి సంతోష సాగరమున నీఁదులాడెదను; కాన నేనే భాగ్యవంతురాలను; నీవుగావ' ని పలుకును. మఱియు నీపద్యమున రెండవసగమున 'సఖియరో?' యనుటకు మాఱుగ 'సఖులార!' యనిబహువచన మును ప్రయోగించుటచే వలపు కాని సంగతిఁ దలచినంత మాత్రముననే నాకిపుడుకూడ మేనుపరవశ మగుచున్నద' ను తాత్పర్యము చదువరులకుఁ గలుగును. ఈబహువచనప్రయోగ 'మింక నీవేరీతిఁ బ్రియునితోఁ రతికేళిఁ దేలువేళఁగూడ వాచాలతఁజూపనోపఁగలవు ప్రియునికూటమి మురిపెములకన్న మాటలముచ్చటలు నీకెక్కువగానున్నచో నీవేపగిది ధన్యురాలవు కాఁగల'? వను విశేషార్థమును సూచించును. కావున నీపద్యమున స్వతస్సంభవమై వస్తుమూలకమైన యలంకారధ్వని కానవచ్చును.

గీ॥ సమర తలమునఁ గోపభారమున నాధ
రాశలమహేంద్రుఁడు నిజాధరంబుగఱువ
నరివధూవిద్రుమాధర దళనగాథ
కాంతదంతక్షతార్తి సంకటము దొలఁగె.

ఇచట విరోధాలంకారము 'ఈరాజరాజు కినుకచే తన పెదవులఁ గొఱుకఁబూనినపుడే వైరివధూజనముల మధురాధర దళ దశన పీడనము తొలంగె' ననుటచే 'శత్రురాజులు చంపఁబడిరి; వారికులకాంతలు పతివిహీనలైరె' యను తాత్ప

ర్యము నొసంగును. ఇందుఁ గారణకార్యములు పౌర్వాపర్య భావమును బొందినవి. అనఁగాఁ గారణమునకును గార్యమున కును గలుగుచున్న ముందువెనుకలు తారుమారై చెలంగు టచే నతిశయోక్తియు సముచ్చయమును సంభవించుచున్నవి. మఱియు నిట భూపాలుని కినుకయు, శత్రువుల మరణమును సమకాలముననే చేకూరుటచేఁ గొందఱదీనిఁ దుల్యయోగితా లంకారమందురు. ఇదికాక రాజు పెదవిఁగఱచినంత నితరుల పెదవుల కరుపులు తోఁగె ననుటచే నిట నుత్ప్రేక్షాలంకా రముగూడ కలదు. ఇందు నలంకారమూలమైన యలంకార ధ్వని కానవచ్చును. ఈపై నుదాహృతములన్నియు స్వత స్సంభవ వ్యంజకములై వెలుఁగొందును.

కవిప్రౌఢోక్తి సిద్ధవ్యంజకము- వాక్యగతము.

ప్రే॥ గీ॥ ఎటుల సమరాన జయరమా కటికుంత
లములు రాజుచే బల్మినీడ్వంగఁబడియె
నటుల శత్రులు పర్వత కటకతటుల
బిగ్గకొగిటఁ జేరిచి వివశులైరి.

ఈపద్యమునఁ గొందఱిమతమున నుత్ప్రేక్షయుఁ గావ్య హేతువు, నపహ్నవము నను మూడలంకారములు గన్పట్టు చున్నవి. మఱికొందఱిందు సమాసోక్త్యలంకారము నెలంగు నందురు. ఇచట జయలక్ష్మియొక్క వక్త్రవక్రాలకముల రాజు బలాత్కారముగ నాకర్షించుటను గనులారఁ గాంచుట

వలన నాతని ప్రత్యర్థుల కీదృశ్యము మదనోద్దీపకమై వారు గిరికందరముల గాఢాలింగన మొనరించిరనుటచే నుత్ప్రేక్షా లంకారధ్వనిఁ గవిప్రౌఢోక్తి సిద్ధమైన యీ వాక్యార్థము స్ఫురింపఁజేయును. ఇచట వైరిరాజులు పరాజితులై పర్వత ప్రదేశముల నివాసములుగా నొనరించుకొనిరనుటచేఁ గావ్య లింగాలంకారము ప్రతీతమగును. లేదా శత్రువులు సంగర ముందోడి పారిపో లేదు; వెంటనేవారు పరాభవమును శంకించి గిరిగుహాసీమలఁ జెట్టబట్టిరని తలంచినచో నపహ్నవాలంకా రము గానవచ్చును. ఇచట రాజు నాయకుఁడును శత్రువులు ప్రతినాయకులునై జయశ్రీ పర్వతకందరములు నాయికా ప్రతినాయికలుగా వర్ణింపఁ బడుటవలన సమాసోక్త్యలంకా రము దీపించును. కావున నీపద్యమునఁ గవిప్రౌఢోక్తి వలన వస్త్వలంకారమును బ్రకాశింపఁ జేయుచున్నది.

కం॥ ప్రౌఢాంగనామనంబుల
గూఢముగా రగులు మానకోపము దయితా
గాఢాలింగన ఘట్టన
పిడన భీతయగునట్లు వెడలెడుఁ గనుమా.

ప్రియుని బిగికౌగిలివలనఁ గలిగిన యదరిపాటునకు బెదరి వలపుటలుక మెల్లమెల్లగ జమపునడల జారుచుండెనని యుత్ప్రేక్షింపఁబడుటచే నెఱజాణల మానసముల నెలకొని యున్న కినుకవలనఁ గలకపోయి నాయికానాయకులు తమి రేచి కళలుదేర నొండొరుల బిగియార సందిటబట్టి చిరునవ్వు

వెన్నెలల నోఁగొరకపై వెలయించి కొంగ్రొత్తలేక పచ్చవిల్తుని
ముచ్చటల ముద్దుగుఱిపెములుదీఁగొనసరికొన తానునుభ
వింప మొదలిడిరని చెప్పనక్కఱలేకయే సహృదయు లూహింప
గలరు. అందుచే నిం దుత్ప్రేక్షాలంకార మూలకమై కవి
ప్రౌఢోక్తి కారణమున వస్తువు సూచింపఁబడెను.

గీ|| ఎవతె ముదుసలివని పతినిపిహాసించి
సుకవివదనాంబురుహబద్ధ సుస్థితిఁగొని
భువనమండల మన్యంబుఁబోలెఁ జూపు
నట్టిభారతి సతము జయంబుగాంచు.

ఇచట నుత్ప్రేక్షచే సజడమై నవనవచమత్కారైక
కారణసంపన్నమై ప్రకాశించు జగము సృజింపఁబడెనను వ్యతి
రేక ముద్యోతకమగుచున్నది. జడుఁడైన జలజాసనుండు చమ
త్కారదూరమైన పురాణజగమును నిర్మించెను. ఇంక భార
తియో సచేతనమైన కవి వదనారవిందాసీనయై యపూర్వా
నందానుసంధాయికంబైన నవీనప్రపంచమును నేత్రపర్వముగ
సృష్టించుచున్నదను భావము కవిప్రౌఢోక్తి మాత్రనిష్ప
న్నమై సంభవించును. ఇందుల కాధారముగా 'ముదుసలి
వని పతినిపిహాసించి' 'సుకవి వదనాంబురుహబద్ధ సుస్థితిఁగొని
'భువనమండల మన్యంబుఁబోలెఁ జూపు' నను వాక్యములు
నెలంగుచు వీనిలో నుత్ప్రేక్షయే బ్రహ్మసృష్టికిని భారతి
నిర్మాణమునకును గల వ్యతిరేకమును సూచించుచున్నది.

పై ప్రాచీనపద్యమునందలి భావమునే యొకానొక విపశ్చిద్వతంసుఁడును నవీనాలంకారిక శిరోమణియు నగు వాగ్దేవతాపరావతారుఁడని ప్రఖ్యాతిగాంచిన సహృదయ చక్రవర్తి తానీక్రింది చందమునఁ బొందుపఱచెను.

గీ॥ అరయఁగా నియతి కృత నియమ రహిత మ
నన్యపరతంత్ర మెంచ హ్లాదైకమయము
నవరస రుచిర నిర్మితిని వెలుఁగొంది
స్రష్టనుహసించు కవివాణి జయమునొందు.

ఇచటఁ బైపద్యమునఁ గల యుత్ప్రేక్ష లేదు; మఱియు వ్యతిరేకముగూడ నంత స్ఫుటముగఁ గానరాదు. ఈపద్యమున స్రష్ట సృష్టికిని కవివాణి నిర్మాణమునకును గలవిభేదము వ్యంగ్య రూపమున వెలుఁగొందుచున్నది. ఈ యచేతనప్రపంచ మంతయు నియతికృతమైన నియమముతోఁగూడి సుఖదుఃఖ మోహమయమును షడ్రసరుచిరమునై చెల్లుచున్నది. ఇంకఁ గవివాణి సృజించిన జగమనినచో నన్యపరతంత్రముగాక కేవలానంద స్వరూపమై నవరసభావ భాసురమై ప్రకాశించుచున్నది. కాన నిజము నాలోచించినచో బ్రహ్మ సృష్టికన్న కవిసృష్టియే మిన్నయై వన్నెలొలుకుచున్నదని సహృదయులు సమ్మతింపకతప్పరు.

ఇంక నియతిరూపమై నియమసహితమైన పితామహుని సృష్టిగలదనినచోఁ గమలాదుల సృజింపఁ దలచినచో జలము

గలచోటనేకాని వేరుచోటఁ బుట్టించుటకు బ్రహ్మకువీలులేదు. ఇట్టి నియతికృతమైన నియమముచేఁ గవి కట్టుపడఁడు. అతఁడు కాంతామణీముఖము నొకక్షణములోఁ గమలముగాఁ గల్పింపఁ గలఁడు. ఆకామినీ వదనారవిందమున కనూనవికాససంపదల నాపాదింపనోపును. ఈమోహనాంగిదమ్మిలో నల్లకలువలజంటను వెనువెంటనే పుట్టింపఁ గవికిఁ గౌశలముగలదు. ఇట్టి విపరీత ప్రపంచనిర్మాణ మొనరించుటకుఁ బ్రజాపతికిఁ బ్రతిభచాలదు.

తరువాత విధాతసృష్టియంతయు సుఖదుఃఖ మోహ స్వభావమై చెలంగును. ఎట్లన- ప్రాకృతజగమున నొకానొక సుందరీమణి నవయౌవనసంపన్నయై వస్త్రాలంకార భూషితయై స్రక్చందనాది సంశోభితయై, పతిసేవ చేయఁబోవుచున్న దను కొనుఁడు. ఆమె రూపవిలాసములఁ గాంచినంతనే భర్తకు మోదమొదవును. ఆయొయ్యారియొక్క యందచందములఁ గాంచఁగనే యామెసవతికి ఖేదముజనించును. ఆయందకత్తె యొక్క నీటులొలుకు నడకలఁగనుఁగొని వలపుఁదెలుపు నుడుల వినఁగోరి కళలజిందు పొందుసవిచూడనెంచు వేరొక తరుణ శేఖరునకుఁ జిత్తమునమోహము చిగురించును. ఇటులనే బ్రహ్మ సృష్టి సర్వమును ఖేద మోద మోహపరీతమై మెలంగును. కవిప్రపంచ మీరీతిగాఁ గాక కనువారికిని వినువారికిఁ జదువు వారలకు నందఱికిఁ గూడ నొకేపగిది డెందముల నానందము కందళింపఁజేయును. అందువలననే కావ్యమానందైక మయ మని సరసులు గొనియాడుదురు.

పిదప మనలోకమంతయుఁ బరమాణువు మొదలైన వాని సమవాయిసంబంధముచే ననఁగా సహకారి కారణాధీనమై సమకూరుచుండును. ఇంకఁ గవిజగము సమవాయి యసమవాయి నిమిత్తకారణములన్నిటి యొక్క కూటమివలన సంభవించును. మఱియు మధు రామ్ల లవణ కటు కషాయ తిక్తములను షడ్రసములచే మనజగము నిండియుండును. ఈ రసముల వేర్వేరఁ జవిగొనుటవలన సంతసము గలుగనేరదు. దీనికన్న విలక్షణముగఁ గవిలోక మలౌకిక సుఖజనకమై చెలంగు శృంగారాది నవరసములచే వ్యాప్తినొందును. ఈ రసములు నొంటిగానున్నను జంటగానున్ననుగూడ నందరకును ముదము నొదవించును.

ఇట్టి విశేషభేదములు బ్రహ్మసృష్టికిఁ గవివాణి నిర్మాణమునకును గలుగుటచేతనే కవిసృష్టి యనస్వతంత్రము నానందైకమయమని వినుతిఁగాంచెను. అందువలననే కవి వాణి స్రష్టను హసింపఁ గలిగెను. కావున నామె 'జయము నొందు'నని కవియే వచించెను.

ఈ పై వేర్కొనఁబడినవి కవిప్రౌఢోక్తి మాత్ర నిష్పన్న వ్యంజకములు.

కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిమాత్ర సిద్ధవ్యంజకము. వాక్యగతము.

సీ॥ లంకాగిరీమేఖ లాకూటకోటి సంసర్గంబుచే నతిస్ఖలితములయి
పటుమహా సురతికేళిఁ బైకొన్న బడలిక నలసియు సోలసిన చిలువచెలులు

వెడగలై విరివిగా విప్పినపడగల సందులఁబడి చాల సన్నగిలుచు
నిషేధశోకమున నిలువఁజాలకయున్న మలయానిలంబులు మఱలనివిగొ

గీ॥ తామిప్పుడు శిశుత్వంబునఁ దనరుచున్న
నచిరకాలంబు నందవి ప్రచురరుచుల
విరహిణీజననిశ్వాస పరిచయమున
బహుళతారుణ్య పూర్ణసంపదలఁ బొందలు

ఇచట నిట్టూర్పులవలన నడుమంత్రపుఁ గల్మిగల్గిన చల్లని పిల్లగాలు లింకేమేమి చేయఁజాలవను వస్తువు సూచింపఁబడుచున్నది. ఇందుఁబిల్లగాలికిఁ జల్లన మెల్లన కమ్మన యను మూఁడు మంచిగుణములను గవి కల్పించెను. మలయవాయువు లనుగురించి పలుకునపుడు వానికి శైత్యము, మాంద్యము, సౌగంధ్యముల నెలకొలుపవలెనని కవి సాంప్రదాయము. వలపుఁజెలులకు వలుదపిఱుఁదులనాటిన వెంటనే జారుపాటులు సాజము. అంతటితోఁగాక మందమారుతములు చిలువపడంతుల వెడఁదపడగల సందులఁ దగుల్కొనెను. ఇటుల పంతగించిన నెలంతల దొంతరరతములఁ జిక్కుకొనిన చిన్నిమల యానిలుఁడేరీతి చిక్కిపోకుండును? మెలతల మేలికూటముల రాటువలన మేని దిటముసెడి నిలువలేకున్న పవమానకుమారునకు, విరహిణీ లలనాజనలలామల నిశ్వాసానిల పరిచయలాభము సంభవించెను. ఇంక నాతని బహుళతారుణ్యపూర్ణసంపదల కేమి సందియము చదువరుల మదుల నుదయింపఁగలదు? ఈపద్యమునఁ 'జిలువచెలు' లనుటచే వనితల కాహారము రెండింతలనియు విహార మెనిమిదిరెట్లనియు.

'వెడదలై విరివిగా విప్పినపడగ' లనుటవలన వానియూరుపులు నిట్టూర్పులు వేడినిట్టూర్పులునై చెలంగెననియు 'లంకాగిరి' యనుటచే సువేలాపర్వతము పైనుండి సముద్రమును దాటుట వలన సవి చల్లని మలయానిలములనియు మలయసంబంధమున నవి కమ్మతెమ్మెరలనియు, 'సన్నగిలుచు నిరుపేదఱికమున నిలువజాలకయున్న' వనుటచే. జిక్కి స్రుక్కి సొమ్మసిల్లి మెల్లమెల్లగ పైపైనొలయు పిల్లగాలులనియు విశేషార్థము సహృదయుల మానసముల మొలకలెత్తును. ఈవస్తువంతయు మొదటినుండి తుదివరకుఁ గవిచే నిబద్ధమై వక్త్రప్రౌఢోక్తి మాత్రసిద్ధమైన వస్తురూపమున విలసిల్లుచున్నది.

గీ॥ ప్రియుని సందర్శ నోత్సవ వేళ మనసు
గళిత శృంఖలయౌచు విహ్వలతఁ జెందఁ
దెలివిఁ విడకుండ నాకష్ట ధీరమతిని
సఖియ! విరచించు మానసాశ్వాస మీవు 35

ఇచటఁ బ్రియుఁడు నాయికామణికిఁ గల కినుకఁ బోఁదోల కున్నను, మనసు కలకఁ దేరుననినచో విభావనా లంకారము; లేదా పలుపుకాని మోము గనుఁగొనినంతనే చిత్తము తత్తర పాటు నొందు నందుచే కోప మాపఁజాలనని తలంచినచో నుత్ప్రేక్షాలంకారము. ఈరెంటిలో నెటులనెంచినను పద్యము నందలి వస్తు వలంకారమును స్ఫురింపఁజేయును.

గీ॥ లీలనార్ద్రార్ద్ర నఖదంత రేఖలెల్ల
స్నేహసంపదఁ జూపఁగా నేత్రములకు

దివ్యరక్తాంశుకము ప్రసాదించెనిప్పు
డంతియేకాని కోపసంక్రాంతికాదు

ఈపద్యమునఁ 'గనుగొలకులఁ గెంపుకదుర కినుక ననుఁ గనెదవేల?' యని మోసకాఁడౌ కఁడు తనముద్దుటిల్లాలినిఁ బలుకరింప నానెఱజాణ పతికిఁ బ్రతివచనమిచ్చెను. 'నాకనుల తుదలు వలపుటలుకఁ జిలుకుటలేదు; నీమేనఁగానవచ్చు నలి వెచ్చని నెత్తురుగ్రమ్ము వాడిగోటిపోటులును, పంటికాటులును దమనెయ్యంపుఁ దయ్యఁదనము నెఱయ మెఱయ నెచ్చెలి నైన నాకుఁ గెంజాయజీరసంపకము సేసె' నని ధూర్తుఁడైన నాయకునకుఁ బ్రౌఢయైన నాయిక సమాధానమొసంగెను. ఇచటఁ జెలికానిప్రశ్నకు వలపుకత్తియ యొసంగిన ప్రత్యుత్తరము 'నీప్రియురాలితోడఁ జాటుకూటములవలనఁ గలిగిన గురుతుల నీవుగప్పఁజాలవు నేను నీదయ కింతమాత్రమే పాత్రురాల నైతినిగా!' యనుభావమును జాణలైనవారికి వెలిసేయును. ఇచటఁజెలంగు నుత్తరాలంకారము పైవస్తువును బయలుపఱచును. కాన నిది యలంకారమూలకమైన వస్తువున కుదాహరణము.

కం॥ యువతీ సహస్ర భరితము
భవదీయమనంబు; నిలువ వలను పడమిచే
ధవళాక్షి తన కృశాంగము
నవమన్మధ! దినదినంబు నవయఁగఁ జేయుక

ఒకానొక దూతిక నాయకునకు నాయికయొక్క విరహా ర్తినిఁ దెలుపుచున్నది. 'వేలకొలది జవరాండ్రచే నిండియుండిన నీడెందమున నీ తన్వీలలామమునకుఁ దావులేకున్న' దనుటచే నిచట హేత్వలంకారము గాననగును. మఱియుఁ 'గృశాంగియై నను నా సఖీమణికి నీమనమున నునికిఁగాంచుటకు నెలవుదొరక కుంటచే నింక కొంచెము సన్నముగానున్నచో నిలచుటకు నుంత వీలుకలుగునేమోయని తలంచి యొకనాటికన్న నింకొక నాటికి మఱియు మఱియుఁ జిక్కుచున్న' దనుటచే విశేషోక్త్య లంకారము వెలుఁగుచున్నది. ఇచటఁ గవి నిబద్ధవక్తృ ప్రౌఢో క్తిసిద్ధమైన యలంకారమూలకమైన యలంకారధ్వని ప్రకాశిం చుచున్నది. ఇవి సంలక్ష్యక్రమ వ్యంగ్యమున నర్థశక్త్యుద్భవ ధ్వనికి లక్ష్యములు. ఇంక నుభయశక్త్యుద్భవ ధ్వని యొక్క ప్రకారముననే చెలంగునని చెప్పితిమి. అదియెట్లన-

కం. అరయఁగ నతంద్రచంద్రా
భరణయు, సందీప్తపంచబాణోదయయుఁ
దరళాతారక యాశ్యా
మరమింపఁజాలదెరి మానససీమన్. 38

ఈపద్యమందు శ్యామారూపమైన కామినీవిశేషమున కును నిశీథినికిని నుపమానము వ్యంగ్యమగుచున్నది. ఇచట మాటలకూర్పు నుంతయు మార్పునొసపదు. 'అతంద్ర చంద్రాది' శబ్దము లేకార్థానేకార్థములతో విరాజిల్లుచున్నవి. కాన శబ్దశక్తియు, 'సందీప్త పంచబాణోదయయు' ననుటచే

నర్థశక్తియుఁ బూవుదావులవలెఁ గలసిమెలసి చరించుటవలన నిచట నుభయశక్తిమయమై లక్ష్యము వెలువారును. ఇటఁ బ్రకృతమున రాత్రివర్ణనమును నప్రకృతమునఁ బ్రియురాలి చక్కఁదనపుఁ బొగడ్తయుఁ గలదు. ఎట్లనఁగా- 'నతంద్రి చంద్రాభరణ' యనగా మబ్బులచేఁ గప్పఁబడని చంద్రుఁడు వెలుంగురాత్రియనియు, 'సందీప్త పంచబాణోదయ' యనఁగా నట్టివెన్నెలల వానలఁగురియు రేయి కాముకులమానసములఁ గోరిక లీరిక లెత్తజేయునని యుఁ 'దరళాతారక' యనఁగా మినుకుమినుకుమని మెఱయు నక్షత్రముల కాంతులనియు, 'శ్యామ' యనఁగా రాత్రి పరమైన యర్థము. ఇట్టి ప్రకృతి సౌందర్య మెట్టివారల మానసములనైనఁ గరిగింపకుండునా? ఇంకనీపద్యమున 'శ్యామ' యనఁగా వలపుసిగ్గుల తూగు టుయ్యేలలనూగు పదియునారు, పదియునేను వసంతములు గడచనిన ముద్దరాలని గాని లేక లీలాకేళీ విలాసవిభ్రమము నర్మమర్మముల నించుమించుగ నారితేరఁ జవ్వనపుఁ గ్రొవ్వున నివ్వటిల్లు నెఱనీటులోలుకు మిటారికత్తె యని కాని తలంప వలయును. అపు 'డతంద్రి' యనఁగా నాలస్యమెఱుఁగనిదని భావము. 'చంద్ర' పదము సువర్ణము, కర్పూరము, శిరో భూషణ విశేషమునకును గూడ వర్తించును. సామాన్యముగ స్త్రీలు సువర్ణాలంకారములను కర్పూరహారములను, శిరోభూష ణములను గై సేసి కొనుట స్వభావసిద్ధమనినచో నింక సొగసు కత్తియల మాటఁ దడవనేల? ఇట్టిజవరాండ్రు జాణల మనముల నుఱ్ఱూతలూపకుందురా! ఇంకవారివలపు నిగ్గులుదేరి తళతళ

లాడు కనుపాపల పెంపుసొంపులు కొసరు బ్రియుఁపువారి బువ్విలుఁకాని తపాతపాలఁ గాల్చి నీరుసేయు చుండునా? ఈరీతిగాఁ బ్రియురాలిపక్షమునం దర్థము సిద్ధించును. ఈ కారణముననే దీనిని శబ్దార్థోభయ శక్తిమూలకమైన ధ్వనికి దృష్టాంతముగా సహృదయశేఖరులు సమ్మతించిరి.

ఇంతవరకు వివక్షితాన్యపరవాచ్యధ్వనిలోని మొదటి భేదమైన సంలక్ష్యక్రమ వ్యంగ్యమునందలి ఉపభేదములయిన స్వతస్సంభవము కవిప్రౌఢోక్తి సిద్ధము కవి నిబద్ధవక్తృ ప్రౌఢోక్తి సిద్ధముగల వస్తువు నలంకారములను పరిభేదములకు వాక్యగతములై వెలుఁగొందువానిలో పెక్కింటికి నుదాహరణము లొసంగఁబడెను.

ఇంకముందు వీని భేదోపభేదములలోఁ గొన్నింటికిఁ బదగతములై చెలువొందు లక్ష్యముల నిరూపింతుము.

అవివక్షిత వాచ్యభేదమైన యర్థాంతరసంక్రమిత వాచ్యము-

గీ॥ మిత్రులెవనికి మిత్రులో, శత్రులెల్ల
శత్రులో, యనుకంపార్హ జనము లెల్ల
రమర ననుకంప నార్హులో, క్షితితలమున
నతనిదే జన్మ మతఁడె జీవితుఁడునుమ్మ. 39

ఇచట రెండవతడవ నుపయోగింపఁబడిన మిత్రాది శబ్దములు వాచ్యమర్థాంతరమందు సంక్రమించెనని మనకుఁ

దెలియఁజేయును. అనఁగాఁ గేవలపదమునకుఁగల యర్థమే కాదనియు నాపదము దానికున్న యర్థమును మించి వన్నె లొలుకు వింతయైన యర్థమును గలిగించుననియుఁ దాత్పర్యము. కావుననే దీనికి నర్థాంతర సంక్రమిత వాచ్యమను పేరొసఁగఁబడెను. ఇంక నీపద్యమున మఱల నెలకొలుపఁబడిన 'మిత్రు' డనుమాటకు నమ్మఁదగిన వాఁడనియును గాన మనమున దాచియుంచిన గుట్టుమట్టుల నెల్ల నాతనికిఁ జెప్పవచ్చుననియు, 'శత్రుఁడ' నుపదమునకుఁ జంపఁదగిన వాఁడనియుఁ గాన వానికొలము వారినందరఁ జిందర వందర కావించి చెక్కు చెండాడి కూకటివేరుతోఁ గూడ నూడ పెరికి తుదకు పసిపాపనైనఁ గొనయూపిరితోనైన మన నీయరాదనియు 'ననుకంపనార్హుఁ' డనుశబ్దమునకు దయ తలఁచవలసిన వాఁడనియుఁ గాన తనకుఁగల సిరిసంపదల నెల్లఁ జిత్తమున నించుకేనియు ననుమానము నూనక చేతి కేముక లేని చెలువునఁ జెలికానిని గొల్లగొనసీయఁ దగినవాఁడనియు నందుచే నాతనితోఁ గొంకుజంకును బొరపొచ్చెమును లేక కూరిమి నొనరింపవలయుననియు భావము. పుట్టినదిమొదలు గిట్టునంతదనుక నిటుల మనినవాఁడే మహాత్ముఁడను వ్యంగ్యము పద్యములోని పదములు గుదురుకొలుపుచున్నవి.

అత్యంత తిరస్కృత వాచ్యము.

౪౦ గీ॥ ఖలుల వ్యవహారములనెందుఁ గాంతుమేని
దారుణంబు లారీతినే ధీరవరుల

పూనికలు పాణిమితానిను మోదితములు
వీరి వ్యవసాయములకెందు విసుగులేదు.

ఇచట 'ధీరవరుల వ్యవసాయములకెందు విసుగులే' దని పలుకుటవలనఁ జేతనధర్మమైన 'విసుగు' నచేతనమైన 'వ్యవసాయములకుఁ' గల్పింపఁబడెను. అందుచే 'ధీరులు బుద్ధి విహాన్యమానులగుచు ధృత్యున్న తోత్సాహులై ప్రారబ్ధార్థము లుజ్జగింపరుసుమా' యనుభావము చదువరులకుఁ గలుగును. అందువలన నీపద్యమున గౌణీ లక్షణామూలకమైన యత్యంత తిరస్కృత వాచ్యము భాసించును. ఇచట మనుజుల గుణమైన విసుగులేకుంట జడములైన వ్యవసాయములకు ననఁగాఁ బ్రియత్నములకు నుపయోగింపఁబడెను. ఇటులనే ఖలులపక్షమునఁగూడ సిద్ధించును.

వివక్షితాన్య పరవాచ్యభేదమైన యలక్ష్యక్రమవ్యంగ్యము.

కం|| ఆలావణ్యరసంబును
నాలలిత వచఃక్రమంబు నారూపము నా
బాలికకు సుధాస్పద మీ
వేళ జ్వరార్తని ఘటించె విధినేమందున్.

విరహాభరమున వాడి వత్తయె వెన్నవలెఁ గరుగనున్న బాలిక వర్ణన మీపద్యము దెల్పును. ఆముద్దరాలి యొడలి తళుకులు నుడుల సొబగులుఁ గనులకింపునునింపు మేనిబింకము పొంకములును నెవరిమటుకు వారిమనములకు తట్టవలయునే

కాని యది యిట్టిదట్టిదని విప్పిచెప్పుటకు వశముగాదనియు నాయొయ్యారములన్నియు వన్నెకానితో నున్నపుడు తియ్యఁదనమున కునికిపట్టై యాచక్కఁదనము లన్నియు సరసుని సరసబాసిన వెనువెంటనే వగలసెగలకుఁ దావులైన సైపఁజాలనిజ్వరమును నమకూర్చెననియు నీపద్యమునఁ గవిచే నుపయోగింపఁబడిన 'యా'యనునక్షరము లెక్కింప నలవిలేనివలపుఁ వలపుల జదువరుల కొదవించును. ఇచటఁ గూటమివేళను నెడబాసినపుడును బాలికలకుఁ దారసిల్లునట్టియు ననుభవము వలననే తెలియఁదగినట్టియు వన్నెచిన్నెలు సన్నసన్నముగ సూచింపఁబడెను.

లక్ష్యక్రమవ్యంగ్యప్రభేదమైన శబ్దశక్తి మూలధ్వని- వస్తువ్యక్తి-

42. గీ॥ తిమిరియేకాంతమున సమాదేశనంపు
తత్పరుని, భుక్తిముక్తి ప్రదాయకుని స
దాగమంబున నెవ్వారి కాత్మలోఁ గ
నంగ నానంద నిస్యందనంబు గాదు?

ఈపద్యమునందు జవరాలొకతె పరులయెదుటనే, తన చేటితో వేదముల వినుతించు నెపంబున సొగసుకానియందుఁ దనకుఁగల కూరిమిని మాటలనేరుపున వెలిఁబుచ్చుచున్నది. ఇచట 'సదాగమ'మను పదమును గదపినచో వ్యంగ్యార్థముభంగపడును. ఈపదము నుపయోగించుటచేఁ బ్రస్తుతమున వలపుకాని ప్రశంసయు నప్రస్తుతమై వేదముల స్తుతియుఁ గానవచ్చును.

రెండర్థములకును శబ్దమే ప్రధానమగుట నిచట శబ్దశక్తి చేత ముఖ్యవృత్తిమూలమున ననఁగా నభిధావృత్తి వలన నాయికా మణి వలపుకానిరాకను పొగడుచున్నది. వేదములఁ గాంచినంతనే మోదరస మెవరి మానసముల నుప్పొంగి పొరలకుండును? ఆ వేదము లెట్టివనినచో భుక్తిముక్తుల దయచేయఁజాలునవి యని విశేషణము సేర్పఁబడెను. కావున వేదములు కర్మకాండను, వేదాంతవిజ్ఞానమునుగూడ నెఱుకపఱచి యిహపర లోకముల రెంటియందును సౌఖ్యమును సమకూర్చునని భావము. ఇంక దాని నెఱుంగుటకు సమయ మెప్పుడనినచో నొంటరిగా నుండి నియమముతోఁగూడి హితోపదేశమున కనుకూలమై మానసమున్నప్పుడే యని తాత్పర్యము. ఇంకఁ బ్రియుని పక్షమున 'సదాగమ' మనఁగా సొగసుకానిరాక యనియు నది భోగమును విరహదుఃఖమునకు విముక్తియును గలిగింపఁ గలదనియు దానికిఁ దగినకాల మెప్పుడనినచో మున్నేర్పరచుకొనిన యొంటరిచోటున కోటలేక వచ్చినప్పుడే యనియు వస్తువ్యంగ్యము నీపద్యమునఁ గల 'సదాగమ' శబ్దము గలిగించును.

## అర్థశక్తిమూలధ్వని-స్వతస్సంభవి వ్యంజకము- అలంకార ద్యోతకము.

గీ॥ అతని వియోగమనెడి దుఃఖాతిశయము
చే నశేషపాతకము విలీనమైన
నతనిచింతన మను మహాహ్లాదమునను

బుణ్యసంఘము క్షీణత పొంద నమల
సచ్చిదానందరూపుని, సర్వమయుని
జగదుదయ హేతుభూతుని సంస్మరించి
తనదుమహిమ నిరుచ్ఛ్వాసతం జెలంగి
పుడమి నొక గోపకన్యక ముక్తిఁ గాంచె.

ఈ పద్యయుగ్మక మొక గోపకన్యక యొక్క విరహ వేదనను దెలియఁజేయును. ఇచట, వేలకొలఁది పుట్టువు ననుభవించినను దరుగని పాపపుణ్యములన్నియు వియో దుఃఖమునను జింతనాసుఖమునను నొకానొక గోపికాంగనా మణి యనుభవించినటుల వర్ణింపఁబడెను. ఇటుల దుష్కృత సుకృతరాశి ఫలరూపమున భగవద్వియోగ దుఃఖ చింతాహ్లా ములు వరితీతము లగుటవలన నసంబంధమునందు సంబంధ రూపమైన యతిశయోక్త్యలంకారము సెలంగును. మఱియు నీపద్యమున నొకటి కప్పఁబడి యదియే వేరొకటిగాఁ జెప్ప బడెను. అందుచే నిందు ‹నిగీర్యాధ్యవసానరూపమైన యతి శయోక్తి ద్వయమును' ‹నశేష పాతకము, పుణ్యాసంఘము లను వానిలోని ‹యశేష సంఘము' లను పదములు తెలియ జేయును. పుణ్యపాపములు రెండును క్షీణమైనచో ము కలుగుట శాస్త్రసమ్మతము. అందుచే గోపకన్యక సచ్చిదానం రూపుని సర్వమయుని సంస్మరించి నిరుచ్ఛ్వాసతం జెఁ ముక్తినొందెనని కవి వచించెను.

అలంకారమూలకమైన వస్తుధ్వని.

గీ॥ వన మవనమాను వ్యసన మవ్యసనమగును
క్షణద మక్షణదంబగు మనుజనాథ!
నీవరింపరాఙ్ముఖుండవై నిలుతువేని
సర్వము పరాఙ్ముఖంబయి చనును గాదె.

ఇది పరవీర భయంకరుండైన యొకానొక వసుమతీతల నాథునివర్ణనము. ఈపద్యమున పైసగమున విరోధాలంకార మునుగ్రిందిసగమునందు నర్థాంతరన్యాసా లంకారమునుబొందు పరుపఁబడెను. నీవు మారుమోము పెట్టినచో ననఁగానీవుప్రతి కూలభావముం జూపినచో నీశత్రురాజులకన్నియుఁదారుమారై చెలంగును. అనఁగా వారికన్నియు విపరీతములుగా నుండునని తాత్పర్యము. ఇచట 'సర్వము పరాఙ్ముఖంబయి చను' ననుచో 'సర్వ'మ నుదానివలన విధియుఁగూడ నీవైరుల విడచి నిన్నే వెంబడించుచున్నాఁడని భావము. కాన నీశబ్దము వలననే యర్థాంతన్యాసాలంకార మూలకమైన వస్తువు వ్యక్తమగు చున్నది. ఈ యర్థాంతరము విరోధప్రాణితమై ప్రకాశించును. అదెట్లన- 'వన మవనము; వ్యసన మవ్యసనము; క్షణద మక్ష ణద'మనివిరోధము నెలకొలుపఁ బడెను. ఇచట శబ్దములకుఁగల విరోధమచ్చొత్తినట్లు కన్నులకుఁ గట్టుచునే యున్నది. ఇంక నీ విరోధమునకుఁ బరిహార మేరీతిగా సంభవించునని తలంచినచో 'వనము అవన'మనఁగా 'వనము రక్షక'మనియు; 'వ్యస నము అవ్యసనమ'నఁగా 'పొట్టేళ్ళ వురికొల్పుటయే వ్యసన' మనియు 'క్షణదము అక్షణదమ'నఁగా 'రాత్రి యుత్సవ గాన'మనియు నర్థము సేకూరును. అందుచే వీని వ్యతిరేకము

దొలంగును. ఇచట వనము వనభిన్నమను మొదలుగాఁగల శబ్దముల విరోధముచే నుజ్జీవితమైన సర్వము పరాఙ్ముఖంబగు ననుదానిలో నర్థాంతరన్యాసాలంకార మూలమున వస్తువు ధ్వనన మగును.

అలంకారమున నలంకారధ్వని.

గీ॥ వల్లభునియధరంబు ప్రభాతమునను
మ్లానకమలదళంబాయె మగువ! కొంచు
మంచుఁ బలికెడి చెలిమాట వించుఁ దోన
నవ వధువు భూమిదెస వదనంబువంచె.

ఇచట 'నధరము మ్లానకమలదళమాయె' ననుట రూపకాలంకారమును నును కెంపు సొంపులం దులకించు కెమ్మోవి పలపల వేగునంతకే కారణమున వాడి కెంజాయవీడి తెలతెల్లనై వన్నెవాసి గోల్పోయె ననినచో, రేయి నాలుగు జాములును దనివితీరని ముద్దుల మురిపెముల మునుఁగుచుఁ దేలుచు నుండుటచేఁ గానోవు ననుభావము వచ్చుటఁ గావ్యలింగమును నలంకారమును 'మ్లాన' మను విశేషణము దెలియఁజేయును. ఇటులఁ జెలికత్తియ సూటిపోటుమాటలు సెవిఁజొచ్చిన వెంటనే కడచిననాటిరాత్రి తనకుఁ జేపడిన ముచ్చటల నెఱుకపఱచు గురుతులగుంపును మాటుపఱచుటకును, నెచ్చెలిపలికిన నెఱనుడుల కతమున నడంచినకొలందియు లోనిలువక వెలికి వెడలివచ్చుటకుఁ దొరక్కులాడుచున్న చిరునవ్వు దొంతరలఁ గప్పిపుచ్చుటకును, మనమునఁ దలంచి

క్రొత్తకోడలు తననెమ్మోము నొకించుకవంచి నేలదెసఁ గాంచెనను వ్యంగ్యార్థ పరంపరకుఁ బ్రతీతి సంభవించుచున్నది. ఈ విశేషార్థమంతయు రూపక రూపమునఁ గావ్యలింగాలంకారముగాఁ బ్రతిఫలించుచున్నది.

కవిప్రౌఢోక్తిమాత్ర నిష్పన్నశరీరవ్యంగ్యము వస్తుమూలకధ్వని

గీ|| అబల! చెవియొగ్గి నాపలుకు లాలకించు
చంద్రధవళిత రాత్రుల స్మరనృపుండు
లలిత చాపమాస్ఫాలన సలిపి భువన
రాజ్య మేకాతపత్రమై క్రాలఁ జేయు. [illegible]

ఇందు వెన్నెలలచే వెల్లనై వెలుంగు రేలఁ దళుకులొలుకు విల్లెక్కువెట్టి మీటుచు, ముల్లోకములందు నొకేచందమున నేలుబడి సాగించుచు వలరేడు సొంపొందు చున్నాడను భావ మిమిడియున్నది. ఈపద్యమునందలి 'లలితచాపము' 'భువనరాజ్య మేకాతపత్ర' మనుటవలన 'సుకుమార మనోహరమేకాని పురాణచాపము గాదనియు నొకభువనమేకాదు త్రిభువనములనియుఁ ద్రిభువనములేకావు, చతుర్దశలోకములనియుఁ జతుర్దశ లోకములే కావష్టాదశ ద్వీపములనియు నున్నగాఁగల జగమంతయు ననియు; నిందు స్మరసార్వభౌముని పరిపాలన మేమూలనుగూడ మొక్కవోని తెరంగున నందరిచే ననఁగా సురాసుర నర కిన్నర ఖగ మృగాదుల నెల్లరిచే నౌదలముత్యాల సేసవోలెఁ దాల్పఁబడుచున్న దనియుఁ

దాత్పర్యము. కాన తుంటవింటి దొరయానతిఁ గుంటువడఁ జేసిన చో నడి(పాయఁపు ననబోడుల కీ నడురేయి గడపుట కడుంగడు కష్టమను వస్తువీ పద్యమునఁగల పైపదములవలనఁ గవిప్రౌఢోక్తిమాత్రసిద్ధమై చెలువొందును.

వస్తుమూలకమైన యలంకారధ్వని.

గీ॥ నిశితశరబుద్ధి సుదృశుల నేత్రముల క
రాళవయసున మరుఁడు బలఁబు నొసఁగ
నెచటనయ్యవి పడుచుండు నచటనెల్ల
వ్యతికరంపు సముస్మిపా వస్థగలుగు.

పండువంటిజవ్వనము మెయినిండ మెండుకొని వచ్చి నంతనే తళుకుబెళుకుల ముమ్మరమ్ముగఁ (గుమ్మరించు వాల్గంటుల కందోయి చందంబుగాంచి తనతూపులకన్న వారి చూపులే వాడివేడిమిఁ బోడిమిఁ బాలుపారచున్నవని తలంచి మరుఁడు తన కరకుటమ్ములఁ చురుకుఁదనము ను గూడ వానికిఁ జేదోడొసంగెను. అంతనుండియుఁ జెలువల వలపులొలుకు వాల్జూపు లెవరిపై వ్రాలుచుండునో వారికి వలవంతలు చేకూరుచుండెను. అనఁగా నీటుకత్తెల మిటారపుఁ జూపులు నాటిన నెఱజాణ లొకవేళ సాటిలేని చిరునగవులఁ జిందు లాడుచు నొకపరి మొదలుం దుదియులేని వగల సెగలఁ బొగులుచు వేరొకసారి పట్టువిడుపులేని మైమఱపుల మునుఁ గుచు నీరీతి దొంతరవంతలఁ దేలుచు నీదుచుందురని భావము.

ఇచట 'వ్యతిరేకంపు సమున్మిషావస్థగలుగు' ననుటవలన, వస్తురూపమున నొండొంటికి నంటువడని దశలైన మోద ఖేదోన్మాదములు సెలరేగుచున్నవన్న విరోధాలంకారము వ్యక్తమగును.

## అలంకారమూలమైన వస్తువ్యంగ్యము.

గీ॥ అహహ! సంతాప పీడితంబైన హృదయ
మెన్నిమార్లు వారించినన్ నిలుచు లేని
హారము విశుద్ధ జాతిత్వ మందియుంట
స్తనభర వయస్యు విడనాడఁ జాలదయ్యె.

ఇచట 'సంతాపపీడితంబైన హృదయ' మనుటచే నెడ తెగని వేడినిట్టూర్పులతోఁ దూగులాడుచున్న పేరురంబనియు 'స్తనభరవయస్యు విడనాడఁజాలద' నుటవలన 'నాతోటపాటు మేటిచింతల వంతలంజిని నీవేల సిగ్గెఱుఁగవు? ననువదలి వేరొక చోటికేఁ బొమ్మని చెవినిల్లుగట్టుకొని పోరి బోధించినను విన నొల్లక చెన్నుతొరఁగియున్న చెలికానిచెంతఁ బాయక వాని వనటల సగపాలు పంచుకొనుచుండె' ననియు, హారమిూరీతి నిమమలఁ బడనేల యనినచో దానికారణము 'విశుద్ధజాతి త్వమే' యనియుఁ దెలియవచ్చును. దీనివలన మంచికొలమునఁ బుట్టువొందిన గుణమణులైన నెచ్చెలులు పెక్కులిక్కట్టు లొకే పరి నలుదెసలఁ జుట్టుముట్టినను దమ నెయ్యొర నెడఁబాసి స్వసౌఖ్యమును మాత్రమే లెక్కింపరనియు వారి సరసఁ

జరించుట వలనఁ దమకుఁ దారసిలు తులలేని దుఃఖములే నేఁలేని సుఖములై విలసిల్లునని యుఁ దాత్పర్యము. కావ్యనవే యాఁశిముత్తెముల హారము కూరిమిఁ గుచభారమునకు దూరము కాఁజాలదయ్యెను. ఇటుఁ బలుకుటచే హేత్వలంకార మూలకమైన వస్తువు 'విశుద్ధజాతిత్వ' 'విడనాడఁజాల' దను పదములవలన బయల్పడుచున్నది.

అలంకార మూలమైన యలంకార ధ్వననము.

గీ॥ సుందరశ్యామ లాంగంబు శోభవెలుఁగు
లలిత నిజదేహ ధమ్మిల్ల కలితమైన
స్కంధబల సంపదలఁగొని స్మరుఁడు సురత
సంగరంబున సంపూర్ణ జయమునొందు.

ఇచట 'సురతసంగరము ధమ్మిల్లము స్మరుఁ' డను రూపకములవలన నల్లనై నిడుపై దట్టమై చెన్నలరుఁ గ్రొమ్ముడి వదలి చెదరి చిక్కుజీరుగా వెన్నున వ్రేలాడుచు పన్నెగులుకుచున్న కొలందియుఁ గూటమి తమకము డిందుచున్నను గాటపుకూరిమి కోరికలు వలపుకానికిఁ బెంపొందుచున్న వనుభావము నీపద్యమందలి 'స్కంధబలసంపద' లను పదము వ్యక్తపఱచును. స్కంధమనఁగా మూలబలమనియు నంసదేశమనియు రెండర్థములు. మొదటిది స్మరుని పరముగను రెండవది రమణీ పరమునై చెలంగును. సామాన్యముగ సమరతలమున సైన్యములు క్షీణతంజెందిన వెనువెంటనే

స్కంధావారమున లేక సేనానివేశమునఁ దాచియుంచిన మూలబలమును రప్పించి పోరాడి జయమును గాంతురు. అటులనే సురతసంగరముకూడఁ జెలంగెననుటచే విభావనాలంకారము. ఇచట ధమ్మిల్లమునకు [కేశపాశమునకు] స్కంధ సంబంధము (అంసనిమూలనివేశము) కలుగుటవలన శోభాతిశయ లాభము సంభవించెను. అందుచే రూపకాలంకార మూలమున విభావనాలంకారమిందు దీపించుచున్నది.

కవినిబద్ధవక్తృప్రౌఢోక్తి మాత్ర నిష్పన్నశరీర వ్యంజకము.
వస్తువ్యక్తి

గీ॥ క్రొత్తపున్నమఁగల మృగాంకునకు సుభగ
నీవు నేమగుదో? నాకు నిజము సెపుమ
వనిత యెవతె సమగ్రసౌభాగ్యయై చె
లంగె? నిపుడు ప్రదోషంపు రజనిసరణి. ౕ౦

ఇచటఁ గ్రొత్తపున్నమ యనుటచే నపుడపుడే పుట్టువొందినట్టి మృగాంకుఁడనఁగాఁ గళంకముతోఁ గూడిన చంద్రుఁడని భావము. పున్నమదినమున నిండుజాబిల్లి యందలికందు మరింత పెద్దగాను నల్లగాను గానవచ్చును. అట్టి చందమామకును నీకును గల చుట్టఱికమెట్టిదో చెప్పుమని యొందగాని నొక సుందరీమణి ప్రశ్నించెను. అనఁగా నీవాచంద్రునకు నన్నవా లేక తమ్ముడవా యని తాత్పర్యము. ఇట్టి చుట్టఱికమే లేనిచో నను నిముసమాత్రముననే మఱచి నీవు వేరొక

వగలాడిపై నెట్లు తగులూనితివనియుఁ జంద్రునకుఁ బ్రదోష రజని చాయ నీ కేలీవర కత్రియతోటి తరితీపు తగులాటము ద్వారకెననియు నాయికారత్నము పలుకు ములుకుల నాయకుని పై పైఁ బరపుచున్నది. ఈపద్యమునఁ 'గొత్త' యనుటచేఁ గొత్త యొకవింతయుఁ బాత యొకరోత యనియు నందుచే నీవలపు నిముసమునకన్న నెక్కువకాలము నిలుచునది కాద నియు 'మృగాంకుఁ' డనుటచే వేరొక వన్నెలాడికై వెదకు చుండువాఁడనియుఁ 'బ్రదోషరజని' యనుటచేఁ బెను పాపముల మానసమున నించుకేనియు లెక్కింపక కంటికింపైన మక్కువకానినే మగనిగా నిచ్చగించి వానితో నచ్చట ముచ్చటల విచ్చలవిడి ననుభవించు మదవతీ శిరోమణి యనియుఁ గవినిబద్ధమై ప్రౌఢోక్తి సంసిద్ధమై చెలంగువస్తువు వక్తృవచనముల మూలమున వ్యక్తమగుచున్నది.

వస్తువువలన నలంకారవ్యక్తి.

గీ॥ సఖియరో! నవనిధు వన సమరమందు
నిబిడపరిరంభణంబా మె నేస్తమయ్యెఁ
జలిత మౌక్తిక హారము దళితమయ్యె
నెట్టి ప్రౌఢిమ! యహహా! యింకెట్టి రతము?

ఇందు సఖీమణి యొకతె తన నెయ్యపుఁ జెలియైన క్రొత్త పెండ్లికూతురి పడకగదిలోఁ గడచిన రేయి నడచిన వింతల నింకొక స్నేహితురాలితోఁ జెప్పుచున్నది. బిగికవుంగిలి

వలని పెనకువలచేఁ జీటికిమాటికిఁ జిందులుద్రొక్కి చిక్కువడు ముత్యాలపేరులు తుత్తినియలై మిన్నకుండెనని నప్పుడా జాణతనమును గూటమి బింకమును నేమని చెప్పవచ్చునని పద్యములోని భావము. ఇచట వస్తువు 'నిధువనసమర'మనుచో రూపకాలంకారమును సూచించును. హారచ్ఛేదానంతరము ప్రౌఢాంగనా రతమునకన్న విలక్షణమై నవోఢాసంగమము నెలరేగె. 'ఎట్టి ప్రౌఢిమ! యహాహా! యింకెట్టిరత' మనుదానిలోని యాశ్చర్యద్యోతక ప్రశ్నార్థక పదములచే 'నామెకూటమి సామాన్యకూటమియే యైనను సామాన్యకూటముల కన్న మేటియై వెలుగొందెను. అది యిట్టిదట్టిదని నే నుడువఁగలనా? నిక్కముగ నుడువలేన'ను వ్యతిరేకాలంకారము ప్రకాశించును. కాన నీపద్యము వస్తుమూలకాలంకార వ్యంగ్యము.

అలంకారమువలన వస్తువ్యక్తి.

గీ॥ చెలియరో! గృహద్వారంబుచేరవేళఁ
దెరువుసంబోవు పాంథునిఁ దేరిచూచి
మూపుమీదను జలపూర్ణముగఁ జెలంగు
కుండవిచ్చె నటం చేల గోలసేతు? 52

ఇచటఁ 'గుండవిచ్చె నటంచేల గోలసేతు' వనుటచే 'సంకేతనికేతనమునకుఁ జనుచున్న సరసుని పిఱుందనే నీవును బోవుట కిచ్చగించినచో వేఱొకకుండను జేతఁబూని వెను వెంటనే పొ'మ్మని దూతిక నాయికామణిని హెచ్చరించు

చున్నది-కాన నీపద్యమునఁ 'గుండపగిలెనని నీవేల గోలసేయుదు' వను హేత్వలంకారముచేఁ బైనఁ బేర్కొనిన వస్తువు వ్యంగ్య మగును. దీనికే భంగ్యంతరమున నుదాహరణము.

గీ॥ వలపు చెలియరో! నీవిశృంఖలమనంబు
చంచలతమంపుఁ జూపులఁ గాంచి ఘటము
తనస్వరూపమె వినుతి పాత్రింబటంచు
ద్వార సంస్పర్శమిషచేత వ్రక్కలయ్యె.

ఇచటఁ గూడఁ బైపద్యమునందువలెనే యొకానొక త్రిప్పలాడి నీరము నింపుకొని కుండ మూపుపై నిడుకొని తానింటి గుమ్మముదరికి వచ్చుసరికి నేటియొడ్డున పొదరింటి మాటున కూటమునకై గురుతు పలుకుకొనిన నెఱనీటుకాఁడు వడివడిగ నాచోటికిఁ బోవుటఁగాంచి వానిని వెంబడింపనెంచి గుమ్మము తగిలెనను వంక నాకుండను పగులఁగొట్టెను. దీనినంతయుఁ దిలకించిన దూతిక నాయికతోఁ బైతెఱంగున వచించెను. దూతిక నాయిక నొకింత నోదార్చి 'నీకోరికలు కొనలుసాగ నదీకూలమునకు వేరొకఘటమును గైకొనిచనుము. నేను నీయత్తతో నిజముఁ గప్పిపెట్టి యామెకు నమ్మకము పుట్టునట్లుఁ దగుపగిది నేర్పుమెయి గుట్టు బయటకు రాకుండ సమర్థించెద' నను వస్తువు ప్రతీయమాన మగు చున్నది. ఇందుఁ గలతంబొందిన నీమనంబును దానిచే నిలు కడలేని నీచూపులను గనుఁగొని ఘటము తానుబరువుగా నుంటచేఁ 'నబలవైన నీకు పెక్కులిక్కట్టులు ఘటించితినిగా

పరులకు బాధగలిగించి నేనేలమనవలెను? నా నిజస్వరూప
మును బొందుటయే మేలుగా యని తలపోసి గుమ్మము తాకె
నను మిషచేఁ దన తొలిరూపమైన కపాలదశ ననఁగాఁ జిన్న
చిన్న పెంకులై క్రమముగా మంటిలోఁ గలయుటకు వీలైన
స్థితినిఁ గాంచెనను వ్యంగ్యార్థము దీపించు చున్నది. ఈపద్య
మున ‘ద్వారసంస్పర్శ మిషచేత వ్రక్కలయ్యె’ ననుటచే
యథార్థస్థితి గప్పఁబడి వేరొకభంగి వచింపఁబడెను. అందుచే
నిది యపహ్నవాలంకార మూలమైన వస్తుధ్వనిగాఁ జెలంగును.
మొదటిపద్యము స్వతస్సంభవ వ్యంగ్యమగును. రెండవది కవి
ప్రౌఢోక్తి కల్పిత వ్యంగ్యమునై భాసించుచున్నది.

### అలంకారమువలన నలంకారవ్యక్తి.

గీ॥ మధురసముచేత జ్యోత్స్నచే మత్తు గ్రమ్మఁ
బరవధూ వృద్ధయుంగూడ బాలలీల
మాన్యుఁడా! సురతోత్సుక మగ్నమైన
నీమదిఁ గరగించె; నహహా! నిన్నేమనందు. 54

ఈపద్యమున ‘నామె మగనాలగుట వలననే నీకామె
యందు మక్కువగలిగెను. ఆమె నీమదిఁ గలంచి కరగించె
ననుటచేఁ గావ్యలింగాలంకారము సెలంగును. తరువాత
‘ముదుసలి పడంతియైనను బరకాంతకై ప్రాకులాడితివి. నీ
నడతనుగుఱించి నుడువఁదరముగా’ దను భావమును వెలి
పుచ్చుచు నాయికామణి నాథుని యాక్షేపము చేయుటచే

నిం దాక్షేపాలంకారము గానవచ్చును. ఈయాక్షేపాలంకార ధ్వని 'పరవధూ వృద్ధయుంగూడ' యనుదానిచే బ్రధానముగఁ బ్రకాశించుచున్నది. ఇచటఁ గొందరు తియ్యని పూదేనెఁ గ్రోలుటవలనఁ గలిగిన మైమఱపును జిక్కని పండువెన్నెలలు గాయుటవలనఁ గలిగిన చిత్తవికారమును గారణములుగాఁ గైకొని కావ్యలింగాలంకారముగ వచింతురు. ఎటులఁ దలంచి నను నిచట నలంకార మూలమై యలంకారము వ్యంగ్యమగు చున్నది.

---

# పంచమసుమము.

ఇంకఁ గడపటి విభేదమైన యసంలక్ష్యక్రమ వ్యంగ్య మునకు లక్ష్యముల నిరూపింప వలయును. ఈ యసంలక్ష్య క్రమమునే రసాదిధ్వనియని వ్యవహరింతురు. రసాది వ్యంగ్యమునందు దాని క్రమము మనకు లెస్సగాఁ గానరాక పోవుటవలన దీనిని నసంలక్ష్య క్రమము లేక యలక్ష్యక్రమ మని యలంకారికులు పేరుపెట్టిరి. ఈ రసాదిధ్వని నారు విభాగములని వెనుకఁ జెప్పఁబడెను. ఇంక రసాదులనఁగా రసము భావము రసాభాసము భావాభాసము భావోదయము భావశాంతి భావసంధి భావశబలత లను నెనిమిదివిధములు. ఇచట విభావాదుల కూటమి వలననే రసము పుట్టుచుండుట చేతను వాని కలయిక యెడతెరపిలేక కలుగుటచేతను రసమును వేర్వేరు విభాగములుగఁ జీలదీయుటకు వీలుదొరకమి

దానికి భావమునకుఁ బోలె శాంత్యాదుల వివరింపలేదు. కావున రసము ప్రధానముగా నున్నచోట ధ్వనియనియు నప్రధానమై మెలంగినచోట నలంకారమనియుఁ జదువరు లెఱుంగవలయును. అందుచే రస మెచట నంగియై వెలుంగునో యచట నుత్తమ కావ్యమనియు నెచట రస మంగభూతమై వెలంగునో యచట గుణీభూత వ్యంగ్యరూపమైన మధ్యమ కావ్యమనియు నలంకార శిరోమణులు నిరూపించిరి. ఈ మధ్యమ కావ్యముననే రసవత్ప్రేయో ర్జస్వి సమాహితాదులను రసభావ తదాభాస శాంత్యాది మూలములై యలంకారములు గాఁ బొలుచుండును.

రసధ్వని భేదములకు దృష్టాంతములఁ దిలకించుటకు మున్ను రసరూపమును జదువరు లాకింత యెఱుంగవలయును. ఇచట రసమననేమి? దాని యాకారమెట్టిది? అది యెటులపుట్టును? ఎచట నుండు? నను సందియములు చదువరుల మనముల జనింపవచ్చును. ఈసందర్భమున భరతముని చంద్రుఁడు విభావానుభావ వ్యభిచారిభావముల సంయోగమువలన రసోదయమగునని వచించెను. రసమునకుఁ బుట్టువు కల్పించి దిట్టపఱచు కారణములనే యాలంబ నోద్దీపన విభావములందురు. మొదటిదానికి సీత, శకుంతలాదులును రెండవ దానికి చంద్రోదయ వసంతాదులును నుదాహరణములు. ఈ విభావములే రాముఁడు దుష్యంతుఁడు మొదలయినవారిలోఁ దొలుతొలుత నష్టవిధములైన సాత్త్వికాను భావములలో

నొకటియో లేక పెక్కింటినో కలిగించును. ఇవి స్వతఃసిద్ధము లయిన శారీర సంబంధమును గలిగి విలసిల్లును; వీనితోపాటుగా మానసికము లయిన చిత్తవృత్తివిశేషములు గొన్ని నాయకాదులకు సంభవించును. ఈ రెండవ తరగతి భావములనే స్థాయిభావములని వచింతురు. స్థాయిభావము లెనిమిదనియు గొందరు తొమ్మిదనియు విధించిరి. వీనితోఁ గలిసిమెలసి మెఱుపులవలె నిలుకడ నెఱుఁగక యిటునటు వడివడిఁ దిరుగు భావములు మఱికొన్ని కలవు. ఇవియే వ్యభిచారి లేక సంచారి భావములు. వీనిసంఖ్య ముప్పదిమూఁడుగా నిశ్చయింపఁబడెను. ఈ యనుభావములు స్థాయిభావములు సంచారిభావములు గలసి మొత్తము నలుబదితొమ్మిది లేక యేబదిభావములయ్యెను. రామాదులయందు గాని యాయా పాత్రల ధరించు నటులయందుగాని పైన నుడివిన యాయా భావములు గుమిగూడి వారినిఁ గనుఁగొను సభ్యుల మానసముల నాయా తొమ్మిది రసముల నుదయింపఁజేసి చెప్పనలవికాని సంతోషమును గలిగించును. ఉన్నదో లేదో తెలియరాక మన మనముల నడఁగినుడఁగియున్న భావములను విభావములించుకించుక మొలకలెత్తు నట్లొనరించును. ఇంచుకించుక మొలకలెత్తినవాని ననుభావములు కన్నులకుఁ గట్టినట్లుగ మొగ్గదొడుగఁ జేయును. కన్నులకుఁ గట్టినట్లుగ మొగ్గదొడిగిన వానిని వ్యభిచారిభావములు డెందము గందళింప నందమునఁ బూవులు పూచి ఫలింపఁజేయును. అంత సహృదయులకు నాలౌకిక రసాస్వాద సౌఖ్యము సంభవించును. ఇదియే చదు

వరులకుఁ జవులూర రసఫలము పంకుటకై విభావాదు లొనరించు దోహద విశేషమై విలసిల్లును.

ఇక 'విభావానుభావ వ్యభిచారిసంయోగాత్ రసనిష్పత్తి' యను భరతుని సూత్రమునకు నాయా శాస్త్ర సంప్రదాయ ముల ననుసరించి వేర్వేరువిధముల వివరణములు వెలసెను. ఇచట సంయోగమనఁగా విభావముల యుత్పాద్యోత్పాదక రూపసంబంధము ననుభావముల గమ్యగమక భావరూప సంబంధము వ్యభిచారిభావముల పోష్యపోషక భావరూప సంబంధము వలనను రసనిష్పత్తి యనగా విభావములవలన నుత్పత్తియు ననుభావములవలన నభివ్యక్తియు వ్యభిచారిభావము వలనఁ బుష్టియుఁ గలిగి స్థాయిభావము రసమై చెలంగునని భట్ట లొల్లటాదులు వచించిరి. ఈ నిర్వచనమును సమ్మతింపక విభావాదుల సంయోగమనఁగా గమ్యగమక భావరూపము వలనను నను మాప్యానుమాపక భావరూపము వలనను గలిగిన సంబంధము వలన రసనిష్పత్తి యనఁగా రసమునకు ననుమితి సంభవించునని శ్రీశంకుకుఁడు సిద్ధాంత మొనరించెను. దీనిని పూర్వపక్ష మొనరించి విభావాదుల సంయోగమనఁగా భోజ్యభోజక రూపసంబంధము వలన రసనిష్పత్తి యనఁగా రసమునకు భుక్తి చేకూరునని భట్టనాయకుఁడు ప్రతిపాదించెను. పయివారి మూఁడుమతముల ఖండించి స్థాయిభావములకు విభావాదులకు సమమైన సంయోగము వలన ననఁగా వ్యంగ్యవ్యంజక భావరూప సంబంధము వలనను లేక విభా

వాదుల పరస్పరమైన సంయోగమువలన ననఁగా మేళనము వలనను రసనిష్పత్తి యనఁగా రసమునకు నభివ్యక్తి కలుగునని శ్రీమదాచార్య అభినవ గుప్తాదులు విధించిరి. వీరిమతే గడపటిదే సర్వాలంకారిక సమ్మతింగాంచి వెలుఁగుచున్నది. దీనివలన రసమునకు నభివ్యక్తియే కాని యుత్పత్త్యాదులు సంభవింపవని తేటపడెను. అందుచే నేర్పరియైన నటుని యొక్క కన్నుసన్నలును చేతిత్రిప్పులును సామాజికులు సహృదయులైనప్పుడే యనఁగా వారికి వాసనా విశేషమున పూర్వానుభవ మున్నప్పుడే రసోదయ మొదవించునని తాత్పర్యము. ఈపక్షము ననుసరించి రసము సామాజిక నిష్ఠమే కాని నటనిష్ఠము గాదని భావము.

ఇట్టుల విభావాదుల కూడికవలన సూచింపఁబడినరసము జాణలైనవారి మానసముల నానందమందిరములుగ నవలీల మార్చివైచును. అట్టితరి వారి డెందముల నిండియుండిన యానందము సత్యస్వరూపము స్వతఃప్రకాశము సహృదయైకసంవేద్యమునై చెలంగునని పండితులు వచింతురు. ఈ పరమానందమును బరబ్రహ్మానందముతో నుపమింతురు. ఇందుల కాధారముగా "సుఖమాత్యంతికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీంద్రియ" మ్మను గీతావాక్యమును "రసోవైసః రసంహ్యేవాయంలబ్ధ్వా ఆనందీభవతి" యను శ్రుతిప్రమాణమును గలదు. ఇట్టి యలౌకికమైన రసచర్వణసౌఖ్యము రసాస్వాదానందమెటులఁ జేకూరు ననినచో నది పూర్వపుణ్య పరిపాకముననే లభించునని చెప్ప

దురు. ఇందుకు దృష్టాంతముగా "పుణ్యవంతః ప్రమిణ్వంతి యోగివత్ రససంతతి"మ్మను వచనముగలదు. కాన ప్రాక్తన జన్మవాసనా వశమునచే యోగీంద్రులంబోలెనే పుణ్యవంతులు రససంతతి సౌఖ్యమును జూరగొందురని తాత్పర్యము.

ఇట్టి పరమానంద సంధాయకంబైన రసములు తొమ్మి దిగలవు. ఇవి శృంగారము హాస్యము కరుణము రౌద్రము వీర ము భయానకము బీభత్సము అద్భుతములను పేరులంగలిగి యెనిమిది నాట్యరసములు సెలంగునని మొదట భరతుడు నుడి వెను. వీనికి శాంతమునుగూడ చేర్చి నవరసములని నవీనులు నిర్ణయించిరి. ఈ రసములు తొమ్మిదింటికిని వేరువేరుగ స్థాయి భావములు నిశ్చయింపబడెను.

1 ఆలుమగల కొంకొరులపై నంటియుండు వలపు నాబడు మనమునందలి మక్కువనే 'రతి' యందురు.

2 పలుకు మేను మొదలైనవానిలోం గల మార్పును గనుటవలన నెదుటివారలకుం గలుగు మనములోని విరియుబా టునే 'హాస' మందురు.

3 కొమరులు కూరిమిచెలులు మొదలైనవారి యెడ బాటు మరణము మొదలైనవానివలన డెందమునంగలుగు కలత వలని కుందుబాటులనే 'శోక' మందురు.

4 గురువులను బంధువులను నితరులవలనఁ దొరకొనిన పెక్కు చిక్కులు దుండగపుచేతల కతమున డెందమునఁగలుగు పెనుమంటనే 'క్రోధ' మందురు.

5 పెరవారి సాహసము దానము మొదలైనవానిఁ బలుమరు తలంచుటవలన మదిలోన నొదవు గొప్పదనమునే 'ఉత్సాహ' మందురు.

6 పెద్దపులి మొదలైనవానిఁ గాంచుటవలన మేటిదొసగులకెల్ల నెల్లయై మదిలోనఁ దొడరువందురుపాటునే 'భయ' మందురు.

7 తల కంటగింపఁజేయు వస్తువులఁ జూచుటవలన నెడదఁబుట్టువొందు రోతనే 'జుగుప్స' యందురు.

8 మును కనివిని యెఱుంగని వింతవస్తువుల గనుటఁ వలన మనంబునఁ బొంగిపొరలు నబ్బురపాటునే 'విస్మయ' మందురు.

9 మహాత్ముల నుడుల చెవియొగ్గి విని వారుచెప్పిన తెఱఁగునఁ జరించుటవలన మనకుఁ గట్టెదురఁ గానవచ్చునవియెల్ల నిలుకడలేనివని మానసమున పుట్టినట్టి గట్టినమ్మకమునే 'శమ' మందురు. ఇచట శమమునకు మారుగాఁ గొందరు నిర్వేదమును శాంతరసమునకు స్థాయిభావముగా రచించిరి.

ఈనిర్వేదము వ్యభిచారిభావములలో నెన్నఁబడుటవలన నది స్థాయిభావముగా నుండుట సమంజసముకాదని నవీనులు శమమును శాంతమునకు స్థాయిభావముగా నిరూపించిరి.

పైన వివరించిన నాట్యరసములకు సాత్వికభావములు లేక యనుభావము లెనిమిదిగాఁ జెప్పఁబడెను. అవి యేవనఁగా స్తంభము ప్రళయము రోమాంచము స్వేదము వైవర్ణ్యము వేపథువు నశ్రువు వైస్వర్యమును. వీని లక్షణములను గ్రంథవిస్తరభయమున నిచటఁ బ్రదర్శింపలేదు.

వీని వెనువెంటనంటి నలువెరఁగులఁ జరించు భావములు కొన్ని గలవు. వీనినే వ్యభిచారి లేక సంచారిభావములని పేర్కొందురు. నిర్వేదము గ్లాని శంక యసూయ మదము శ్రమము నాలస్యము దైన్యము చింత మోహము స్మృతి ధృతి వ్రీడ చపలత హర్షము నావేగము జడత గర్వము విషాదము నౌత్సుక్యము నిద్ర విస్మృతి త్రాసము వితర్కము స్వప్నము విబోధము నమర్షము నవహిత్థము నుగ్రత మతి వ్యాధి యున్మాదము మరణము నన ముప్పదిమూడు వ్యభిచారిభావములు రూపింపఁబడెను.

ఇంకపైన రసాదులలోఁ గొన్నింటికి నుదాహరణముల రచింతును.

శృంగారము రెండు తెరంగులఁ జెలంగును. సంభోగము విప్రలంభము.

55 గీ॥ ఒడలికియమ యమృతంపు జడిసుఖంబు
కన్నులకు పచ్చకపురపుఁ గణికతునక
యెదకు నెమ్మనః కోర్కులకెల్లయగుచుఁ
గట్టెదుర జీవితేశ్వరి కానవచ్చె॥

‘నా ప్రాణేశ్వరి నా కనులకెదురుగాఁ గానవచ్చె’ ననుటచే నాకోరిక లీడేర నేనీమెను గవగూడి సుఖింపవచ్చునను భావమీ పద్యమునఁ గలదు. ఇది నాయికా రూపాలంబన విభావప్రకాశమై చెలంగుటచే సంభోగశృంగారము.

గీ॥ విధివశంబున నిపుడేను వెకలినగుచుఁ
జంచలాయత నయనఁ ద్యజించి వాడ
నవిరలవిలోల నవజలదాగమంబు
నలుదెసలయందు నల్లదే కలయఁ బర్వె॥

ప్రియురాలి నెడబాసి విదేశవాస మొనరించు నొక యువకుఁడు వలపుటిల్లాలి నెదనెంచి యీరీతి వాపోవును. ఈ పద్యమున మేఘరూపోద్దీపన విభావవర్ణన ముండుటచే నిందు విప్రలంభ శృంగారము.

గీ॥ అవిమలిన నీరదావృతమయ్యె నభము
అళి పికారవవ్యాప్తములయ్యె దిశలు

## పంచమ సుమనష్టూంచు సంఖ్య.

నభినవాంకురాంక విటంకమయ్యె ధరణి
మోహనాకారు మన్నింపు ముద్దరాలు||

ఈ పై పద్యమున ప్రవాసగతుఁడైన నాయకుఁడు తన ప్రియురాలిఁ దలంచి విలపించెను. ఇంక నీపద్యమునందు వలపు పలుకచే మోము ముడుచుకొని చెలువునిపై కినుకనూనిన ముద్దరాలి మనములోని కలకఁదేర్పుటకై దూతిక మానభంగ బీజమును నాటుచున్నది. ఇందు వలపుకాఁడు మోహనాకారుఁ డగుటచేఁ గినుక దిగద్రావుటయే మేలని సూచన గలదు. మఱియు మింట కారుమబ్బులు దట్టముగా వలముకొనియె నను టవలన నెడతెరపిలేక వాన గురియునని భావము. ఇంతియేకాక తుమ్మెదగములును కోకిలపిండులును దలదిమ్మ ఘటింప నెఱిం గించుచున్నవనుటచే నెఱనీటుకాని విడనాడి నిముసమేనియు నిలువఁజాలవుసుమా యని బుద్ధిఁగఱపుచున్నది. ఇచట నాయి కామణి ముద్దరాలనుటవలన నామెను జడిపించుటకై దూతిక కోకిలపిండులను గండుతుమ్మెదలతో జతపఱచెనేకాని వానకా లమునఁ గోకిలలు కానరావు. ఒకవేళ నున్నను గూయవని కవి సంప్రదాయము. ఇట్లుకాక 'అళి పికారవవ్యాప్త' మను దానిని రూపకాలంకారముగా భావించినచో వసంతమునందు కోకిలా లాపముపోలె వర్షాకాలమునందు మధుపారవము మనోహర మును మానినీమణులకు మర్మభేదనమునై మెలంగునని తాత్ప ర్యమువచ్చును. మఱియు 'నభినవాంకురాంక విటంకమయ్యె ధరణి' యనుటవలనఁ బలుగురాళ్లుగూడ పగిలి వానిలోనుండి క్రొంగ్రొత్త మొలకలు తలలెత్తుచున్నవనియుఁ గావునఁ గఱకు

రాలచందము నెందిన వియోగుల డెందములమాటఁ జెప్పనేల యనియు విశేషార్థము గలుగుచున్నది. ఈ వర్ణనముచే నీవెటు చూచిననావంక నెల్ల ననఁగా భూమిపై నాకసమున దిక్కులందుఁ గ్రిందను బైనను బ్రక్కనుంగూడ నీకు వనటఁగలిగించు వస్తువులే కానవచ్చును. కాన నీప్రియునిపై నీకుఁ గలిగిన నెయ్యపుఁ గయ్యమును గట్టిపెట్టి వెంటనే వలపుకానిపై నవ్వుబువ్వుల వానలఁ గురియింపుమని దూతిక హితముపదేశించుచున్నది. అందుచే నిది ప్రణయకోపమువలని విప్రలంభము.

ఇంక నీసంయోగ వియోగ శృంగారములజంటయందు సంభోగము పలుతెరంగుల విలసిల్లు చున్నను ననఁగా నీవు జోడై సొగసువగలఁ జెలంగు మగువమగలు తామొకరి నొకరు గనుట తాకుట మొదలుగాఁగల ముద్దుమురిపెములఁ గుఱియుచు ముదము సొంపుల మున్గుచు వెలుంగుచున్నను నొక్కవిధముననే లెక్కింపఁబడును. ఎచట మక్కువ పెంపెక్కుచున్నను మనము నందలి కోరిక లీడేరకుండునో యచట విప్రలంభమని పలుకుదురు. వీని రెంటిలో సంయోగము రతము విపరీత మనఁగా సరసుఁడు మొదలువెట్టునదియు సరసురాలు మొదలు పెట్టునదియు నని రెండురకముల నుండును. ఇంక వియోగమును గొందరు నాలుగు విధములుగను మఱి కొంద ఱైదు రీతులుగను వచించిరి. పూర్వరాగము మానము ప్రవాసము కరుణ యనియు, లేదా యభిలాషము విరహము

నీర్ష్యప్రవాసము శాపహేతుకములనియు రూపింపఁబడెను. వీనికి లక్ష్యముల వివరింతుము.

61 గీ|| లికుచ కుచముల లీల మర్దించి; గోటి
పోటుల నలంకరించి; కెమ్మోవిరుచుల
నాని కొనపంటికాటుల నూని; బిగ్గ
కౌగిళులఁజేర్చి; ముద్దుల కరవుదీర్చి.

యింత దొంతర రతములఁ గొంతదేల్చి
నెండనొడిలిన సునుపూలదండ వోలెఁ
దమ్మెరలఁదూలు తమలపుఁ దీవచాయఁ
బూలపాన్పునఁ దొలిసేత వ్రాలెబాల.

ఇదిసంభోగము. నాయకునిచేఁ బ్రారంభింపఁ బడెను.

గీ|| కనుల నరమోడ్పు, పెదవి మెల్లనగదుల్పు,
మొగము చెమ్మట ముత్యాల ముద్దుపొల్పు,
కదలు నడుమును, గదలియుఁ గదలకున్న
ప్రాయఁపు బెడంగుఁ గుల్కు చందోయిసొంపు

వదలు క్రొమ్ముడి, వదలియు వదలకున్న
సిరుల మురిపెంబులంజూపు సిగ్గుపెంపు,
నగముగట్టిన పుట్టంపు సొగసువగలఁ
బూలపాన్పున మగసేత వ్రాలెజాణ.

ఇచట సంభోగము నాయికచేఁ బ్రారంభింపఁబడెను.

62 గీ|| మొదల జారిన నీవికై వెదకులాడు
వలపుఁ జెలికాని వింత చేతలనుగాంచి

యొఱనగవు తోడ వానిని నేనె నిండు
కౌగిటం జేర్చి నాసిగ్గుఁ గాచుకొంటి.

ఇదియును సంభోగమే. ఇచట నిరువురును గవఁగూడిరి.

63 గీ॥ అరయ ననోన్య సందర్శనాను రాగ
వర్ధమాన కౌతూహల భాగ్యము తల
స నసమాప్త మనోగధ బహుళ దుఃఖ
మిలను మిథునమ్ములకు నివే నిలచె సుమ్ము.

ఇది విప్రలంభము. ఇందు నాయికా నాయకులకు నభిలాషగలదు కాని వారి యభిమతము సిద్ధిపొందలేదు. ఇచట విరహము సమాగమమునకుఁ బూర్వకాలమునఁ గలుగుటచే పూర్వానురాగము.

గీ॥ చాన నెమ్మొము పున్నమ చంద్రుఁబోలుఁ
గొమ్మ కెమ్మోవిరస మమృతమ్ముబోలు
బాల సకచగ్రహా రభసోద్వేల చుంబ
నంబునకు సాటిలేదు జగంబులోన.

ఇచట నభీష్టము నెరవేరెను గాని వెంటనే విరహము సంభవించెను.

గీ॥ కదలుఁ పెదవియు ముడివడు కనుబొమలును
గొంచె మెరుపగు చెక్కుల కొనలుఁగలిగి

కినుకఁ జిలుకఁచు నన్నంటఁజన దటంచుఁ
బలుకుచుం బోవు ప్రియురాలిఁ దలచువాఁడ.

ఇచటఁగూడ నభిలాషయే; కాని దీన జెరకుపానకమున మిరియఁపుఁగారము పగిది కినుకగూడ కలసిమెలసి యున్నది. ఈపైపద్యములలో నాయికామణిపై నాయకునకుఁ గల మక్కువయే కానవచ్చుచున్నది. లోకమున కాంతలకుఁగూడ కాంతులపైఁ బ్రేమ జనించుట కలదు.

గీ॥ ఎదురఁ జను దేరఁ దలవంచియేగి పిదప
వెనుమరలి మాటలాడుచుఁ జనుచు నన్ను
వలపు వాసన లలతిగ వెలికిఁజిమ్ము
చిరునగవు కన్నుగొలకులఁ దరుణి చూచె.

ఈపద్యమునఁ గామినీమణికి సుందరాకారునిపైఁ గల ప్రేమ గానవచ్చును.

కం॥ తరుణీ! నిద్దురచొక్కిన
పరిబాఁప్పనఁ బ్రియుఁడు లేని వేదన మొకమా
రెటిఁగినఁ జూపంగలవే
గురుమానావేశజనిత కోపము నాపైన్ 67

ఇచట ననుకూల నాయకుఁడు మానినీమణికిఁ బ్రేమ దండనమును విధింతునని బెదరించుచు నామెనుఁ బ్రసన్నురాలనుగా నొనరించును. మానము నాయికామణికే భూష

ణముగాఁ జెలంగుటచేఁ గావ్యములఁ దరుచుగా స్త్రీ పరము
గానే కన్పట్టును.

౬౩ గీ॥ మారుమోమయి పొలయల్కఁ జారిపోవ
నిదురఁ బాన్పున నిటునటు కదలువంక
కఠిన వక్షోజకలశ సంఘట్టనములఁ
గలుగజేసిన సుఖకేళిఁ దలచునాఁడ.

ఇందు నాయికకుఁగల మానమును లఘుమానమందురు. అందుచే వలపుకాడు పలుమఱు బ్రతిమాల నక్కర లేకయే ప్రియురాలు ప్రసన్నయై యాతనికి సుఖకేళి గలిగించెను. మరునాడు వరువాతి నా నాగరికుఁడు నాయికానురాగమును స్వసౌభాగ్యమును సూచించుచుఁ జెలికానితోఁ బల్కును.

కం॥ అరికట్టిన నిట్టూర్పులఁ
బరపడి వినఁ జెవులనొగ్గి ప్రణయ కుపితులై
విరసతఁ గదలక మెదలక
ధరియించిరి కపటనిద్ర ధర్మంబగునే?

ఈపద్యమునను బైపద్యమునందును నాయికా నాయకుల పరస్పర మానము ప్రకటిత మగుచున్నది. కాని పైదాని వలెఁగాక యిచట మానము చాల కాలమనఁగా రేయి నాలుగు జాములును వ్యాపించి యుండుటచే దీనిని దీర్ఘ మాన మందురు.

ఈ మూడుపద్యములందును గల మానమును, బ్రిణయ మాన మనఁగా నెయ్యపుఁగయ్యము, లేక వలపుటలుకగాఁ జెప్పుదురు. ఇది కారణము లేకయే మానినీజనముల మాన సముల నిల్లుగట్టుకొని కాపురముండును. ఇది యెందకైతెల కొకానొక విధమైన తియ్యఁదనమును జేకూర్చును. ఇదికాక యొరుని బుట్టి రోసముచేఁ బొంగి పొరలిపారు పేరలుకగూడ నెలజాణల కప్పుడప్పుడు కలుగును. దీని నీర్ష్యా మానమందురు. దీనికిఁ గారణములు మూడు కలవు. వేరొక వగలాడి తగులాట ముల వలసిపోయి వలపుకాఁడు మైమరచి పన్నుండుటయు, వన్నెలాడి బిగికవుంగిళులవుటలు మొనపంటి నొక్కులు బటు పుగుబ్బల గ్రుమ్ములు మొదలైన చిన్నెలు వలపుకాని మేనఁ గానఁబడుటయు నితరాంగన మిడి గుదురు చెదరి సొగసులాడి పేరును వలపుకాఁడు బలుకుటయు నీపేరలుకకు నీర్ష్యామాన మునకుఁ గారణములని చెప్పుదురు.

కం॥ ప్రియతమ విరహంబును న
పి్రియ దర్శనమనెడు రెండు పెనువంతలనా
పయిఁబడిన కలికితమక్
బ్రియమున నంజలిఘటింతు రేపున్ మాపున్ [illegible]

ఇచట నాత్మానురాగమును కులీనతానమస్కారచ్ఛల మున నాయిక ప్రకటించుచున్నది. ఇందు 'నప్రియదర్శన' మనఁగా సవతిమొగమును గాంచుటయు 'ప్రియతమవిరహ' మనఁగా వల పుకాఁడు తను జూడరాకుంటయుఁ దెలియవచ్చును. ఇచట

నాయిక ప్రతిదినమును ప్రత్యక్షముగ సపత్నిని సందర్శించుటచే నీర్ష్యాపూర్వకమైన మానము లేశముగ సూచింపఁబడుచున్నది.

కం॥ ఆశాబంధ బలంబున
వేసైపఁగవచ్చుఁ బ్రియుని విరహము తల్లీ
యీనున నేకగ్రామ ని
వాసము మరణంబుమించి వంతలముంచుజ్.

ఈపద్యమునందు విదేశవాసమునకు నేకగ్రామనివాసము నకుఁ గలభేదము వివరింపఁబడినది. మొదటివానిని భరించు టకు నాశాబంధము బల మొసఁగును. ఇంక రెండవది మరణ మునకన్నఁ గష్టతర మనుటచే మరణమే శ్రేయస్కరమని భావము. ఏల మృతియే మేలనినచో నపుడు సవతిపోరు తీరును. ఇటులఁ బ్రతికియుండి సవతిపెంపును నేను సైపఁ జాలనుసుమా యని యీర్ష్యాకులచిత్తయైన నాయిక దూతి కతోఁ బలుకుచున్నది. అందుచే నీర్ష్యామానమిందు స్పష్ట ముగాఁ గానవచ్చుచున్నది.

గీ॥ వదన సరసిజ మారుత వశత నీవు
రాధికా గోరజంబు దూరంబుసేయ
వల్లవీపల్లవా! గోపబాలికాళి
గౌరవాతిశయంబు భంగంబునొందె.

ఇచట రాధికా గోరజంబును వదన సరసిజ మారు తమున కృష్ణుఁడు దూరంబుసేసె ననుటచే వల్లవీపల్లవాధర

తెల్లవారి సమక్షమునను రాధిక కన్నులలోఁ బడిన దుమ్ము నలకలను బయటకు వచ్చుటకై కృష్ణుడు నోటితో నూదె నని భావము. ఇటుల నూదుటయనునెపంబున నామె కందో యిని ముద్దుగొనెను. ఆకారణముననే వారి గౌరవాతిశయంబు భంగమయ్యెను. ఈపద్యమున సవతులకట్టెదురనే వెన్నుఁడు రాధికావధూమణియెడ మన్ననఁజూపెను. ఈదృశ్యము తక్కుం గల గోపికలకెల్లఁ గోపతాపంబులం గూర్చుటచే నందొకతె కృష్ణునిగూర్చి పైచందమున పలికెను. ఇచట నీర్ష్యామానము కృష్ణుని ధౌర్త్యమువలనఁ జేకూరెను.

గీ। ఆటసేరుపు మెచ్చెడు వ్యాజమునను
సరస నిలిచిన గోపికా చతురయొకతె
ప్రీతిఫలించిన కృష్ణునిఁ బడయుకతన
ముద్దుగొనె సాటిచెలి చెక్కుటద్దములను.

పైపద్యమునంగుఁ జుంబనకార్యము వ్యంగ్యమూల మునఁ బ్రకాశించుచున్నది. ఇంక నిచట నది వాచ్యరూప ముననే ప్రకటిత మగుచున్నది. పైదానియందు నాయకకృత మును దీనియందు నాయికాకృతమునునై చుంబనము తన్మూలమై యీర్ష్యామానమును జెలంగుచున్నది.

కం। రతిసేయువేళఁ గాంతుఁడు
మతిలోఁ దలపోయు నితర మహిళామణులన్
అతివా! తుల్యగుణంబుల
నతులితమాగుణము లతిశయంబు ఊహించున్. 74

ఇచట నాయకుని పరకాంతాసక్తి నిందించునాయికతో దూతిక దానికిఁ దగిన సమాధానము నిచ్చుచున్నది. ఇచట కాంతుఁ డీవర మహిమాభావముల సమస్తిలో దలపోయుననుటచే సవతులపేరుల మాటిమాటికి నుచ్చరించుట మొదలైనయీర్ష్యాదాయకములైనకార్యముల నొనరించునని తాత్పర్యము.

ఇట్టుల మానినీమణుల మనముల నెలకొనిన ఈర్ష్యాదోషముల సామము, భేదము, దానము, నతి, యుపేక్ష, రసాంతర మనఁగా త్రాస హాస హర్షాదు లను నారుపాయములచే దక్షిణనాయకులు పోఁదోలుదురు.

క॥ తుంటవిలుకాని కోలలఁ
దూటులుపడియున్న మనసు తొయ్యలికింటన్
మాటికిమాటికి జారున్
బోటులు వాటముగఁ జేయు బోధన లకటా!

ఇచట బోటులు మాటిమాటికిని బోధించినను బాలాలలామకు నాపైఁగినుక నిలువదని వలపుకాఁడు పలుకుటవలన నాపె కోపము సామోపాయముననే చక్కఁబడునని భావము.

క॥ నాసఖులచే మనంబున
వీసము దోసమ్ము నప్రవేశితమగు పెన్
రోసము వల్లభ! నినుఁగనఁ
గాసింజెందెడిని చోరకాముకు కరణిన్॥

ఈ పద్యమున వల్లభుని వదనారవింద సందర్శన లాభమున నే మానసమునందలి కోపము మటుమాయ మయ్యెనని

నాయికామణియే ప్రియునితోఁ బలుకుచున్నది. అందుచే నిదియుసామోపాయమునఁ జక్కఁబడు కోపమేకాని వేఱొండు కాదు. పైపద్యమునఁ జెప్పిన ప్రియాలాపశ్రవణమునను, నిందు వల్లభుని ప్రసన్నాననసమాలోకమునను, బాలికామణికి మానోపశమనము సంభవించెను. పైపద్యమునఁ బలుకువాఁడు నాయకుఁడును, నిచట నాయికయునై చెలంగుటయే వీనిలోని భేదము.

గీ॥ వలపుఁ జెలికాఁడు తియ్యగాఁ బలికినంత
చంచలంబైన ప్రేమ నటించు నమ్మ
పట్టికట్టెయై చెట్టు గన్పట్టుచున్న
నెల్లెడల దాని నునుఁదీగ లల్లుకొనవె?

ఇచటఁగూడ సామోపాయముననే మానభంగము గలుగుచున్నది. మొదటి పద్యమున నాయకుఁడు నాయికామణి చెలికత్తియలతోఁ బలుకును. రెండవ పద్యమున నాయిక నాయకునితో వచించును. ఇక మూఁడవదానియందు నాయిక సఖీమణులతోఁ దన మానభంగమును సమర్థించి చెప్పును. ఇదియే వీనిలోని విశేషము.

గీ॥ జవ్వనంబు నదీపూరసదృశ మకట
పుత్రికా! దివసము లతిప్రోషితములు
రాత్రు లనివృత్తములును; దుర్వారదగ్ధ
మాన మింకేల నిమది మానవైతి॥ ౪౬

ఇచట దూతిక నాయికతో జవ్వనము నిలుకడలేనిదనియు, దివసములు నిడుపులనియు, రాత్రులు పైపడఁజాలనివనియు

జడుపునుడులఁ బచరించి బాలికామణి మనములోని కినుకను వెడలనడచుచున్నది. ఇటుల బెదరింపుమాటలాడుట వలనఁ గలిగించు మానభంగమును భేదోపాయమూలకమందురు.

౭౯ గీ॥ ఎవని వెడబాసి జీవింపవీవు వానిఁ
దప్పునర్చిన నైపంగఁ దగును సుమ్మ
ఊరుగాల్చిన యేని నెవ్వారి కగ్ని
హితుఁడుగా కుండునో చెప్పు మిప్పు డబల!

ఇచటఁ బై పద్యమునందువలెఁ గడుంగడు ముద్దరాలికిఁ గాక కొంచెమూరి తేరి లోకవృత్తంబు నెఱింగిన మానినీ మణితో సఖీరత్నము సాంత్వనము లాడుచున్నది. ఊరుగాల్చి నంతమాత్రమున నగ్నిహోత్రుని కేవలము పరిత్యజించు వార లుందురా? యని ప్రశ్నించుటవలన నో బేలా! నీవొకింత శాంతముదాల్చి, జాగరూకతఁగలిగి కాంతునేలుకొన వలెనే కాని వాని నిరాకరించినచోఁ దుదకు నీవే వనటల పాలగుదువను బెదరింపు పలుకు లీపద్యమందిమిడియున్నవి. అందుచే నిట భేద రూపమున రోషభంగము గానవచ్చును.

౮౦ గీ॥ బాలికామణి! ఛండాలవాటిలోను
యజ్ఞవాటికలోఁ గూడ నగ్ని వెలుఁగు
విధివశంబునఁ బురుషుండు విషమదశను
దగులువడినంత మాత్రాన తగదు విడువ.

ఇచటఁగూడ భంగ్యంతరమున భేదరూపమున మానచ్ఛేదము దీపించుచున్నది.

కం॥ ఒకచేయి కినుకఁజూపఁగ
ముఖమారుత వీజనమున మోహితగాఁదాఁ
బకపకనవ్వుచు, వెస వే
రొకచే మెడఁ గౌగలించె నుత్సుకమతియై

ఇచట మానదుఃఖమును సహింప శక్యముఁగాక నాయకుఁడు వచ్చినంతనే ప్రియురాలతని లీలాకమలముచేఁ గొట్టుటకై చేతిని పైకెత్తెను. వెంటనే యావగకాఁడామెకు చుంబన దానమొనరించెను. అంతనామె మోహాతిరేకమున మైమఱచి, పైకెత్తిన కేలారీతి నిలచియుండఁగనే వేరు కేలితో నాతని కంఠమును గౌగలించెను. ఈపద్యమున ‘ముఖమారుత వీజనమున మోహిత’ యయ్యె ననుటచే వలపుకాఁడు ముద్దుగొని మోవి చవులాని ననుభావము సూచింపఁబడుచున్నది. అందువలననే కామినీమణి మానముపశమించుటయు వానిచుంబన దానమున కామె కంఠాలింగన దానము ప్రసాదించుటయుఁ గలిగెను. ఈపద్యమున దానపూర్వకమై మానభంగము రాణించును. ఇచట దానమన భూషాములనుటచేఁ గామినీమణులకుఁ గేవలాలంకారముల కన్న గాఢాలింగనాదులే మిన్నలై వన్నెలొల్కును.

గీ॥ చెవినిడిన కల్వ పుష్పాడి చిందినట్టి
కనుల నూడెడి వంకచేఁ గరవుదీర

మద్దుగొంటివి బళిర! నీ పుణ్యమెన్న
దేవతలకన్న మిన్నవు గావె నీవు.

ఈపద్యమునఁ గూడ దానోపాయముననే కోపోపశమనము చేకూరుచున్నది. పైపద్యమున నాయిక ప్రౌఢయై చెలంగును. ఇంక నీపద్యమునందు నాయిక బాలయై మెలంగుటవలన నామె తటస్థయై నిలుచుండెను. పైపద్యమునఁ జుంబనదాన మస్పష్టముగ నుండ నిచట నది స్ఫుటమై భాసిల్లుచున్నది. అందు చుంబనము వ్యంగ్యరూపమున వెలయుటచే నదియొట్టి చుంబన విశేషమో తెలియరాక చదువరుల నాగరికతా మాత్రముపై నాధారపడియున్నది. ఇందులకు భిన్నమై యీ పద్యమున నది నయనచుంబనమని స్పష్టముగఁ దెలియుచున్నది. నాయకుని మానభంగోపాయమును దూరమునందుండి పరికించి పరిహాసశీలుఁడొకఁడా తరుణశేఖరుని కృతార్థత నభినందించుచున్నాఁడు. 'నీవు దేవతలకన్న మిన్నవు గావె?' యని ప్రశ్నించుట 'సత్యముగ నతఁడే ధన్యుఁ'డని సమాధానము వచ్చును. ఎట్లతఁడు ధన్యుఁ డగునని ప్రశ్నము సందియ మందినచో దేవతలు రెప్పపాటులేని వారగుటవలన వారికి నయనచుంబన లాభము కలనేనియుఁ గలుగఁబోదు. అనిమిషుల కలభ్యమైన నయనచుంబన మీ యువకుఁడు లభించుటచే నిక్కువముగ నితఁడు వారికన్న నెక్కువ వాఁడని తాత్పర్యము. పైపద్యమునందలి భావమిందు భంగ్యంత
మున వచింపఁబడెను.

౭౬ గీ॥ లలితలావణ్య కలశముల్; సవతిసతుల
కోపసీమలు; స్మరగజ కుంభయుగము;
పురుష శతహృదయ ధృతమై, పొగరుమిగులు
చున్నకుచముల నెటుమోయుచుంటి వబల!

వెనుకటి పద్యములందు మానభంగకారణమైన దానము క్రియారూపమునఁ జెలంగ, నీపద్యమునఁ బ్రశంసారూపమై నాయకుని వాఙ్మహిమాతిశయము ప్రకాశించుచున్నది. అందుచే నిందు స్తుతి దానము గానవచ్చును. ఇచటఁ బ్రియురాలిలావణ్య తారుణ్యముల వర్ణనములచేఁ బెంపొందుచున్న ప్రశ్నము 'పొగరుమిగులుచున్న కుచముల నెటుమోయుచుంటి వబల?' యనుట వలన,'ఓయబలామణీ!నాకు నీ కుచోపగూహనము దయసేయు' మను తాత్పర్యమును జదువరులకు స్ఫురింపఁజేయును.

గీ॥ పాదములఁ బ్రాల నూపురపంక్తిలోను
జిక్కువడిపట్టి వల్లభు చికురభరము
తోడ, పెంపాటు మానంబుగూడ, సూడ
బెరుకుమంచును, మానస మెరుక పఱచు॥

ఈపద్యమున నతిరూపకమైన మానభంగోపాయము చెలువారుచున్నది. వలపుకత్తెల నెయ్యంపుఁగినుకల దూరమొనరించు వేళల సొగసుకాండ్రు సలుపు వింతచేతల గురుతింపలేని మొఱకు వానికొకనికి దూతిక పైపద్యమున హితముఁ గరపుచున్నది. నీవు నతిసేసినపుడా మానినీమణి పాదనూపురములఁ జిక్కువడిన నీ చికురనికరమును సడలించిన సమయమునందే సర

నుఁడవైనచో నీవా మదవతీమణికి సరభసాలింగనమునుగూడఁ బ్రసాదించి యుందువు. గాఢ పరీరంభణమును గాంక్షించిన కామినీమణి వాంఛితమును భంగపఱచితివే కాని, నీవామె మానరోషమును ముగ్ధశిరోమణివగుటచే భగ్న మొనరింప లేక పోతివను భావము నీపద్యము వెలిపుచ్చును.

౪౯ గీ॥ కాలికెలన మ్రొక్కుచునున్నఁ గఠినురాల!
మేలు చెలికానిఁ బాలింపవేల జేల?
యిదియె తుదిమెట్టుగాఁగ నెమ్మదిఁ దలంచి
దూరదూరముగాఁ బ్రేమ తొలగిచనును.

ఇచటఁగూడ నతిరూపకమైన సాంత్వనమే కాన నచ్చును. పైపద్యమునందువలెనే యిచటఁగూడ దూతిక హితము బోధించును. మొదటిపద్యము ముగ్ధుఁడైన నాయకు నకును రెండవది ముగ్ధయైన నాయికకును సమయోచిత కృత్య ముపదేశించును.

గీ॥ ఆమెమోమున నీమోము నీమెుగంబు
నాదుపాదము చెంత ఖిన్నతవహించె
నకట! యాచేయి నాచేయి నంటుకొంట
తిలకమా! నీకు నీదురదృష్టమక్కొ.

ఈపద్యమునందు నన్యాపదేశమున ననఁగాఁ దిలకము యొక్క దురదృష్టమునకు విచారము ప్రచురించుభంగి మానిని తన మనోనాథుని ధూర్తవర్తనమును గురించి విషా దము ప్రకటించుచున్నది. ‘ఆమె మోమున నీమోము తాకు

టచే నామె వదనమునందలి కస్తూరితిలకము, సురతాయాస భరమునఁ గలిగిన స్వేదాంబుధారలఁ గరఁగి నీమోము నలంకరించెను; నీవిపుడు నా ప్రణయ కలహమును బాపుటకు నా పాదముల వ్రాలినంతనే పాపమా యొయ్యారి మోమునందలి బొట్టు నా చరణముల శరణుచొచ్చెను. అనఁగా నా కాలి కంటుకొనియెను; కటకటా! యా బొట్టున కెట్టి చెట్ట చేకూరె' నను వ్యంగ్యార్థ మీపద్యమునందు సూచితమగు చున్నది. ఇచటఁ జెమటపట్టి బొట్టు కరిగినదనుట వలన నామిటారి యొక్కటమి నీటు ప్రకటించెనని భావము వచ్చుటవలనఁ బురుషాయితమని తేటపడుచున్నది. అందుచే నీపద్యమునందు నతిరూపకమైన మానభంగమును నాయికామణుల నెఱజాణతనము చదువరులకుఁ గానవచ్చును.

కం॥ చరణంబులకుఁ మ్రొక్కిన
తరి పాదాంగుష్ఠ వేష్టిత కచంబుల నే
నురువడి లాగం గలిగిన
పరమానందంబు మదిని భావింతు సదా

ఈపద్యమునందలి నాయిక సూనశరాగమోపనిషత్సముదాయమును సాంగోపాంగముగ నభ్యసించి చరితార్థత్వముం గాంచిన శ్యామాలలామ చందమునఁ జదువరులకుఁ బొడకట్టును. ఇచటఁగూడఁ బైపద్యమునందుఁబోలెనే నతిరూపక సాంత్వనము గన్పట్టును. చరణానతి సమయమునఁ బ్రియుని కేశపాశము పాదాంగుష్ఠమును బంధించెను; నేనా బంధవిమో

చనమునకై పాదాంగుష్ఠమును సరభసముగ నాకర్షణ మొన రించితిని. ఆసరభసాకర్షణము వలన నాకు సమకూరిన పర మానందమును సర్వదా స్మరింతు నని పలుకుటవలనఁ గేశ పాశ దృఢబంధన పీడనముల కలిమి నీకామినీమణికిఁ గళాస్థానము చెదరి చిందుటచే వాచామగోచరమైన సౌఖ్యము సంభవించె నను మర్మము మదన మంత్రితంత్రికులఁ బూర్ణదీక్షాపరు లైన మహనీయులు గురుతింతురు. ఆకారణమున నీ నెఱ జాణకు 'ననవిల్తుశాస్త్రంపుమినుకులావర్తించు పని వెన్న తోడఁ బెట్టినదియె' విలసిల్లుచున్నదని చెప్పినచో సత్యదూ రము గానేరదు. అందుచే నీమె తన యపూర్వవైదగ్ధ్య మత్యంత ప్రౌఢిమ మపారచిత్రరతాభిలాషములచే నాయికా మణులకెల్ల శిరోమణియై చెలువొందు నవినచో స్వభావోక్తి యేకాని యతిశయోక్తి కాదు.

ఇటుల పైనవివరించిన సామ భేద దాన నతులను చతు ర్విధోపాయముల చతురతవలన వలపుఁగినుకదొలఁగనిచో నుపేక్ష రసాంతరములను ద్వివిధోపాయముల నుపయోగించి మానవతుల మానకోపమును దక్షిణనాయకాగ్రేసరులు పోఁద్రోలుదురు.

**88** గీ॥ అగణితాశేష యువమఁడవగు కుమార!
రహి నతికాంత లోకమర్యాదయై ది
శాముఖ ప్రసారిత సారసాక్షియై జ
రించు దశ కింతి దెచ్చి వంచించఁ దగునె?

ఈ పద్యములోనిభావ మొక తరుణవయస్కుఁ డొక రమణీమణికి మరులుగొలిపి పిదప నామె నుపేక్షించెనని తెలు

వుచున్నది. ఈ యుదాసీనత లేక యుపేక్షాభావమునకుఁ గారణ మాతని పరకాంతాసక్తియో లేక యీ కామినీమణికి మానో పశమనమునకై తానుదాల్చిన కపటమానమో యైయుండును. రెండవపక్షము నంగీకరించినచో నుపేక్షామూలకమై మాన కోపోపశాంతి యీపద్యమునఁ గానవచ్చును.

గీ॥ మంచిగుణముల మక్కువమాని జడులు
వట్టి పైపై మెఱుంగుల వలతు రకట!
ముత్తెములమాని గురివింద పూసపేర్ల
మేన బోయలు దాల్చుట కానలేద?

పైపద్యమునందు దూతిక యుపేక్షవహించిన నాయ కునిఁ బ్రోత్సహించుచున్నది. ఇంక నీపద్యమునందు నుపేక్షి తురాలయిన నాయికకు దుఃఖోపశమనము సేయుచున్నది. అం దుచే నీరెంటియందు నుపేక్షయే ముఖ్యము.

కం॥ మెలమెల్లఁ బోవగదవే!
బలితముగా లాగుకొన్న పయ్యెదదానా!
తలపోయుము కుచభారము
వలనం జేకూరు మధ్యభంగంబైనన్

పై నుదాహరించిన రెండుపద్యములందును నాయ కుఁడు నాయికామణిపై నుపేక్షభావమును సూచించెను. ఇంక నీపద్యమున నాయిక ప్రియుని సాంత్వనాలాపముల నెల్లఁ జెడ జెవింబెట్టి వడివడిఁ బైటచెంగును విదలించుకొని పారిపోవుచున్నది. అప్పుడు సరసుఁ డామెను మెలమెల్లఁ

బొమ్మని మంచిమాట లాడుచున్నాను. ఇచట నీవు కుచ
భారమువలనఁ జేకూరు మధ్యభంగమును దలంపక వడివడిగా
నడచుచుంటివి; యింక నిప్పుడైన నీ నడకవలన నడుము
నకుఁ దొడరు దోసగునయినఁ దలపోయుమని పలుకు కాంతు
హితము గరపుచుండెను. 'తలపోయుము మధ్యభంగంబైన'
ననుటచే 'నీవు నాప్రణయభంగమును దలంపవైతివిగదా!'
యను సూచనకలదు. అందుచే నిందు నాయిక యుపేక్ష
దాల్చుచున్నది.

౧| కం| అనునయ దూరీకృతమై
మనమునఁ గల మానశేష మహిమంబును దా
వినయావలంబనంబునఁ
గనబఱచును విజనసీమఁ గనుగొంటె చెలీ!

ఇచట నీటుకాని మాటల నేరుప్రకతమున నైనను
ముద్దరాలి మానసమునఁగల కలత దొలఁగిపోలేదు. అందు
వలన నామె దిగులు దెలుపు మొగము క్రిందకువ్రాల్చి
మూగవలె మిన్నకుండెను. అప్పుడు సఖీశిరోమణి యొకతె
యామెకు హితోపదేశము సేయుచున్నది. ఓ వెఱ్ఱిదానా!
నీ మొగమిటుల ముటముటఁ జెందినంతనే నీమనములోని కట
కటలు నీవగకానికిఁ దెలియవు. నీవీరీతిఁ గురులసరసఁ జెలుల
యెదుట నీవలపుకానిపైఁ గినుకనూనినపగిది మిన్నవై
యుపేక్ష దాల్చుట దగదు. చూడుము! నీతోడి ప్రౌఢచేడియ
దానేమిచేసెనో— ఆమె చిరునగవు మొగమునఁ దొంగలింపఁ

గినుక లోలోనడంచుకొని పైకి ప్రేమనటించుచుఁ జరించి సతీపతు లొంటరు లేకాంతమున నున్నతరిని వినయభావమును వెలిఁబుచ్చుచుఁ గదలక మెదలక కట్టెవలెనే నిలచెను. ఇటుల మానమూని వగకానియెడ నుపేక్ష వహించుటవలన వానితప్పునకుఁ దగిన దండనము సమకూడెను. అటులనే నీవునుఁ బతితో నొంటిగా నున్నపుడుపేక్షాభావమును గనఁబఱచు'మని చెలికత్తె బుద్ధిగరపుట వలన నాయికామణి యుపేక్ష నూనెనని తెలియును.

గీ॥ ఘనతరంబయిన మన్యుదుఃఖమునఁ జేసి
మానమౌనము నూనిన యేనిఁ దాను
పవలు వంటింటి పనులెల్లఁ బాగొనర్చి
కాలికెలన పన్నుండిన కాంతఁ దలఁతు

పైపద్యమునందలి హితోపదేశ మీపద్యమునఁ గ్రియారూపమునఁ బరిణమించెను. అందువలన నిచట మానినీమణి యేకాంతవేళ ప్రియునితోనున్నపుడు వినయవినమిత గాత్రియై కొంతవడి నిలచి పిదప వలపుకాని మది జాలి గొలుప నేలపైఁబడి నిదురసెందుటచే నుపేక్ష కానవచ్చును

గీ॥ మేనుచిక్కంగఁ జేసినపేలుకాడ!
చాలనేడ్పెడివారల పాలియముఁడ!
మంచినడతను బాపిన చెంచురేడ!
వలదు చనిపోవు నటుసేయు వలదు, వలదు.

ఇచట నాయకుఁడు పూర్తిగ నాయికామణియెడలౌదాసీన్యము వహించెనని 'యముఁడ' 'చెంచురేడ' యను

సంబోధనములవలన స్పష్టపడుచున్నది. మఱియుఁ జనిపోవు నటు సేయవలదు; వలదు వలద'ని ముమ్మారు నొక్కి వక్కాణించుటవలన నాయిక చిక్కి శల్యమై ప్రాణావశిష్టయై మెలంగుచున్నదని తెల్లమగును. దీనికిఁ గారణము నాయకుని యుపేక్షయేయని చెప్పనక్కరలేకయే తెలియుచున్నది

గీ॥ సుందరాకార! పొలయల్క సొబగువలనఁ
గలుగు ప్రాణసంహరణంబు వలదువలదు
మనను నీవయినిడి చావు గనెదనేని
ముందు పుట్టువఁ గూడ నీపొందెకలుగు

ఈపద్యమును దూతిక నాయకునితోఁ బలికెను. ఇక నీపద్యమును నాయికయే నాయకునితో వచించెను. 'పొలయల్కసొబగువలనఁ గలుగు ప్రాణసంహరణంబు వలదు వలద' నుటచే నింతతో నాపై దయనుంచి నీయుపేక్షను గట్టిపెట్టుమని భావము. ఇచట పద్యమునందలి రెండవ సగమున 'యాంతే మతిః సా గతి' యను వచనము ప్రతిధ్వనించుచున్నది.

గీ॥ ప్రణయ కలహద్రుమ పరుష పవనమగుచుఁ
దరుణ పర్యాంగ నిర్వృతి కరమునగుచు
రతివిలాస నాటక పూర్వ రంగమైన
కౌగలింతలు పెంపారుఁ గాత! బాల

ఈపద్యమున నుపేక్షారూపమున నెలకొనియున్న మానకోపమును వారించుటకై సంభ్రమాలింగనమే తరుణోపాయమని దూతిక బోధించుచున్నది.

అందుచే నిందు రసాంతరము సూచితమగుచున్నది.

గీ॥ నగసశేఖర! సురభి నిశ్వసిత పరిమ
ళానిబద్ధ మండలమై యిలాతలమునఁ
జంద్రిపరిభవ మెరుగని జలజమాట
భ్రిమరక మనోహరంబయ్యె బాలమోము.

ఇచట నాయికా ముఖసౌరభమును నుతించి నాయకుని మానసమందలి యౌదాసీన్యము నత్యంతాతిశయముగ మార్చుటకై దూతిక పాటుపడుటచే నీపద్యమునఁ గూడ రసాంతరము సూచింపఁ బడుచున్నది.

గీ॥ అకట! లంకాలయానములై వసంత
మాసలబ్ధ ప్రిసరములై మహితగతుల
సతత మాపీత లోహిత చ్ఛాయ నీప
లాశ సంఘము జనముఁ గలంచుచుండె.

ఈపద్యమునందలి వసంత వర్ణనమునఁ బొందుపరుపఁ బడిన శ్లేషమూలకములైన 'లంకాలయానములై' 'సతత మాపీతలోహితచ్ఛాయ నీపలాశసంఘము' లను పదములు నాయికా నాయకులకు భయము నొదవించి హృదయములోని మానమును ఛేదించుటకుఁ దోడ్పడును. లేదా వసంతాగమ ప్రిభావముననే తరుణరమణు లొండొరులకు తమక మతిశయించును. అందుచే నిదియు రసాంతరమునకే లక్ష్యము.

గీ॥ సత్యము వచింతు వినుము వసంతమాస
మందు నో బాలకా యశక్యంబు లేదు
కురవక సుగంధములచేతఁ దరుణికిపుడు
నంతయేని సతీత్వంపు సొగసు చెడదు.

పైపద్యమున కన్న నీపద్యమునందలి భావకాంచన మింకొక వన్నెమిన్నయై చెన్నుమీరుచున్నది. పైపద్యము చివురుగొలుపుచున్నచో నియ్యది చెంగఁ గలుగఁ జేయుచున్నది. ఇచట 'బాలకా' యన నేఁటిపుకల వాఁడవు కావని తాత్పర్యము. ఇప్పటిదనుక నీవామె నుపేక్షించుచున్నను పాపమా తరుణీమణి నినువలచి సలుకడకల్గి వేఁగుచున్నది. ఇచట నీవు బాలకుఁడవు; ఆమె తరుణి యనుటచే వీరిరువురి భావములకునుగల విశేషభేదము చదువరులకుఁ జక్కఁగ తెలియవచ్చును. దీనికిఁ దోడుగాఁ గాలము మధుమాసము; మఱియుఁ గురవక పరిమళ భరితమై మలయమారుతము పైపై వీచుచున్నదని భావము. ఇట్టి సందర్భమున నీకామెపై మక్కువ తక్కువగా నున్నచో సరసు లెవరయినఁ గూరిమి భారము నాపైపై మోపుదురు సుమా! కావున వెంటనే కనుగలిగి వర్తింపుము. వెనుక జింతించుటెల్ల వెఱ్ఱితనము. అంతుచే నామె నుపేక్షించినందులకు నిన్ను నీవే నిందించుకొనవలయుఁ గాని యామెను దూరఁ బనిలేదు సుమా! యను నిందాలాపము లెన్నియో యీపద్యమునందలి మొదటి సగమున నిమిడియున్నవి. ఇదియు రసాంతరమే.

గీ॥ అనునయాలాపములఁ బల్కఁ జనినవేళ
నీదు తప్పుల లెక్కింపఁగఁ దలంచి
కేలఁ గల వ్రేళులన్నియుఁ జాలకున్న
వెక్కి వెక్కేడ్చె నా మ్రోల విద్రుమోష్ఠి.

ఇచట దూతిక పలుకుల వలన నా బాలామణి యొక్క బేలతనమును వినువారి మనము నీరై వెంటనే జాలి కలుగును. అంత కరుణా తరంగితాంత రంగులై యుదాసీన భావమును దిగనాడుదురు. అందుచే దూతిక పలుకులు కరుణా రసమును బురికొల్పుచున్నవి.

గీ॥ అనవరత బాష్ప జలభృతమైన నయన
కలశములఁ గోమల కపోల తలమునందుఁ
గానబడు చందురునిఁ గలంకంబు నెల్లఁ
గడగుచున్నట్టి మానినిఁ గాంచు మనఘ. ౧౦౦

పై పద్యమునందలి భావమిట భంగ్యంతరమునఁ బొందింపబడినది. ఇచటఁగూడ దూతికయే నాయికామణి శోకార్తిని సరసుల కన్నులకుఁ గట్టినట్లు సహృదయుల మనములకు నచ్చొత్తినట్లు విస్ఫుట వర్ణముల లిఖించి ప్రదర్శించెను. 'ఎడ తెగని కాటుక కంటి నీటిచే నీబోటి తన చెక్కుటద్దములఁ బ్రతిఫలించిన పున్నచందురు నందలి కందును గడుగుచున్నద' ని నేరుపుమీఱ చేటి చిత్రించిన పటము నందలి సొంపును మనోనేత్రమునఁ దిలకించినంతనే 'వజ్రపంజర నిభంబైన' ధూర్తనాయకుని యుదాసీన భావము

క్రమక్రమముగా "లోహమై గ్రావంబై, దృఢదారువై, తరుణవృక్షంబై, ఫలప్రియమై, పూవై, లసన్మకరందమై కరగు పో పో నీళ్లకుం బల్వనై" యని వచించిన కవివాక్య ప్రౌఢోక్తి కాఁజాలదు. అందుచే నీపద్యముగూడ రసాంతర మునకే దృష్టాంతము.

కం॥ తరుణికి కోపము పోవఁగ
చరణద్వయమునకు నేను సాగిలి మ్రొక్కన్
దరితో ఘన గర్జాడం
బర ముపకారంబు సేసె భాగ్యం బదిరా!

పై నుదాహరించిన పద్యములన్నియు దూతికా ముఖము నందుండి వెలువడినవియే. ఇంక నీపద్య మట్లుగాక నాయకుని వదన నిర్గతమై ప్రకాశించుచున్నది. ఇచట నతిరూపక మైన సాంత్వనోపాయముతోఁ గలసి మెలసి రసాంతరమూలక మైన మానభంగ విధానముగూడ కానవచ్చును. నాయకుని నమస్కారబాణమునకుఁ జెక్కు చెదరని మానినీ మాన మహీధ్రము పిడుగుపడిన వెనువెంటనే తుత్తుమురై దూది పింజలవలె పైకెగిరి కానరాక పోయె. ఆ యురుములు మెఱుపులు మొకమైన వానిని మదిఁ దలంచి నంతనే తరుణీ మణికి గుండెచెదరి బెదురు కమురుకొనుటచే నిట రసాంత రము దీపించును.

కం॥ వనముల మొలచిన పచ్చిక
వనముల సెలయేటి నీటి వలనఁ బెరిగినన్

జనిపోవు నంతదనుక
వనితా! జింకలును లేళ్ళు వలచుగాదే?

వాడిసూదులపోలెఁ దాకి చెఱువుని చెవులు చిల్లులు వోవ రమణీలలామ మీసరణి నన్యాపదేశముగ సఖీమణితో వచించుచున్నది. ఇచట వనమృగముల యవ్యాజ ప్రేమమును వినుతించు నెపంబున నాగరిక శిరోమణుల కైతవప్రేమము గర్హ్యము నింద్యము వేయేల యనాస్వాభావికమును భావమును నాయిక సూచించుచున్నది. మఱియు వ్యాజరహిత ప్రేమవర్షమును బ్రసాదింపలేనివారు వనమృగములకన్న నధములని తేటపఱచుచున్నది.

గీ॥ పెచ్చుపెరుగు పేరాకటి చిచ్చుకతనఁ
కలఁగియుఁ బ్రియురాలి మొగంబుదలచి
నంత గబళింపగా నెత్తినట్టి లేత
తూడదే! యేన్గతొండాన వాడుచుండె 10

పై పద్యము నాయకుని పరోక్షమున సఖీమణితోఁ బలుకఁబడెను. ఇంక నీపద్యమును నాయికామణి నాయకుని ప్రత్యక్షముననే పలుకుచున్నది. అదివనమృగ సామాన్యమునకు వర్తించును; ఇది కనులకెదుటఁ గానఁబడు మదగజ రాజమునకు సంబంధించును. ఇచట నొక విశేషమున్నది. ,యాహారము విహారమున కాధారమై విలసిల్లును. అట్టిచో నీభద్రకుంజరము ప్రేయసీమణిని- వీక్షించినంతఁ గాదు- మఱి స్మరించినంత మాత్రముననే సరస బిస లతాంకురమును

గబళించుట కట్టిపెట్టి హృదయవీధి లీలాకృతిఁ గానవచ్చు హృదయేశ్వరినిఁ గాంచుచు పరమానంద వారిధి నీదులాడు చున్నది. ఇంక నీవనినదో నీతోఁకూడి మాడి చరించుచు నవ్వుఋవ్వులఁ బజపించుచు మురిపెంబునం దిరుగు సరసురాలి నుపేక్షించుచున్నావు. కాన నిప్పుడైన నోసాగసుకాడా! నీమాతంగ పుంగవునిఁ గన్నైయైన మందాదరుడవు కాక చెలఁగుమూ' యని సూచింపుచు నిసర్గస్నేహమూహాత్మ్యము నీపద్యము హృద్యముగా బోధించుచున్నది.

గీ॥ జీవితములు శాశ్వతములు గావునుమ్మ!
యౌవనంబులు పోయెనా రావుమరల!
నకట! యీపాడులోకంబునందుఁ బ్రీతిది
నంబుఁ దలపోయ సరిసమానంబుగాదు.

ఈపద్యమునందు జీవితము క్షణభంగురము; యౌవనము స్వప్నప్రాయమని వచింపఁబడుటచే 'దీపముండఁగనే యిల్లు చక్కబెట్టుకొను' మను భావము వచ్చుచున్నది. 'జగము సర్వము చంచలము; కాన జవ్వనము సఫల మొనరించుకొను' డని సఖీలలామము నాయికా నాయకు లిరువురకును బోధించుచున్నది. ఇచట శాంతము శృంగార దీపకమగుటచే గసాంతరము గానవచ్చును.

ఇంతవరకు విపులముగ వివరింపఁబడిన మానభంగ హేతుకములైన దృష్టాంతములఁ బరికించినచో వీరవిహార మొనరింపఁ దలంపుగొను నారీశిరోమణులకుఁ జేతోడు

వాతోఁకముగాఁ జెలంగెఁ గూరిమి పోరాటములే గెంటని బంటు
లని సరసమతు లూహింపక మానరు. మఱియు మదవతీ
మణుల బింబాధరముల చవులకన్న మానినీమణుల నూటి
పోటి మాటల రుచులే మధురతరమని సహృదయ సమ్మ
తము. ఇంతియేకాదు మానినీ కాముకుల మధ్యఁ జెలరేగు
చెఱకు విలుకాని దురమునఁ జిలుకలకొలుకుల పలుకు ములు
కులకు సరిలేని కఱకు చురుకు తియ్యందనముల నించి, లలనా
జనలలామలకుఁ దులలేని జయమును జేకూర్చి వెలలేని
వలరాచ వానికిఁ బట్టాభిషేకము గట్టుటకు, నెయ్యపుం గయ్య
ములే సాటిలేని మేటిసాధనలై రాణఁజెందునని జాణల గట్టి
నమ్మకము. అందుచే మానినీమణుల కోపోపశమనము
గావించుటకై నాగరిక శిరోమణు లనేకగతులఁ బ్రియత్నిం
తురు. ఈ విషయమునందు కట్టిదియే కుసుమ శర సమరము
నందలి గుట్టుమట్టుల నెల్ల నెఱింగి వ్యూహ ప్రతివ్యూహ
ములఁ బన్నియు విప్పియు జయమును సంపాదించుటకు
మంత్రియై సేనానియై మన్ననఁ గాంచును. ఇందు నాయికా
నాయకులే ప్రత్యర్థులై వన్నెకాంతురు. కాని వీరిరువురిలో
దూతిక తా నెవరిచెంతఁ జేరి మంతనములాడుచుఁ బోత్రిడ
తనము నెఱపునో వారికి జయము కరతలామలకమై క్రాలు
చుండును. అందుమూలముననే కాబోలు- నాయికానాయ
కులు సఖీమణి దూతికలు మొదలుగాఁగల వారెల్లరు ను
బలు తెరంగుల మానభంగమునకై పాటుబడుటయు కవికుల
తిలకులు వివిధభంగుల దానినే వక్రోక్తి వైచిత్ర్యము

భణితిప్రకారములు నెఱయ వర్ణించుటయు సంభవించు చున్నది. ఈమూనమునే ప్రాచీనులు కొందరు విరహము నీర్ష్య యని వేరొనరించుటచే విప్రలంభము లేక వియోగ మైదుతెరంగులయ్యెను. రెండు విభాగములకును వీలుగా నుండునటులనే పైన లక్ష్యము లొసంగఁబడెను.

105 కం॥ వరునెడబాయ నశోకము
విరహానలమున విదగ్ధఁ బీడించుఁ జుమీ
చరణప్రహారముం గుఱు
తెఱిగిన నెవ్వాఁడు మది సహించుక్ జెపుమా॥

ఇచట వసంతసమయము సమీపించుచుండఁగా గురు పరతంత్రుఁడును కార్యభార వివశుఁడునైన యొకానొక తరుణ శేఖరుఁడు ప్రియురాలి సరసఁబాసి ప్రవాసమున కేగ నుద్యు క్తుఁడై యున్నాఁడు. అట్టితరి నాతని ప్రయాణము నరి కట్ట దూతిక స్వముఖమున నన్యాపదేశముగ నాయికామణి వాంఛితమును వలపుకాని కెఱుకపఱచుచున్నది. ఇచట నశోక వృత్తాంతమును వచించుచు చరణప్రహారమును స్మర ణకుం దెచ్చుటవలన 'నీ ప్రియురా లుత్తమనాయికా లలా మమనియు నందుచే నామె కాలితన్నులవలనఁ జేకూడిన పరమానందకరమైన దోహదవిశేషమున నచేతనమైన వృక్ష ముంగూడ నవ్వుబువ్వులనించె" నని భావము స్ఫురించును. అట్టి శ్యామాశిరోమణిని వీడి విదేశమున కేవేగినఁ జో సమ యమున కెదురుచూచుచున్న యశోక మామెను సత్యముగ

సశోకురాలుగా నొనరించును. అందుచే నో సరసుఁడా! ప్రవాసవాసమును జాలించుమని యాశయము.

గీ॥ పోవలసినఁ గాఁతుఁడా! పొమ్ము పొమ్ము
అనఘ! దారి శుభప్రదంబగును గాత
ఎచట నీవు వసించెద వచటనాకు
జన్మముల్ గులవేలు పొసంగు గాత.

ఈ పద్యముగూడ కార్యార్థియై కడు దూరదేశమునకు బోవనెంచుచున్న పరువపుంబ్రాయమందున్న ప్రాణేశ్వరునకుఁ బ్రయాణత్వరను మందగింపుమని నాయికయే స్వయముగ విన్నవించుచున్నది. ఇచట దూతికకు మాఱుగా వలపు కత్తెయే బ్రతిమాలుటవలన సతీపతుల కిరువురకుంగల పరిచయము చదువరులకు విశదమగును. పోవలసిన కాంతుఁడా పొమ్ము పొమ్మ'నుట వలన విధిలేక ప్రియుఁడు విదేశమేగుచున్నాఁడనియు నందుచే నీ నాయికామణి వల్లభుని వాల్లభ్యమున కింతదనుకఁ బాత్రురాలయ్యెననియుఁ దోచుచున్నది. ఇందుఁ 'గాంతుఁడా!' యనుటచే నాయకుఁడు 'సుందరీమణుల మరులుకొలిపి వలవని వలవంతల ముంచఁ గలిగిన యంతవాఁడనియు నట్టి మనోహరుఁడైన సరసశేఖరుఁ బాయుట ప్రాణములఁ బాయుటయే కాని వేరుకాదనియుఁ' దాత్పర్యము వచ్చుచున్నది. దీనికిఁ బ్రమాణముగ నీ పద్యమునందలి రెండవసగము చెలువారుచున్నది. 'ఎచట నీవు వసించెద వచటనాకు జన్మము కులవేలుపొసంగుఁగాత!'

మని వేడికోలొనరించుటవలన 'నాయిలవేల్పవై పొలు
పొసంగు నీవు తప్పనిసరియై ననువీడినవెంటనే నే నును
రుంగుపీడుముడుగాని మనలేననియు ముందు పుట్టువునందుఁ
గూడ నీ పొందుఁగాంచునటులఁ గులదేవతలు నన్ననుగ్రహిం
తురుగాక' యనియు భావము సూచింపఁ బడుచున్నది.
అందుచే నీ పద్యము 'పొదలోన పొంచియున్న జోడు
పులుగులకన్న చేతఁ బట్టువడిన యొంటిపిట్టయే చాల మేలను
సామెతను స్మరణకుం దెచ్చి కలుగునో కలుగదో చెప్ప
నలవిగాని ముందు రాఁబోవు ముచ్చటలకై వెట్టిపడక
యరచేతిలోని నిమ్మపండువలె నందముం జెందు ప్రియు
రాలి పొందు చెందుటకై సొగసుకానిఁ బురికొల్పును.

గీ॥ ప్రియుని ప్రస్థానకలశంబు పమునఁగలుగు
తియ్యమామిడిగున్నపైఁ దీటుకొనిన
లేఁజివురుటాకు జొంపము ప్రయాణ
వాంఛను హరించు రోదింప వలవదమ్మ.

ఇచట వాగ్రూపమునఁగాక క్రియారూపముననే ప్రియుని భావిప్రవాసము వారింపఁ బడుచున్నది. కుల బాలికామణి మనములోని లజ్జాప్రేమముల నెఱిఁగి దూతిక ప్రస్థానకలశము నాయత్తపఱచు మిషచే 'తియ్యమామిడి గున్న పూచిన లేఁజివురటాకుల జొంపములచే' నాయకుని ప్రయాణకలశము నలంకరించెను. ఇచటఁ బ్రయాణము చేయఁబోవు వారలకు శుభసూచకముగఁ బ్రస్థానకలశమును మంగళద్రవ్యములతో నింపుదురు. అందుచే దేశాచారము

ననుసరించి దూతిక పచ్చని చిగుళ్ల నాపాత్రపైనుంచెను. ఇట్టు లొనరించుటవలన రసికవతంసమైన నాయకుఁడు బాల రసాల సాల నవపల్లవముల నవలోకించి నంతనే వసంతాగమ మును గురుతించి తన దూరదేశ గమనమును గట్టిపెట్టునని దూతిక యుద్దేశము. కావున నీరీతి నాయకుని ప్రయాణ మునకు భంగముంగలిగించి యా శుభవర్తమానమును దూతిక నాయికామణికిఁ దెలిపి యామె దుఃఖము నణున యించుచున్నది.

గీ॥ నవ వినీలాభ్ర సందర్శనంబు కతనఁ
గంఠగత జీవిఁ గోడలింగాంచి యత్త
సుతుని సంజీవ నౌషధీ లతిక వోలెఁ
బేర్మిఁ బాలించు పనులెల్ల విడచివచ్చె.

ఇచటఁ బ్రవాస వాసియైన కుమారరత్నము కార్య భారమున నింటికి వర్షాకాలమునకైన రాకుంటచే సంసారసాగ రమున నీదులాడు చతురురాలైన యత్త ముద్దుకోడలి చిత్తము నగల యుత్తలపాటును గమనించి పనులెల్లమాని కంటికి రెప్పవోలె నామెను గాపాడుచుండె ననుటచే నిట నాయికా నాయకుల ప్రవాస వాసక్లేశము సూచింపఁ బడుచున్నది.

గీ। గుమ్మమున మాధవీలతా కుంజపుంజ
మల్లిబిల్లిగ నల్లెడ నల్లుకొంట

దారిఁబోయెడివారలఁ దేరిచూచు
పున్నెమది గతపతికకు సున్నయయ్యె.

ఈపద్యమున 'మాధవీలతాకుంజ పుంజ మల్లిబల్లిగ నెల్లెడ నల్లుకొనియె' ననుటవలన జడములైన చెట్లు చేమలు గూడ బిగికవుంగిలింతల గిలిగింతల సుఖమును జూరగొను చుండెనని భావము. ఈదృశ్యము 'గతపతిక' యనుటచే భర్త నెడబాసి వసించు బాలామణికి మదనాగ్ని సందీప్తమయ్యె నని సూచించును. పోనీ ప్రియునిరాక కెదురుచూచుచుఁ గాలము గడుపవచ్చు ననుకొన్నచో మాధవీలతాకుంజ పుంజ మెల్లెడ నల్లుకొని గుమ్మము నావరించియుండెను. అందుచే దారిపోవువారలఁ జేరిచూచిననేకాని తన ప్రియునిరాకను గుర్తించుటకు వీలుకలుగదు. అందుచే నాభాగ్యముకూడ నీమెకు సున్నయయ్యెను. కావున నీపద్యము ప్రవాస వాస ఖిన్నతను సమగ్రముగ వచించును.

110 గీ॥ కారుచిచ్చుల మనులచేఁ గానుపించు
వేసవిని నల్లనగుచు నీవింధ్యశిఖరి
వంతలుడుగుము ప్రోషిత పతిక! మదిని
గ్రొత్త తొలకరి మబ్బుల గుంపుకాదు.

చిరప్రవాసియైన నాయకుఁ డింకను రాకుండుటచేఁ బ్రావృడాగమ ప్రారంభముంగని వాపోవు ప్రోషితపతికం

గాంచి ప్రౌఢసఖీమణి యో ,బేలా!యివి తొలకరిమబ్బులు గావు; కారుచిచ్చుల మసులుసుమా' యని యోదార్చు చున్నది. అందుచే నిటఁగూడ ప్రవాసమే.

కం॥ ధవు నెడబాయుట మదిలో
దవిలిన రతిసుఖము లొకటఁ దలఁపునకుఁ రా
నవనీల నీరదంబుల
రవ మెంతయు పథ్యపటహారావము వోలెన్॥

పై పద్యమునందు సఖీమణి నాయికారత్నమున కనునయాలాపము లాడుచుండ నీపద్యమునందు నాయికా వతంసము సఖీలలామకు దన మనమునంగల మదనసంతాపమును వెలిఁబుచ్చుచున్నది. అందువలన నిచటఁగూడ ప్రోషిత భర్తృక ప్రవాసశ్రమము గాననగును.

గీ॥ చూతముం గంటి; మద్య మాఘ్రాతమయ్యె
మలయమారుతములు మీదఁ బొలయుచుండె
నకట! కార్యముల్ భారంబులయ్యె వదిన!
యెవతె కాంతఁడు వల్లభుండవునొ చెపుమ॥ ॥౨

పై నుదాహరించిన వానిలో వర్షాగమమువలనఁ బ్రవాసము దుఃఖదాయకమయ్యెను. ఇంక నిచట వసంతాగమమువలనఁ బ్రవాసము సంతాపకరమయ్యెను. ఇచట నాయిక ప్రవాసఫలితమైన భావి మరణమును నాయకుని సోదరితోనే ప్రసంగించుచున్నదని ,వదిన! యెవతె కాంతఁడు వల్ల

భుండవునో చెప్పుము' యను ప్రశ్నమువలనఁ జదువరు లూహింపఁగలరు. కావునఁ బ్రవాసము మరణకారణ మయ్యెను.

గీ॥ విరివిగా నెల్లదిశల వ్యాపించు కొఱకు
కటకతటుల నన్యోన్య లగ్నంబులగుచు
విడిసియున్న మేఘంబుల వింధ్యశిఖరి
వల్కలమువోలె మెల్లఁగా వదలుచుండె॥

కార్యాంతరాధీన మానసుఁడైన యొకనితో నాతనితోటి బాటసారి వర్షాగమమును సూచించి స్వదేశగమనమునకై త్వరపెట్టును.

కం॥ గిరిశిఖరంబుల నిలఁబడి
కరముల ధనువుల్ ధరించి కాంత్రుపుళిందుల్
పరువెత్తెడు నేనుంగుల
కరణిన్ వింధ్యాద్రిఁజేరు కాలాభ్రములన్॥

పై భావమే వేరొక తెరంగున నిట వచింపఁబడెను.

115 గీ॥ ప్రియుఁడ! యుత్ప్రేక్షచేత లభించినట్టి
నీదు మొగమును జూచినమీఁద జీవి
తమ్ముపై నాసపుట్టి దుఃఖమ్ములెల్ల
విడచి రోజుల నీరీతిఁ గడపుచుంటి॥

పై రెండుపద్యములలోఁ దోటి చెలికాఁడు ప్రవాసి యైన వేరొకని మనగ్రామమునకుఁ బోదమని తొందరపెట్టుచున్నాఁడు. ఇంక నిచట నాయికామణి స్వయముగ నాయ

కునకు సఖీముఖమువనో లేక దూతికా పరమువనో తన ప్రేమ సందేశమును బంపుటచే నాతని స్వగృహాభి ముఖునిగా నొనరించుచున్నది.

గీ॥ చానరో! విను తెలవారు జామునందు
వలపు చెలికత్తె నెవ్వఁడో తలచిపాడు
పాట పూవిల్తు కోలల పోటుగంట్ల
నెడద నునుపచ్చిచేయఁగాఁదొడఁగె నకట"

ఈపద్యమునందుఁ బ్రవాసధరమున వలవంత వేగు నొక తరుణుఁడు ప్రియురాలిఁ దలచి వేగుజామున విరహా గీతము లాలపించును ఆపాట చెవిఁబడినంతనే నీటుకాని కూటమికిం దూరమైన బోటికొకతెకు చిత్తమున తత్తర పాటు చేకూరెను. అనఁగా నాపాట యామె మనమున నడఁగి మడఁగియున్నతమి రేచెను. అందుచేఁ "దగిలిన కాలే తగు లును, నొగిలినమనమే నొగులు' ననిన సామెతగఁ గఁది యుందిన విరహిణీ మానసము మరల పచ్చియై ముల్లుపుచ్చి కొట్టుడచిన చందమాయెను. పైపద్యములలో మధుమాసము నీలాభ్రములు, ప్రియాసందేశము మొదలయినవి విరహా స్మారకములై ప్రవాసక్లేశమును దుస్సహ మొనరింప నీ పద్యమునందు మధురగానమే మదనోద్దీపనమై చెలంగెను.

గీ॥ సరవి నిను బాసి నన్నాళ్లు చంద్రవదన
చంద్రధవళము; దీర్ఘాక్షి! చాలదీర్ఘ

పై చతుర్యామములు శతయామములుగఁ
గామినీమణి! యామినుల్ గడపినాఁడ॥

చిరప్రవాసాగతుఁడైన నాయకుఁడు నాయికతోఁ దా ననుభవించిన విదేశవాస క్లేశమును వివరించి యామెను బ్రసన్నురాలనుగాఁ జేయును.

౧౧౯ గీ॥ కట్టు! ఓసారి! దుష్కరకారకుండ!
నీదుగమనంబు మరల చింతింపఁజేయు
వేణిబంధ తరంగిణీ వేల్లితములు
చికురములు సరళంబులై చెలగవింక॥

ప్రవాసమునుండి మరలివచ్చిన ప్రియుఁడు రెండు మూఁడు దినముల తరువాత ముద్దరాలికి బెదురుదయించులకై 'మాపో రేపో మఱల బ్రయాణము రానున్నది సుమా' యని యామె సఖీమణితోఁ బ్రసంగవశమునఁ బలికెను. ఆమాట వినిన వెంటనే చతురురాలైన యామె పై పద్యమును జదివి 'నిన్న మొన్నదనుక నీ ప్రియురాలు ప్రవాసవాస దీక్ష నత్యంత సమర్థముగ జరిపెను. ఇంక మరల నామె కాభరమును గల్పింప నెంచకు' మను భావమును వెలిఁబుచ్చెను. ఇచట 'వేణిబంధ తరంగిణీ వేల్లితములు చికురములు సరళంబులై చెలఁగ' ననుటవలన నాయికామణి ప్రియుఁడు విదేశవాసిగా నున్నపు డేక వేణీ పరిధానములతోఁ గాలముఁ గడపెనను సంగతిఁ దెలియవచ్చును. అలకలు దువ్వుట సగసాన్నముల భుజించుట

మైకలపములద్దుట తిలకంబు రకంబుగ దిద్దుట సొమ్ములు
గై సేయుట సుమాదుల ధరించుట మొదలైన భోగసంపదల
నాథుఁడు చెంగటలేనివేళల సాధ్వీ శిరోమణు లనుభవింప
రాదనియు, నిట్టుల సంచరించినపుడే ప్రవాసదీక్ష పరిపాలింపఁ
బడుననియు శాస్త్రసమ్మతము. ఈపరిమాణము ననుసరించి
పైపద్యమునందలి నాయిక చరించెనని 'తరంగిణీ వేల్లితములు
చికురములు సరళము లింకను గాకున్న' వను పదములు
దృఢపఱచును. చిరపరివాసము గానిచోఁ బరివాసదీక్షను
బాలింపనిచోఁ జికురములు తరంగిణీ వేల్లితములుగాక సరళ
ములుగానే చెలఁగును. నూనెరాచి దినదినమును నున్నగ
దువ్వుచున్నచోఁ గెరటములవలెఁ గురులు వంకర టింకరలుగ
దిరుగక నిడుపులై దట్టములై నిగనిగలాడుచునే యుండును.
అట్లుండక వంకరలు తిరిగియుండుటచే నీ నాయికామణి
పరివాసవాస క్లేశము నత్యంతముగ ననుభవించె ననియే చెప్ప
నొప్పును.

> ఇటులఁ బరివాసము భావి వర్తమాన భూత
> ము లను దశలఁ బెంపొందుచు ననేకవిధముల
> విలసిల్లును. ఇంక విపరిలంభ శృంగారమునకు
> శాపహేతుకము లేక కరుణమను కడపటి విభాగ
> మొండుకలదు.

కవికుల చక్రవర్తియైన కాళిదాసుఁడు శాపహేతుకవిపరి
లంభమునుసూచించుటకై మేఘసందేశమను ఖండకావ్యమును

విక్రమోర్వశీయమను నాటకమును రచించి యుండనోపు. వీనిలో మొదటిదానియందు యక్షునకును రెండవదానియందు నూర్వశికిని శాపరూపమున వియోగము సంభవించెను.

యువకు లిరువురిలో నొకరు లోకాంతరమునకు విధివశమునఁ బోయినపుడు మిగిలినవారు విమనస్కులైనచో దాని గూడ కరుణవిప్రలంభ మందురు. కాని కొందరిచట నొకనియమము నేర్పరచిరి. అదియేదనగా:- వారలొండొరులు మఱలఁ గలసుకొననిచో, నొకవేళ శరీరాంతరమున సమాగమము చేకూరినచో, నపుడుకరుణ రసమేకాని కరుణవిప్రలంభము గాదందురు. ఈ నియమము ననుసరించినచో రతీవిలాపాదులు కరుణరసముగానే పరిణమించును గాని విప్రలంభశృంగారము గానేరదు.

ఇంక నిచట కరుణరసము, కరుణ విప్రలంభాదులకుఁ గల విభేదమును విమర్శించుటకుఁ బూనక మిగిలిన రసములలోఁ గొన్నిటికి సంక్షేపముగ లక్ష్యముల నొసంగుదుము.

కం|| మనను నపుంసక మంచుఁ
వనజాక్షినిఁ దోడితేర బంపితి; నట దా
ననయము రమించు నకటా!
వనటల పాలైతి నేనుఁ బాణిని కతనన్

ఈపద్యమునందొక వైయాకరణ శిరోమణియొక్క నపుంసక శృంగారము వివరింపఁబడెను. పాపమతఁడు పాణినీయ వ్యాకరణమునందలి సూత్రములనన్నిటిని వల్లె వేసిన గ్రంధకీటకము. అందుచేఁ దానుఁ బాణిని రచించిన ప్రకారము నపుంసక లింగమైన మనస్సును బ్రియురాలి కడకుఁ బంపినచో నెట్టిమోసమును జరుగదుకదా యని తలంచెను. అంతియేకాని తృతీయ పురుషార్థ రహస్యముల నించుకయు నెఱుంగఁడు. ఎఱింగినచో నిట్లు పాణిని తన కొంపఁ గూలద్రోసెనని విలపింపడు. ఈతని విరహ విలాపము వినువారికడుపు వ్రక్కలగునట్లు నవ్వు పుట్టించుటచే నిట హాస్యరసము.

౧౨౦ గీ॥ కలువరేని విశాఖల కలయికలను
లెక్కలను వేసి పరిచూచి లెక్కపెట్టు
గాని రతికేళి విటకోటిఁ గలయఁజూచు
గృహిణి తలపోతలను జోస్యుఁ డెఱుఁగలేఁడు.

ఈపద్యమునందు దైవజ్ఞుని గృహిణీవృత్తాంతము తేటపరుపఁబడెను.

గీ॥ చేటిగాఁదొల్త; తరువాతఁ జేటియగుచుఁ
బిదప పంటెనకత్తెయై పొదలుచుండి;
తుదకు వగలెల్ల కడమలై తొలఁగి చనఁగఁ
గనుము! ముదిలంజ యోగిని గాగమారె.

ఈపద్యము నందొక తుంటరివాఁడొక యోగినియొక్క పూర్వవృత్తమును వెలిఁబుచ్చుచున్నాఁడు. ఈ రెంటిలోను హాస్యమే కానన గును.

ఇచట హాస్యము, క్రమముగా నుత్తమ, మధ్యమాధమములని మూఁడు తెరఁగుల సూచింపఁబడెను. ఉత్తమము స్మితము, హాసితమనియు; మధ్యమము, విహసిత మవహసితమనియు; నీచ, మపహాసితమతిహాసితమనియు, నారుభేదములు.

1 ఉ॥ గీ॥ ముద్దుటిల్లాలు లేని యాపెద్దవీటఁ
దెల్లగించిన పాతుల విధముగాఁగఁ
దోఁచు కూటంపు నెలవులఁ జూచి చూచి
కాపుకొడుకు లోలోననే క్రాఁగిపోవు.

ఇచటఁ బ్రియురాలి మరణాత్మకమైన కరుణము పొంగి పొరలుచున్నది.

కం॥ పనిలేకయున్న పామరుఁ
డనయంబుఁ దనదు పొలము నందుండుటచేఁ
దన జాయ లేని గృహముఁ
గనుదుఃఖము బాసి దా సుఖంబును బొందుఁ.

ఈపద్యము ప్రియురాలి స్మరణము వలనఁ గలుగు దుఃఖము నడంచుట కొరకు పామరుఁడు కార్యాంతరములఁ గల్పించుకొని దుఃఖశాంతిఁ బొందుటను బోధించుచున్నది.

పై పద్యము ప్రియురాలి యచిరకాల మరణమును క్రిందిది. చిరకాల మరణమును గాని లేదా నాయకుల వివేకాంతరములను మనోదార్ఢ్యములనుగాని నిరూపించు ననవచ్చును.

గీ॥ సకలబాంధవ చింతను సరగఁబాసి
గురుకుల ప్రణయంబును గూడవీడి
మురువులొలుకుచునుండెడు ముద్దుకూన!
యకట! పరలోకపథికుఁడ వైతివెట్లు?

ఇది పుత్రశోకమువలని కరుణము.

గీ॥ ఎంతటిమహాత్ముఁ డవతార మెంతవింత!
యెట్టి యభినవభంగి! యిదెట్టికాంతి!
ధైర్యము, ప్రభావము, నుతింప తరముకాదు
దాకృతి నవీన మీసృష్టి నరయఁబోము॥

ఈ పద్యమునందు నద్భుతరసము మెండుకొనియున్నది.

గీ॥ లీలమైఁ జరాచర జగజ్జాల సదన
మై, వెలుఁగు నీవదనంబు నరసినంత
గగన గాంభీర్యమంత యుగళితమయ్యె
మేని చైతన్యమెల్లను న్యూనమయ్యె॥

అద్భుతరసమీ పద్యమున నిండియున్నది.

గీ॥ లలిత మలయానిల హాలాహాలములయందుఁ
కలికి కుంతల భోగి భోగములయందు

శ్వపచునింటను నాయింట సైతమిపుడు
పరమపురుషుని భక్తియే పాదుకొనియె॥

ఈ పద్యమున శాంతరసము నెలకొనియున్నది. ఇచటఁ బ్రథమార్థమున నుత్తమాధమములును ద్వితీయార్థమున నధమోత్తమములును వచింపఁబడుటచేఁ గ్రమభంగము గానఁబడుచున్నది- క్రమభంగము కావ్యముల దోషమైనను నిచట నదియే గుణమై ప్రాప్తిచెందెను. ఎట్లన నీక్రమభంగము వక్తృవిజ్ఞానద్యోతకము కావున నిచటఁ బలుకువానికిఁ బరమపురుషుని భక్తి పాదుకొనుటచే నుత్తమాధమ తారతమ్యము నశించెనని సహృదయులకు గోచరించును- ఇచట నుదాహరింపఁబడని రౌద్ర వీర భయానక బీభత్సములకు లక్ష్యముల గ్రంథాంతరములఁ గాంచఁ జదువరులు ప్రార్థితులు.

భావహీనమై రసముగాని, రసరహితమై భావముగాని పెంపొంద నేరదనియు, నందుచే నొండొరులు కలసి మెలసి వర్తించు నపుడే రసభావములు సొంపులు ముంపుచుండుననియుఁ గవిచంద్రులు వచింతురు.

విభావాదులచే సూచింపఁబడి రత్యాదులెపుడు చిదానంద చమత్కార రూపమునఁ బరిణమించునో యప్పుడవి రసములని పేరొందును; స్వకార్య కారణములచే

సూచింపఁబడి దేవాదివిషయ రత్యాదులు చిదానంద రూపము నెప్పుడు పొందునో యప్పుడవి భావము లనఁబడును. చమత్కారముతోఁ గూడియుంటయు వీడియుంటయే రస భావములకుఁగల భేదమై చెలఁగును. ఇంక నిచట దేవాది విషయమైన రత్యాదులకును రసభావాభాసాదులకుఁగల లక్ష్యములను రచింతును.

దేవవిషయ రతి-

గీ॥ కంఠమూలంబునందుంట కొలకూట
మైన నో మహాదేవ! నా కమృతమాను
నెత్తినిడుకొన్న నమృతమ్ము నీదు మేని
కన్న వేరాట నామదిఁ గరఁచకుండె॥

ముునివిషయ రతి-

గీ॥ చన్నపుట్టువునం గల పున్నెములను
మిమ్ముఁ గంటి మహాత్మ! పాపమ్ము చెల్లె
వచ్చుశుభములు మీవంటి వారిరాక
తెలియఁజేయు త్రికాలంపు ఫలము సుమ్ము॥

ఇచట దేవాది రతియనుటచే గురునృపపుత్రాదు లూహ్యములు. ఇంక కాంతావిషయమైనచో దానిని శృంగారమందురు.

ఇంక వ్యభిచారిభావములచే వెలుఁగునది యెట్లనః-

గీ॥ వలపుపసలను వెదజల్లు సొలపుఁ గనుఁగొ
లంకులం జిరునవ్వు దొలంకఁజేయు

సొగసుకత్తియ ముద్దుల మొగము దలచి
సుధను మదిలోనఁ దలపోయ వృథయగాదె?

ఇందు నాయికావిషయ స్మృతి నాయకునకుఁ గలుగుచున్నది.

(౯) గీ॥ కనుల నెడబాయకున్నది కలువకంటి;
నిదుర రాదాయె; రాతిరి కొదువపడదు;
వగచువారల మదనుండు పొగులఁజేయు;
పలుమరుంగీడు లెదురుగా వచ్చునకట॥

ఇచట దైన్యము గానవచ్చును.

కం॥ అనుఁగుఁబ్రియురాలి నెడబా
సినవెంటనె చింత మదివసించెనుగాదే
యని వీనిఁ బాసె నిద్రయుఁ
గొనకొని యెవ్వఁడు కృతఘ్నుఁ గొలుచుం జెపుమా॥

విషాద వితర్కములిందుఁ గన్పట్టును.

గీ॥ ప్రియుని విరహాగ్ని మేనెల్లఁ బెటిలిపడెడు
వలపుకాఁడెడనుండెఁ గాపాడవలయు
ననెడుకోరిక శశిముఖి కనుల నీటి
ధార వెచ్చని డెందముం దడుపుచుండె॥

ఇందు నాయకవిషయక చింతామోహములు గానవచ్చును,

గీ॥ పాముచుట్టను తలగడవలె నొనర్చి
పూవుఁబొదరింటఁ బన్నుండి పొల్చుకున్న

నదియూ మెడమీద విరివిగా నలదబడిన
గందపుందావి మెదలక కదలకుండె॥

ఇచట నాయికామణియొక్క నిద్రావిస్మృతులు గన్పట్టును.

కం॥ కలలోన బ్రియునిఁగాంచెడి
చెలులెంతటి ప్రశ్నములను జేసినవారో
చెలికాడు వాసిపోయిన
పొలతీ! నిద్దురయుఁబాసి పోయెనుబగతోన్॥ 135

ఇచట విబోధము నమర్షము దైన్యమును గానవచ్చుచున్నవి. ఈ రీతిగానే మిగిలినవికూడఁ జెలఁగుచుండును.

రసభావాభాసములు-

గీ॥ ఎచట ముగ్ధా! కృశోదరీ! యిందువదన!
శ్యామలాంగిరో! యన సంతసంబుగలిగె
నచట విధిలేక నానోట నక్కటకట!
పత్నిరో! భార్యరో! యని పలుకవలసె॥

ఇచట నాయకగతమై రసాభాసము దీపించును.

కం॥ చెలిమిం గలిమిం గలిగిన
చెలువుని ననురాగమూని చెల్లువరింపక్
గలనైనఁ దన్మనమునఁ
దలపోయని వానిపైనఁ దగులముదగునా?

ఈ పద్యమున విప్రలంభాభాసము ప్రకాశించును.

గీ॥ రతుల మెలకువ తెలియని రభనుచేత
సురత సమరంబునంజాల సొమ్మసిల్లి
వరశిరీష సుమంబులవలెను మిగుల
వాడి వడదాకిపోయె నీ బాలమేను॥

ఇచట నుపనాయకనిష్ఠమై యగాభాసము సెలంగును; లేదా యిందలి నాయకుఁ డధమనాయకుఁడని వ్యక్తమగును.

కం॥ అలవిరియెఱుంగని తమిచేఁ
బలుమారులు పదినసొగనుఁ బరికించుటనన్
గలలోఁ ద్రాపిన నీళుల
వలనన్ దప్పికశమించు వైఖరికాదే!

ఇచట నాభాసము నాయికాగతమై చెలంగును.

గీ॥ తనివిదీరంగ నాతన్వి వినివసనను
దర్శన ముహూర్త్తవర్ణ్ణన దరమెచేయ
నద్భుతము; నిధి; స్వర్గరాజ్యంబు; నమృత
పానముంబోలెఁ గ్రమముగాఁ గానవయ్యె॥

అనుచిత విభావాలంబన దీపితమై యగాభాసమిందుఁ గానవచ్చును.

కం॥ సురతావసాన సమయము
గురుతెఱుఁగని వధువు తనదు కోరికతీరన్
విరతింజెందని మదితోఁ
బరికించు నికేమివింత పొల్పడునంచున్॥

ఇందునాభాసము భయనిష్ఠమై వెలుంగును.

గీ॥ సకలలోకజనంబులు సంతసింప
సురత సుఖరస తృష్ణాపహారణములయి
వివిధకైతవ మార్గముల్ వెలయుచుండు
వారకాంతలఁ బ్రేమ పెంపారుఁగాత॥

ఈ పద్యమునందు నాభాసము బహునాయక నిష్ఠము. ఇందుఁ గాముకుఁడొకఁడు వెలకాంతను వీక్షించి భావమును వెలిఁబుచ్చుచున్నాడు.

కం॥ వక్రవచన రచనంబులు
వక్రాక్షిప్రేక్షణములు; వక్రస్మితముల్
వక్రాశయములు గలపతి
చక్రస్తని పుణ్యమునను జతపడుపుత్రా॥

పై పద్యము నందలి బహునాయక నిష్ఠమైన యాభాసమిందు భంగ్యంతరమునఁ గుట్టనిచే భుజంగ ప్రోత్సాహనార్థము వచింపఁబడెను.

గీ॥ వలపుచెలికాని తగులంపుఁ గలిమిసొంపు
మగువలను గానరాని యా తెగువపెంపు
వానకారున నడిరేలలోనఁ బొంగి
పారలు గోదావరీ నదీపూరమెలుఁగు॥

ఇచట నభిసారిక నిజానురాగమును నిస్సందేహముగఁ బ్రకటించు కారణమున నిదియుఁగూడ నాభాసమే.

గీ॥ గాఢ దృఢ మూలబంధన గ్రంథిఁబోలు
బాహు లెందనుఁ గౌగిలి పట్టు సడలె
వాని పేరెదఁ గ్రుచ్చిన బలుపుఁజనులు
సైతమందునసే బిగి సడలివచ్చె॥

ఇచటఁగూడ నా భాసము భయనిష్టముగనే చెలంగు చున్నది.

క॥ సుమబాణుప్ర; కపుర్పువిడె
మును; బిగ్గకవుంగిలింత ముద్దులు; సరిపో
లుసె వేయవపాలు కనుం
గొన సందడిఁబొంను చాటుకూటమ్ములకున్॥

ఇచట నాభాస మనుచిత రతిరూపకమై వెలుంగును.

గీ॥ పగముఁబిచ్చిన తోఁడిమల సళువువలన
వ్రాలి నవ్వెడి ప్రత్తిని బోలె మెఱసి
కమ్మకూతురు కేళి సుఖాన మున్గఁ
బ్రాణములఁ బాసెనని కాపు పారిపోయె॥

ఇది సంభోగాభాసమై ప్రకాశించును.

గీ॥ విస్మృతి పథఁబునంబడె విషయమెల్ల
విద్యయున్ ఖేదకలతమై విముఖమయ్యె
నా దుమది నధి దేవత నా వసించి
హరిణశాబక లోచన యరుగదయ్యె॥

గురుకులమునందు విద్యాభ్యాస మొనరించుచో గురు పుత్రికయొక్క రూప లావణ్యాతిశయములచే నాకర్షింపఁ

బడిన వాఁడుగాని లేదా యతిప్రతిషిద్ధ గమనమును స్మరించుచు దేశాంతరము పోవువాఁడుగాని యీ పద్యమును జదివె ననుకొనినచో నిట భావాభాసము గన్పట్టుచుండును. అటుగాక యీ పద్యమునే యొకానొక యువతీమణిఁ బరిణయమాడ నెంచిన భాగ్యశాలి ప్రియురాలి సౌందర్య ప్రశంస నొనరించుచున్నాఁడని తలంచినచో నిదియే భావధ్వనికి లక్ష్యమై ప్రకాశించును. ఇటులనే పై నుదాహరించిన పద్యములు వక్తృవై శిష్ట్యమునను ప్రసంగ ప్రసక్తిమూలమునను వేర్వేరు విశేషములకు లక్ష్యాంతరములుగఁగూడ సహృదయ శిరోమణులు గ్రహింపవచ్చును.

> గీ॥ చారు శారద పూర్ణిమా చంద్రవదన
> వీచికా స్మేరతారుణ్య విభ్రమాంగి
> యీ విశాలాక్షి చెలిమికే నేమిసేతు
> వనిత నన్ను వరింప నుపాయమేది॥

ఇచట ననౌచిత్య ప్రవర్తితమైన పరపత్నీ విషయక చింత గానవచ్చును. అందుచే నీ పద్యమునందుఁ గూడ భావాభాసమే వ్యక్తమగుచున్నది.

ఇంక భావశాంతి, భావోదయ భావసంధి, భావశబలతలను నాలుగు కలవు.

మున్నున్న భావముయొక్క నాశనమునే శాంతిగా వచింతురు. భావముయొక్క యుత్పత్తిలేక పుట్టుకనే

భావోదయమందురు. భావసంధియందు పరస్పర భావములకు విమర్దములేక రాపిడికలుగును. ఈ రెండింటికిని గల రాపిడి వలన నొకటిపోయి వేరొకటి పుట్టునని కొందరందురు. విరుద్ధములైన భావములొకచోట నిమిడియుండుటయే భావ సంధియని మఱికొందరు వచింతురు. అనేకభావము లొక చోటనే యొకదానివెంటనంటి వేరొకటిగా విరోధభావ ములు క్రమక్రమముగాఁ బుట్టుచు గిట్టుచున్నచో దానిని భావశబలతగాఁ జెప్పుదురు. ఇచట ముందుభావములకన్న వెనుకనున్నవానికి బలము వరుసమెయిఁ బెంపొందినచోఁ గాని బలముగల భావముల కూటమిఁగాని భావశబలత యని మఱికొందరు రచించిరి. ఈ నాలుగింటిలో భావ శాంతియందొకదాని నాశమును భావోదయమునం దొక దాని యుత్పత్తియు భావసంధియందు మాటిమాటికి రెం టియొక్క వినాశోత్పత్తులును భావశబలతయందుఁ బెక్కిం టికి వినాశోత్పత్తులును సంభవించునని చెప్పుదురు. ఇక వీనికి దృష్టాంతముల నిట వివరింతుము.

152 గీ॥ చిన్నిపెలయేటిరయమునఁ జిక్కికొనిన
పెద్దకఱ్ఱమాదిరిని వేశ్యాయ చోట్లఁ
దగులువడినను హృదయమా దైవవశత
నెవరిచేతనుగూడ గ్రహింపఁబడవు॥

ఈ పద్యమునందు నాయికామణికి మానసమునందుగల ధృతి మూలముట్టుగ నశించెను.

గీ॥ పేలుగీడులలో సగపాలుగొంట
పండబారిన వలపు దంపతులలోన
నున్నవారలె మరణంబు గన్నవారు
చన్నవారలె భూమిపై నున్నవారు,

ఇచట నాయకుని మనమునంగల హర్షమంతయు నశించెను.

గీ॥ తావిలేకున్న నీ స్వహస్తములచేత
నోరి! సుందరాకార! నీవొసగ నుద్వ
సిత నగర గృహదేవత గతినిదోప
నాపె యవమాలికం దాల్చు నక్కటకట!

ఈపద్యమునందలి నాయికావృత్తాంత మామె మానసమునందు వీసమేనియు రోసములేదని తెలియఁజేయును. ఇందసూయ శాంతిజెందె.

గీ॥ వెనుక వెనుకకు దిగజారు వినయములను
వెంటవెంటనె ననలెత్తు విన్నపముల
నమ్మరో! వివశంబులౌ సంగకముల
నవ్వులకునైనఁ గోపింప నాదరంబె.

ఇచట మానభంగము గానవచ్చును.

గీ॥ తోటివారలు దూరమై తొలగిచనిరి
పూచి వ్యాపించు పొదరిండ్లు పొలుపుదక్కి

నేనుమంగూడ ముదుసలి దానవైతిఁ
జెల్మి కూకటివేరుతోఁ జెల్లగిల్లె.

ఇందు నాయికకుఁగల మోహము లేక ప్రేమము సర్వము సన్నగిల్లెను.

153 గీ॥ గాలివానలచే నింటి గడ్డికప్పు
కూలిపోవఁగ నొంటిమై గొల్లుమంచు
గోలపెట్టెడి నిరుపేదరాలి మొఱను
మొఱపు మబ్బులువిని చాల కరుణనించు.

ఈపద్యమున నాయికకుఁ గల యావేగము శాంతించెను

గీ॥ బురదలోఁ జిక్కువడిన నాగలిని బైకి
లాగి దున్నుటఁ గలుగు వలసతి భర్త
నిదురజెందినఁ గూటమి నిగ్గులేని
కాపుకోడలు వానలఁ గడఁగిలిట్టు.

ఈపద్యమునందలి వృత్తాంతమువలన నాయికామణి మానసములోని యాత్సుక్య పూర్ణత సమగ్రముగ నశించెను. కాన భావశాంతి గానవచ్చును

భావోదయము:-

గీ॥ నేడునుంగూడ బాలపెన్నిధి విధానఁ
జెక్కిలి నమ్మక్కవన్నివు నొక్కియున్నఁ
ఒంటి గంటుల పులకల పంక్తిచేత
లీలఁబాలించు నీ దీనురాలిఁ గనుము.

ఇచట దైన్యము పుట్టువొందుచున్నది.

కం॥ మధుమాస మారుతాహత
మధుకర ఝుంకార భరిత మహాదాటవిలో
మధురాక్షరముల గోపిక
పధిక మనోమోహనముగఁ బాడుచు నుండెన్

ఇచట స్మృతి సంభవించును.

గీ॥ రథ్యదెస నయనోత్పల రాజిఁ బరపి
ద్వారనిహితంబులైన సువర్ణకలశ
యుగళిఁబోలెడి కుచపాళి సొగసుతోడఁ
దరుణి నీ వేగుదెంచెడి దారిగాంచు.

ఇందు గర్వము గానవచ్చును; లేదా యావేగము దీపించుననికూడఁ జెప్పినచో మేలుగనుండు. ఇట దూతిక నాయకునితోఁ బలుకుచున్నది.

160 గీ॥ చిత్రముగ తుంగకుచయుగోత్క్షిప్త వగుచు
ద్వారసీమనునిలచి యెవ్వాని నమిత
కలశ వినివేశితార్ఘ్య పంకజముబోలు
ముఖముచే నీవుగాంచె దోముద్దుకూన!

ఈపద్యమును దూతిక నాయికతో వచించును. ఇందు హర్షముగాని లేదా చపలతకాని పుట్టుపొందుచున్నదని చెప్ప నొప్పును.

కం॥ ఈయది యెప్పెన్నిధానం
బోయిమమారక ప్రతాప మెప్పుదు చూపక

ఈయెడమనంబు నిల్పనఁ
బాయంగఁ దరంబుగాదు బ్రహ్మకునైనన్

ఇచట దూతిక నాయకునకు నౌత్సుక్య ముదయింపఁ జేయుచున్నది.

౬౩. గీ॥ ఇతరజనులకు దొరకునే యెన్నఁడైన
నారి! నిజఘనారోహణంపు సుఖము
అనల వరుణుల మాహాత్మ్యమునను జేసి
కనకసూత్రమా సౌఖ్యము ననుభవించు

ఇందు నాయకుని మనములోని చింతకాని, దైన్యము గాని వ్యక్తమగును.

గీ॥ పుణ్యగోదావరీ తీరమునకువచ్చి
నిక్కము వచింతుఁ జావఁగా నిలిచియుంటి
నిట్టితరిఁగూడ నాపొదరింటి యందు
వ్రాలుచుండెను నాచూపు బాలకుండ॥

ఇందు మరణాసన్నురాలై యున్న వన్నెలాడికిఁ బూర్వపరిచిత స్థల సందర్శనమునఁ బూర్వానుభవము లన్నియు స్మృతికి వచ్చుచున్నవి.

గీ॥ పిండిపడి వెల్లనైన యాపిల్లవంక
పాలసంద్రంబు నందుండి బయలువడిన

లక్ష్మినిం గాంచిన ట్లభిలాషతోడఁ
బధికు లనిమిషులైచూచు వారలైరి||

ఇచట బాలామణి సౌందర్యము పధికులకు హర్షోదయ
మాయెను.

గీ|| పిండిబుక్కాను పిడికిలినిండఁ బట్టి
వలపుకాఁ డిటవచ్చిన వానిపైనఁ
జల్లెదనటంచుఁ గులుకుచు నల్లసిల్లు
కలికికరముల గంధోదకంబు గలిగె.

ఇట వలపుకాని నేనిటు సేతునని సంతనే బాలికకు
మోహోదయ మాయెను.

గీ|| నోరనూదిన దీపము; బీరువోక
బిగ్గపట్టిన యూపిరి; బెదరుచూడులు
తిట్టులొట్టులఁ గాచిన తేనెమోవి
యిట్టి చాటుమాటమి హాయి నెన్నఁగలమె?

ఈపద్యమున చోరరతమువలనఁ గాముకులకుఁ గలుగు
నౌత్సుక్యము గానవచ్చును.

భావసంధి:-

గీ|| విరహకాలంబు దుర్భరవిషము వోలు
సంగమంబది యమృతరసంబు వోలుఁ
దలఁప నీ రెంటిసమభాగములుగఁగలపి
విధివినిర్మించెఁ గాబోలుఁ బ్రియుని దలఁప.

ఇచట శోకహర్షములు రెండును గలసి యున్నవి.

౧౬౮ కం॥ ఖేదముజనింపఁ జేసిన
మోదంబుదయింపఁ జేయు పురుషుఁడె ప్రియుఁడౌ
నాదిని నఖరేఖలచే
నూదినఁ గుచయుగళిఁ బులకలొదవుంగాదే॥

ఈపద్యమున ఖేద మోదములు రెండును గూడి యున్నవి.

గీ॥ వలపుఁ జెలికాని పేరైనఁ బలుకవన్న
మానెఁగానిమ్ము; చెప్పు మిద్దాని కతము
రవి కరస్పృష్టవికచ నీరజములీల
బాలికామణి! నీ మొగంబేల విచ్చె॥

ఇచట వ్రీడాహర్షములసంధి కాననగును.

గీ॥ తోడిచేడెలతోడ మాటాడునపుడు
నవ్యపరితోష వికసితనయనములను
సాత్త్విక స్వేదరోమాంచ సంచయముల
నభిమతార్థము సిద్ధించునట్లు తెల్పె.

స్వేదరోమాంచములు రెండు నిందు సొంపారును.

గీ॥ కష్టములఁబడి గురువుల కట్టడలను
గడచి ప్రియుని సరసకు రాఁగంబుతోడ
నక్కటక్కట! కడువడి నరుగుదేరఁ
గుచములుంగూడ నామెకు గురువులయ్యె॥

శ్రమ మాలస్యము లీరెండు నిందుఁ బెంపొందును.

గీ॥ అర్థమేలేక బాహువా! యదర జేల?
వామలోచనమా! స్థిరపడుము నీవు
వచ్చినను దప్పొనర్చిన వానినిప్పు
డెటులఁ గౌగిటఁజేర్తు; వీవెటులఁగాంతు

ఇచట గర్వామర్షములు రెంటికూటమి కానవచ్చును.

గీ॥ వలపుఁ జెలికాని కౌగిలికలిమి కొఱకు
నెగిరిపడు బాహులతికల నీసడించి,
వెక్కి వెక్కేడ్చుటం జాలఁగ్రుక్కియున్న
మొగమునంగిన్క బూనంగఁదగదుసుమ్మ

హర్షామర్షము లిందు గూడియున్నవి.

గీ॥ సూర్యునకు మ్రొక్కు మిషను నోసొగసుకాడ!
యెవ్వరికిఁ బ్రణామాంజలి నిడుచునుంటి
హాసము కటాక్షములతోడ వలరెనేసి
దేవతా నమస్కారముల్ గావుసుమ్మ.

ఈపద్యము హాసకటాక్షములతో నిండియున్నది.

గీ॥ ఈ విదే వత్తువంచుఁ దా నెదురుచూడఁ
దొలిసగము రేయి నిమిషమై కడచిపోయె
మిగిలిన సగము వనటల మిగులఁ బొగులు
కతన వర్షంబుకైవడిఁ గడపవలసె

175

ఇచట హర్షదైన్యములు గానఁబడును.

గీ॥ కినుక నరికట్టు పెదవుల కొనలవెడలు
సగము కొరవడు నుడులనో సన్నుతాంగి!
పేరెలుంగున గేయము విధముదోప
నెవ్వనిఁదలంచి వాపోయెదీవు చెపుమ

శోకకోపము లీపద్యమునందుఁ దులఁదూగుచున్నవి.

గీ॥ చాటసారి కేయెల్లవు బండుకొనఁగ
వట్టిగడ్డిని బ్రిక్కగాఁ బఱచియిచ్చి
కాపుచిన్నది మరల నాగడ్డినెల్ల
వేగినంతట నేడ్చుచుఁ బోగుచేసె.

ఈపద్యమునందు స్మృతివిషాదములు గూడియున్నవి.

కం॥ సమయోచితము లెఱుంగక
భ్రమపడి పీడింపఁ దాల్మి వశమే నిలుపన్
సుమశర కేళి రమింపఁగఁ
గొమరుఁడు విలపింపఁ దల్లి కొట్టకయున్నే

ఇచట నౌత్సుక్య కోపములు గుమిగూడి వెలుంగుచున్నవి.

భావశబలత.-

గీ॥ చాలవనటులఁ జెప్పును; సౌఖ్యమిచ్చు;
వలపున స్మరించు; రతికేళి బలమునించు

సరతి రతిబాంధవంబులై యలరునట్టి
మదన శరములకేను మెుగ్గెదను భక్తి

ఇచట వసట, సుఖము, వలపు, బలములను నవి విరోధభావములైనను గలసి మెలసి కానవచ్చుటచే భావశబలత కలదు.

గీ॥ పూవులైనను వాడిమిఁ బోలుపుమిగిలి;
తాకమున్నను గడువెచ్చఁ దనముమీఱి;
ఓంచుచున్నను వలపుల నుంచి మించి;
కాముశరములు బహురూపకలన వెలయు (౬౧)

పైపద్యమునందలి భావమునే యనఁగా మదనశరముల వర్ణనమునే కవి భంగ్యంతరముగా నిచట రచించెను. అందుచే నిందు మెత్తన, వాడిమి, వెచ్చన, మోహములను భావములు కూడిమాడి చరించును. కావున నీపద్యమునందుఁ గూడ భావశబలతయే వ్యక్తమగుచున్నది.

గీ॥ ఈర్ష్యబుట్టించు; మదనాగ్ని వృద్ధిచేయు;
విప్రియంబుల సాధించి వెడలనడచు;
విరహకాలంబునను మృతి దొరకనీదు;
వానిగుణములు బహువికల్పములు గావె!

ఈపద్యమును జెఱకు విలుకాని కరకుటమ్ముల వినుతిగాఁగాని లేనిచో వలపు చెలికాని మేలిగొనముల పొగడ్తగాఁగాని చదువరులు భావింపవచ్చును. దీని నేరీతిగా నెంచినను మనకిచట ఈర్ష్య యౌత్సుక్యము, వితర్కము, విబోధము,

చింత విషాదము మొదలైన విరోధభావములు మొలకలెత్తు చుండుటచే నిచటఁగూడ భావశబలతయే

గీ॥ గగురుపాటు నిట్టూరుపు కంపములను
బనరి వర్తించు వారలే ధన్యురాండ్రు
మేలుకానిని గన్గొని మేనుగూడ
మఱచు మావంటివారల మాటలేల?

ఇచట సంభోగ సంభవమై భావశబలత ప్రకాశించు చున్నది.

కం॥ పులకలబారుట; నిద్దుర
వెలయమి; నిట్టూర్పు మివుల వెచ్చనగుటయుఁ;
గలవిడిపాటును కెనయగు
పొలయలుకం బూని ఫలము పొందెడిదేమీ?

ఇందు విప్రలంభాత్మకమై మహిళామణీ మండనంబైన మానకోప సంభవమై భావశబలత భాసించుచున్నది.

సీ॥ అనరాని వినరాని యవకార్యమదియేడ? పావనంపు సుధాంశువంశ మేడ?
కమనీయరూప రేఖా కాంతివిభ్రమఖని నింక పై నేను గాంచుటెపుడొ;
ఘనకల్మషంబులఁ గడముట్టఁజేయ గా జన్మించుటనివిందు చాలఁ గుతులఁ;
గినుకనూనినవేళలనుగూడఁ జెలువంపుమిఱువుమాటలుఁగట్టుముద్దు మొగము

గీ॥ సకలుషులు కృతబుద్ధు లేమందురొక్కొ?
కటకటా! కలనేనియుఁ గాంచలేను;
చిత్తమా! నీవు స్వస్థతఁ జెందుమింకఁ!
దరుణుఁడే ధన్యుఁడా మె ముద్దాడఁగలఁడొ?

ఈపద్యమునందు నాయకుని మానస ముత్కంఠా వివశమైనప్పుడు కలుగు విరోధభావములును వానివానికిఁ

గలుగు నొరపిడి రాపిడులును స్ఫుటముగ—స్ఫుటతమముగఁ జిత్రింపఁబడినవి. సీసమునందలి మొదటి పాదమునందుఁ 'దానొనరించు పని మంచిదియా చెడ్డదియా' యను వివేక రూపమైన వితర్కమును; వెంటనే రెండవపాదమున 'నాయికామణియొక్క రూపరేఖా లావణ్య తారుణ్యాదుల నేనికఁ గాంచు టెప్పుడో' యనుటవలన నౌత్సుక్యాతిశయమును జనించెను. ఇచట మొదటి రెండుపాదములలోని భావము లొండొంటి కంటనివగుటచే వితర్క మౌత్సుక్య విశేషమున మునిఁగిపోవగా నాయకుని హృదయమున నౌత్సుక్యము లేక నాయికను గాంచు కోరికమాత్రమే మిగిలెను. ఇక మూడవపాదమునఁ 'దానేకారణమున రాజు గాఁబుట్టువొందినదియుఁ దాను రాజైనందులకుఁ జేయవలసిన విధులఁగురించి శ్రుతులేమి నియమించినవియుఁ' దలఁచినంతనే మతి జనించి మున్ను మనమున నెలకొన్న యుత్కంఠ రూపుమాసెను. అంత మతిమాత్రమే నిలచెను. మఱి నాల్గవపాదమున 'నలుకచేఁ గలతచెందినను సొంపులు మించుచున్న ముద్దరాలి నగుమొగము' జ్ఞాపకమునకు వచ్చినంతనే నాయకునకు స్మృతి సంభవించెను. ఇంతతో నాతని మతి నశించి స్మృతిమాత్రమే నాటుకొనెను. తరువాత గీతపద్యమునంగల మొదటిపాదమున 'నన్నుగురించి బుద్ధిమంతు లేమందురోకదా' యను వివేచన ముదయించినంత వెనుకనున్న ప్రియురాలి స్మృతి సమూలముగ పెల్లగిల్లి శంకమాత్రమే పాతుకొనెను. పిదప

గీతములోని రెండవపాదమున ముందువెనుకల నొకపరి గనుఁగొనినంతనే 'యక్కటా! నేనిక నామెను గలలో నైనఁ గానలేన'ను భావము గుదురుకొనెను. అప్పుడు శంక శ్రీణించి హృదయమునందు దైన్యము కాపుర మొనరించెను. అప్పైని గీతమునందలి మూడవపాదమునందుఁ 'దన చిత్తమునందలి తత్తరపాటు నడంచుకొనుటకై మౌనమును చిక్కపట్టుకొనును' కాన దైన్యమంతయుఁ జెల్లిపోయి ధృతికలిగి మనసు దిటముసెందెను. ఇంక పద్యములోని తుదిపాదమునందు మున్ను మనమును జెట్టబట్టిన ధృతి గూడిపింజవలె నెగిరిపోయి 'యేపడుచువాడామె కెంగేలు రాకు పెదవిఁ దమితీరఁ జవిగొని ధన్యుఁడగునో' యను విచారము గాలుసుమ్మెను; అంతటితో నాతని నెమ్మనమున చింత ముమ్మరంబాయెను. ఇటుల నొకదాని వెనుక నొకటిగాఁ బుట్టిన భావమును బుట్టనున్న భావము గిట్టఁ జేయుచుండుటచే నీపద్యమున నొండొంటి కంటువడని భావములు నీరు నిప్పలవలె కలసిమెలసి చరించుచున్నవి. కాన దీనిని భావశబలతగా వచింతురు.

ఇచట విపులముగ వివరించిన దృష్టాంతపద్యములఁ దిలకించినచో రసమువలననే కావ్యము జీవించుచున్నదని సహృదయులకుఁ గన్పట్టును. అనేక వస్తువుల కూటమి వలనఁ గలిగిన పానకమును గ్రోలురీతిగా విభావాదుల కలయికవలనఁ బుట్టిన రసమునుగూడ నొకటిగానే మనము

ప్రాధాన్యముగఁ జదివి గొనుచున్నను గొన్నిచోట్ల విశేషాంశము లైన వెలుంగు భావము మొదలైనవి పొంగి పొరుటుచే చమత్కారాతిశయ మున్నగా మనసు నిట్టిదట్టిదని చెప్పలేని సొంపులముంపు పద్యములుగూడ పెక్కులు గాన వచ్చుచున్నవి. అట్టిచో భావధ్వని వెలుంగుననందురు. ఎటుల విభావాభాసమువలన రత్యాద్యాభాసములు గలుగునో యటుల విభావాదిభావాభాసమువలనఁ జర్వణాభాసము సంభవించును; ఇదియే రసాభాసము. ఇటులనే భావాభాసముగూడఁ జెలంగునందురు. రసధ్వనిలో నీ రసభావాభాసధ్వని మొదలైనవి చిందుచుండును. ఆ స్వాదమునందు ప్రధానమైన ప్రయోజకాంశము విభజింపఁబడి వేరుగా నిరూపింపఁబడును. ఏరీతిన పానకరసమునకును ద్రాక్షారసమునకును భేదము విలసిల్లుచున్నను రసముపేరు నిలంగుచున్నదో యారీతినే ఇంద్రియరహితములైన లతాతరునదీశైలాదులకును నింద్రియసహితములైన పశ్వాదులకును గావ్యములలోఁ గామాది వ్యవహారము వర్తించుచున్నది. అచటనే రసభావాభాసములు చెలువారును. ఈ ప్రకారము కావ్యముల రసము ప్రధానమై ప్రకాశించుచున్నను భావశాంత్యాదులకుఁగూడ నొకానొకచో నంగిత్వములేక ముఖ్యతే రాజు వెంటనంటి పెడ్లికివెడలు భృత్యులఁబోలెనే చేకూరును. ఇంతకు మున్న సంలక్ష్యక్రమవ్యంగ్యభేదములుగా నుదహరింపబడిన రసాదిధ్వనుల లక్ష్యములలోనే యలక్ష్యక్రమ వ్యంగ్యవిభేదములైన ప్రబంధ వాక్య పద పదైకదేశ రచనా

వర్ణనీయమైన దానిదృష్టములకుఁ గూడ లక్ష్యములు గానవచ్చును.
ఇచట నా సిని దిఙ్మాత్ర మిట బ్రదర్శింతుము.

184 కం॥ రతికేళి హ్యాతాంబరగాఁ
జతినేత్రద్వయము పాణిపల్లవసంఛ్ఛా।
దితమై. సతిచుంబితమౌ
తృతీయనయనము సదా జయించెడు గాతన్॥

ఇచటఁ బురాణదంపతులై పొలుపారు పార్వతీ
పరమేశ్వరులు పరమానంద పారావారవీచికల నోలలాడుచు
గృహస్థాశ్రమధర్మ మర్మములఁ బరిపాలించుచున్నారు. అట్టి
తఱి ప్రేమాతిరేకమునఁ బ్రియురాలి వివృతవిహార విలాస
ముల వీక్షింపనెంచి సర్వజ్ఞుఁడు నయనారవింద ద్వయమును
వరివికసితము గావించెను. అంత నా వేగభరమును మంద
గింపనెంచి సర్వమంగళ తన పాణిపల్లవముల నేత్రద్వితయ
మును గప్పెను. హర్షపరవశుండైన శంకరుండంతఁ దన
తృతీయనేత్రమును గించిదంకురితముగా నొనరించెను.
జ్యోత్స్నాక్రాంతవివశయై వెలుఁగు భవాని భర్తయొక్క తృతీ
యనయనమునకు చుంబనము ప్రసాదించి చూపు నరి
కట్టెను. అట్టి నేత్రము జయించుగాతమని మహాకవి
వచించెను. ఇచట జయించు ననుటవలన సర్వోత్కృష్టమై
వెలుఁగునని భావము. అంతియేకాని శోభించునని పలుక
వలసినపనిము. సమానములైన నయనముల యుగళీకరణ
మము సమకూరెను. ఇంక దీనికి లోకోత్తర వ్యాపార

జానాయకప్రాక సిఖానము సంభవించెను. అందుచేత నత్కృష్ట
మను వ్యంగ్యము 'జయించు' నను పదమువలననే ప్రకా
శించుచున్నది. ఇంక పద మువసర్గ నిపాత విశేషణా
దులఁ దెలుపగును. వీనిలోఁ గొన్నిటినిట సూచింతుము.

గీ॥ చలితరంభోరు శిఖిపింఛ లులితకేశ
జనని మీలిత నయనవై యలసిసొలసి
నుంతపురుషాయితమున విశ్రాంతిఁగొంటి
పురుషులసుఖంబు లిత్తరి బోధపడెనె?

ఇచట 'నుంత' 'యిత్తరి' యనువానిలో విశేషము
గానవచ్చును.

గీ॥ ఎటుల పథికుఁడు ప్రేపల నెడము చేసి
చాలకను లెత్తి నీళులఁ గ్రోలుచుండె
నటు ప్రపాబాలికయు సన్నమైన ధార
నింకనుంగడు సన్నమై యుంకజేసె

ఈ పద్యమున 'నెటుల' 'నటు' ననువానిలో వ్యంగ్య
ముగలదు.

గీ॥ అందియల చప్పుడొక్కింత యాగినంత
వినఁగవచ్చెను మొలనూలివింత మ్రోత
వలపుఁజెలికాఁడు రతికేళి నలసిపోవఁ
గామినీమణి మగసేతఁ గవయుఁజొచ్చె

ఇందు 'నొక్కింత' 'వింత' యను పదముల విశేష
ప్రతీతికలదు.

195 గీ॥ గజకలభకుంభయుగళసంకాశ భాను
గౌన్నత్యములు పీనంబులై యొప్పుచున్న
పాదుపాళిండ్లచే నూపిరాడకున్నఁ
బాపమీయమ వడి నడువంగఁగలదె?

ఈపద్యమునఁ 'బాదు' 'పాపము' లనునవి వ్యంగ్యసూచకములు.

కం॥ అంటుకొనెఁ జంటఁగో
రింటనుమం బని హసించు ప్రియసఖిమాటల్
వింటు ననుఁగొటిపోటుల
వెంటనె కడుముద్దరాలు వెడజల్లుఁజుమీ

'వింటు' 'ననుఁగొటిపోటులు' 'కడుముద్దరా' లనునవి యీ పద్యమునకు వన్నెఁ దెచ్చుచున్నవి.

కం॥ ఘనజఘనస్తనముఁడల
వినీలకచభారములను వెలిఁగెడిరమణీ
జనముల రసకాచంద్రుల
కనపదవిహ్వలతఁ గూడఁ గమనీయమగున్

ఈ పద్యమునందలి 'వినీలకచ' మనుదానిలో 'వి' యనునది, 'కనపద విహ్వలతఁగూడ' యనుదానిలోఁ 'కన' 'కూడ' యనునవి వ్యంగ్యార్థ విశేషముల వెదఁజల్లును.

గీ॥ నిదురజడలిక నుడివడు బెదరుఁగులుకు
వెనుకమరలెడు నరగంటివింతతలుకు

చూపుఁజిలుకుచుఁ బ్రియురాలు చూచెనేని
కాముఁడైనను మదినిల్వఁగాఁగలండె?

ఈ పద్యమున 'వింత' 'ఐనను' ననునవి చదువరుల మదిఁ గరంచును.

గీ॥ బాలకా! నీవు రమణిని బాసిచనఁగ
నింటికిటికీలతలుపులనెల్ల దెరచి
బెదరుచూపుల నలుదెసవిసరియామె
పంజరములోని చిలుకయై పరితపించె        శ్రీపతి

ఇచట 'బాలకా' యనుదానిలోని 'క' యనువర్ణమును 'విసరి' యను పదమును 'పంజరములోని చిలుకయై పరితపించె' ననువాక్యమును విశేషార్థములను వెలిఁబుచ్చుచున్నవి.

కం॥ నీవలపామెం జెందెను
నీవైరమునన్నుఁ జేరె నిస్నేహమందున్
నావిధివ్రాతయ బాలక!
వేవికృతులఁ జెంది ప్రేమ వెలయున్ గాదే?

ఇందు 'బాలక' యనుదానిలోని 'క' యనువర్ణ మను కంపార్థకమై చెలంగును. నాల్గవపాదము వాక్యగత వ్యంగ్యమును బోధించును.

గీ॥ సరససహకార పుష్పమంజరినిఁ గోటఁ
జిదిమి చెరనుంచినటు తనచెంపజేరివి

పావుపుఁడు వోవుచున్నట్టి భ్రమర యువకుఁ
డల్లదే! బాలకా! దాని ననుసరించు

ఈ పద్యమున 'నల్లదే' 'బాలకా' యనునవి నాయకుని వివేకశూన్యతను స్వలాభపరాయణత్వమును బయలుపఱచును.

గీ॥ సఖిగృహీతాధరధుతశీర్ష ప్రఘూర్ణ
మానశిలాలకా కులమహితముగుట
రమ్యపరిమళేతరళిత భ్రమరపంక్తిఁ
జలితకమలంపువదనంబు దలచువాడ

గీ॥ సరససహకార కుసుమకేసరపరాగ
విసరపరిమళమూర్ఛల దెసలుగ్రాల
మధుర మధువిధుర ముదితమధుపతతులఁ
గనఁగ నెవనికిఁ బహాతహ గలుగకుండు

వీనిలో రచనామూలకమై వ్యంగ్యము గానవచ్చును.

సీ॥ రాముఁడాతండు ధరాతలమందెల్ల
నెనలేనివిక్రమ గుణగణములఁ
బేరుపెంపులఁగాంచి వెలుఁగొందుచున్నాఁడు
వసుధ మాభాగ్య విపర్యయమున
నాతనినీవు దేవాదిదేవునిగాఁగ
నించుకేనియు మది నెంచవుఁటె;
కరకుటమ్మొకటి తాకంగఁ గంటులువడ్డ
తాటిచెట్టుల మేటి తూటులఁదుఁ
గీ॥ గడువడిఁగ జొచ్చి వెడ వెడ వెడలివచ్చి
రివ్వురివ్వను మ్రోత నెగ్గెత్తి గాలి

వందివోలెను, స, రి, గ, మ, ప, ధ, ని, స లను
పాడునాతనియశము సొంపారవినుము

ఇంతకుమున్ను రచించిన పద్యముల నొకటియో
లేక రెండువిధములైన విశేషములో కానవచ్చును. ఇంక
నీపద్యమునం దనేక ప్రకారముల వ్యంగ్యవిశేషము ప్రకా
శించుచున్నది. అందుచే దీనిని బహువిధ వ్యంగ్యమని
వచింతురు. ఇచట 'రాముడాతండ' నుదానిలోఁగల 'యాతఁ
డను' దానికి ఖరదూషణాదుల నెందరినో కూల్చినవాఁడ
నియు' 'ధరాతలమందెల్ల' ననుటచే నెచటనో యొక్క
మారుమూలఁ గా దన్నిదిక్కుల నన్నిప్రదేశముల యందనియు
'విక్రమగుణగణముల ననుటవలన విక్రమమునకు సంబంధిం
చిన సంధివిగ్రహాదులైన ధైర్యాదిగుణముల సముదాయ
ముచేతనే కాని దోషములవలనఁ గాదనియు రాముఁడు సాటి
లేని పేరుప్రఖ్యాతుల గడించి వెలుంగుచున్నాడుసుమా'
యని భావము. అట్టి దేవాదిదేవుని ననఁగా మనకు సహజ
శత్రువులై మెలంగు దేవతలు మొదలైన వారికెల్లరకు
మొదటిదైవమనియు నతని గుణగణముల నీవిసుమంతయు
లెక్కింపకుంటివని తాత్పర్యము. దీనికిఁ గారణమేమని తలం
చినచో నది 'మాభాగ్యవిపర్యయము' వలననే సంభవించె
నని సమాధానము వచ్చుచున్నది. ఇచట 'భాగ్యవిపర్యయ
మ' నఁగా దౌర్భాగ్యము వలననియు దౌర్భాగ్యమే కాని
భాగ్యము లేకపోవుటచేతఁ గాదనియు నిట చెడుభాగ్య
మనుటచే మంచి ఫలము సమకూరదనియే కాని చెడుఫలి

తము సంభవించునని కాదనియు నింక నెవరిదీ భాగ్యవిప
ర్యయమనినచో నది నీదిగాదు నాదిమాత్రమేగాదు మఱి
'మా' యనుటచే నందరియొక్క దౌర్భాగ్యమనియుఁ దాత్ప
ర్యము. ఆ రాముని పేరుపెంపులు వెలుఁగుచున్నవని
తెలుపుట కిటనొక దృష్టాంతము నిచ్చుచున్నాఁడు. వాయు
దేవుఁడు వంశవైఖరి రాముని విక్రమగుణముల స,రి,గ,మ
ప.ధ,ని, స లను బాడుచున్నాఁడనుటవలన 'షడ్జాది సప్తస్వర
ముల రాముని యశోగీతముల నాలాప మొనరించు
చున్నాఁడని తేటపడును. ఏరీతిగా ననినచో 'నేక బాణాహతి
మాత్రముననే శ్రేణీభూతమైన విశాలతాల వివరోద్గీర్ణములై
వెలివడు సప్తస్వరముల మూలముననే' వాయుభగ
వానుఁడు దేవాధిదేవుఁడైన రాముని గీర్తించుచున్నాఁడని
బోధపడుచున్నది. ఇచట వాలిని జంపఁగలనని రాముఁడు
సుగ్రీవుని నమ్మించుటకు నిదర్శనముగ తన పరాక్రమప్రద
ర్శన మొనరించిన సప్తతాళచ్ఛేద వృత్తాంతము దృష్టాంత
ముగ స్వీకరింపఁబడెను. అందుచే నీపద్యమున 'నా' 'ధరా
తలమందెల్ల' 'విక్రమగుణగణముల' 'మా భాగ్యవిపర్యయమున'
'దేవాదిదేవుని' 'నెంచు కేశియు' మొదలైన వానివలనఁగలుగు
సర్వనామ బహువచన ప్రాతిపదికాదుల వ్యంగ్యము స్పష్ట
మగుట నిది బహువ్యంగ్యమై చెలంగును.

గీ॥ తరుణవయసున భ్రూరేఖ సరసకళల
మదనచాప సమ్ముఖమునఁ జదివెఁ గాన

చకిత బాలకురంగ చంచలతరాక్షి
సకల లలనల మాళి వాసంబుసల్పు.

ఈపద్యమున వాచకవ్యంగ్యము గానవచ్చును. ఇచటఁ 'ప్రథమవయసున' ననుటవలన నవత్వమును 'మదనచాప సమ్ముఖమున' ననుచో సమ్ముఖమున ననుదానిచే నెల్లపుడు నెదుటనుండి చెలువొందుట వలనఁ బ్రౌఢత్వము చేకూరెననియు, నందువలననే 'సకల లలనల మౌళి వాసంబుసల్పు' ననుటకు నీనాయికామణి తగియున్నది. కాన నీమెకుఁ గల సౌందర్యాతిశయము సహృదయులు స్వయముగ భావించుకొనవలయునే కాని వర్ణింపఁ దరముగాదని సూచింపఁబడెను.

ఈప్రకారముగా నిచట నుదహరింపఁ బడని ధ్వనిభేదములకు దృష్టాంతరములఁ జదువరులు స్వయముగ నూహింపఁ గలరు. ఇటుల మున్ను వివరించినవియు రసాదులును గలిసినచో నేబదియొక్క భేదములై విలసిల్లును. వీనినే శుద్ధధ్వనిభేదములని పేర్కొందురు. ఇంక నివియే మూడువిధములయిన సంకరభేదములను నొకప్రకారమైన సంసృష్టి ప్రభేదమును గలిసినచోఁ బదివేల నాలుగువందల నాలుగు విభేదములై చెలంగును. శుద్ధభేదములఁగూడఁ గలపినచో మొత్తము పదివేల నాలుగువందల యేబదియైదు విభేదములై వెలుగొందునని కావ్యప్రకాశకారుని మతము. అర్వాచీనులు కొందరనగా సాహిత్యదర్పణకారుఁడు మొదలైనవారు సంకర సంసృష్టి భేదముల సంఖ్యను తగ్గించిరి. మమ్మటాచార్యుఁడు

నుడివినటుల ననుగ్రాహ్యానుగ్రాహక భేదముల వేఱ్వేఱుగా నంగీకరింపక వ్యక్తిభేదమును మాత్రమే స్వీకరించి విజాతీయ సజాతీయములని సంకరము రెండుతెఱంగులు నిశ్చయించిరి. అందుచే వారిమతమున సంకర సంసృష్టి ధ్వనిభేదము లైదు వేల మూడువందల నాలుగుమాత్రమే సంభవించును. ఈసంఖ్యకు శుద్ధధ్వనిభేదములఁ జేర్చినచో నైదువేలమూడు వందల యేబదియైదు మొత్తము ధ్వనిప్రభేదములు గాను వచ్చును. ఈసంఖ్య యెట్లనఁగా; 51 భేదములకును 51 భేదములు కలుగును. కాన వీని రెంటిని గుణించినచో 51×51=2601 భేదములు వచ్చును. ఇంక వీనిని సంసృష్ట్యాది నాలుగుభేదములచే హెచ్చించినచో 2601×4=10404 నిభేదములు వెలువడును. ఈసంఖ్యకు 51 శుద్ధధ్వని భేదములు గలిపినచో 10404+51=10455 విభేదములని మమ్మటాచార్యుని మతము. ఇతరులమతమున నొకటితరువాత నొకటిగా నొక్కొక భేదము సన్నగిలుచుండును. సూక్ష్మముగ వారి గుణకార మెటులనినచో 51 ను 2 చే భాగించినచో 26 వచ్చును. ఇంక 51 ధ్వనిభేదముల 26 చే గుణించినచో 51×26=1326 ధ్వని సంసృష్టిప్రభేదములు సమకూరును. దీనిని 3 చేత హెచ్చించినచో 1326×3=3978 ధ్వని సంకర ప్రభేదములు సంభవించును. ఇంక ధ్వని సంసృష్టి సంకర శుద్ధభేదముల నన్నిటిగూర్చినచో 1326+3978+51=5355 ధ్వనిభేదములు గలుగును.

ఈ రెండుమతములలో ప్రకాశకారుని మతమే శ్రేష్ఠతరమని ప్రశంసించిరి. ఇచట సంశయమునను సంగాంగిభావమునను నేకవ్యంజకానుప్రవేశమునను సంకరము మూఁడురీతులఁ జెలంగును. ఈ మూఁడుప్రకారములు గాక కలుగు సంయోగమునే సంసృష్టిగా వచింతురు. ఇక పుంద్రక కాంతా ధరా దీక్షు రసాదులందు వోలెనే ధ్వని విషయమునఁగూడ హృదయాహ్లాదాతిశయా నతిశయములు సంభవించుచుండునని కొనియాడుదురు. కావున చమత్కారాతిశయమునే ప్రమాణసూత్రముగా భావించి సహృదయ శిరోమణులు ధ్వని ప్రాశస్త్యమును గణుతించి తత్తద్విభేద విభాగమును నిర్ణయింపవలయును. ఇచట సంకర సంసృష్టి భేదములకొకటి రెండులక్ష్యముల నొసంగి యుత్తమమైన ధ్వని కావ్యవిమర్శనమును విరమించి మధ్యమమైన గుణీభూత వ్యంగ్యమునందలి ప్రభేదములఁ బ్రదర్శింతుము.

గీ॥ ఉత్సవంబున కతిథిరైయుంట నీదు
భార్యచే నెన్నొమాటలఁ బడి వరాకి
యింటివెనుక పంచాదిలో నేడ్చుచుండె
దేవరా! యామెనోదార్పఁ బోవుమయ్య

ఇచట 'దేవరా' యను సంబోధనమువలన 'నోయుందగాడా!' యనికాని ఓబావా! యనికాని యర్థముసెప్పనొప్పును. రెండవ యర్థమునందు బావకును మరదలకును నొకొక్కరిపై నెంతయోకొంత మక్కువ వీలుగానున్న వేళల

నేచాటుమాటుగనో ప్రచురమగుచుండెననియు వారిచేరిక లోక
రిరిద్ద కెవరికో కొంచెము ప్రకటనమాయెననియు సరసమతు
లూహింపవలయు. ఒకానొకపండుగ పేరట నామెను తనయింటికి
పేరంటముపిలచి మగని గుట్టు నెఱింగినభార్య తరిదొరకెనని
తోటికోడలను సూదులవంటి సూటిపోటిమాటల నెకసక్క
మాడి గేలిసెను. ఇదియంతయు గురుతించిన పొరుగుటిల్లాలు
మరదలి పైకరుణనించి యామెకు జరిగినపరిభవము ను బావకు
నెఱుకపఱచెను. ఇచట 'వరాకి' యనుటవలన పాపమామె
దీనురాలనియు 'నందుచేఁ దప్పక దయదలచవలసిన' దనియు
తాత్పర్యము. ఆమె యెచటనున్నదో యనినచో 'నింటి
వెనుక పంచాదిలో నేడ్చుచుండె' ననియు కాన నంతయు
వెనుదీయక 'యామె నోదార్పఁబోవుమయ్యా' యనియుఁ
బొరుగుటిల్లాలు బావను బ్రతిమాలుచుండెను. ఈ పద్య
మున 'నోదార్చుట' యుపభోగలక్షణమై యర్థాంతరమున
సంక్రమించుచున్నదా? లేక యనురణనన్యాయమున నుప
భోగమునకు వ్యంజకమగుచున్నదా? యను సంశయము
గలుగును. మొదటిపక్షమున శుద్ధసాధ్యవసాన లక్షణయు
రెండవపక్షమున పదప్రకాశ్యమైన యర్థశక్తి మూలధ్వనియుఁ
జెలంగును. ఈ తీరున నిది యవివక్షితవాచ్యమా? కాక
వివక్షితాన్యపరవాచ్యమా యనుట స్థిరపడకుండుటవలన
నిచట సందేహసంకరము సంభవించుచున్నది. రెంటనుఁ
గూడ నుపభోగమే తాత్పర్య పర్యవసానముగుటచే సందే
హము దోషముగా నెన్నబడదు.

సీ॥ సున్నమై నల్లనై పన్నెలఁ బూతలఁ
దొలుకారు మబ్బులు గలయనలది
మున్నావఁ గూరి నల్దిక్కుల మింటఁబా
రులుగట్టి బెగ్గురుల్ వలపు దెలిపి;
చల్లనిగాలులు పెల్లుపెల్లుగ వీవ;
నీలమేఘములకు నెయ్యురైన
నెమళులు చెలరేగి తమిమీర ముదమున
పాటల నాటల నీటుగుల్క.

గీ॥ దిటముగా నుండుఁగావుత; కటికగుండె
నాథ! రాముఁడ నేను సర్వముసహింతుఁ;
గట్టి! వైదేహి యేమి కాఁగలదొ యిఁక?
నక్కటా! దేవిరో! ధీరురాలవగుము.

ఈమహావేదనాదోధూయమానమానసుఁడైన శ్రీరాముని విలాప మీపద్యము. ఇందు మొదటినుండి తుదివరకు ప్రతిపదమును ప్రతివర్ణమును బ్రతీయమానార్థ ప్రభావమునఁ బ్రకాశింపఁజేయును. అందును విశేషముగఁ 'దొలకరిమబ్బులు మింటఁ గలయనలదుటయు, 'నీలమేఘములకు నెయ్యురైన నెమళులు తమిమీరఁ బాటలనాటల నీటుగుల్క దిటముగా నుండుటయు' 'రాముఁడనేను సర్వము సహింతు' ననుటయు 'నక్కటా! దేవిరో! ధీరురాల వగు' మనుటయు సహృదయశేఖరుల తలలూపఁజేసి కన్నుల నీరునించి మానసములఁ గరంచఁ జాలుననినచో స్వభావోక్తియేకాని విశేషోక్తిగాదు. ఇచట 'కలయనలదుట' 'నీలమేఘములకు నెయ్యు'రనుటచే నత్యంత తిరస్కృతవాచ్య సంసృష్టియు మఱియు 'రాముఁడ

సేను సర్వేషు సహితేషు' ననుటవలన నర్థాంతర సంక్రమిత వాచ్య ధ్వనుల గ్రాహ్యానుగ్రాహక భావమున సంకరమును 'రామ' పదమున నేకవ్యంజకానుప్రవేశమున నర్థాంతర సంక్రమిత వాచ్య రసధ్వనుల సంకరమును సంభవించును. ఇటులనే మిగిలినవియుఁ దెలియఁదగును.

---

# షష్ఠమసుమము

:o:

మధ్యమకావ్యముగా గణింపఁబడిన గుణీభూత
వ్యంగ్యమును సాధారణముగ నెనిమిది విధ
ములఁ గావ్యలక్షణ విధాతలు నిరూపించిరి.

అవియేవనఁగా 1 అగూఢము 2 అపరాంగము 3 వాచ్యసిద్ధ్యంగము 4 అస్ఫుటము 5 సంధిగ్ధప్రాధాన్యము 6 తుల్యప్రాధాన్యము 7 కాక్వాక్షిప్తము 8 అసుందరమును. ఇచట నగూఢమనఁగా నతిస్ఫుటమని భావము. కావున ననతిస్ఫుటముగాఁ బద్యము వెలుంగుచున్నపుడే దానిని ధ్వనికావ్యమందురు. అందువలననే కామినీ కుచకలశము కైవడి కావ్యము గూఢముగా నున్నపుడే చమత్కారజనక మని సహృదయవతంసులు నుతింతురు. ఇచట గూఢమనఁ

గొంచెము గూఢమనియే సరసజనసమ్మతము. దీనికి నిదర్శనముగఁ బ్రాచీనశ్లోక మొకటి కానవచ్చును.

శ్లో॥ నాంధ్రీపయోధర ఇవాతితరాం ప్రకాశో
నోఘూర్జరీ స్తన ఇవాతితరాం నిగూఢః
అర్థోగిరామపిహితః పిహితశ్చ కశ్చిత్
సౌభాగ్యమేతిమరహట్ట వధూకుచాభః (౨౦)

ఈ శ్లోకమునంగల భావం బుపలక్షించియో కాబోలు నాంధ్రకవితా పితామహుండైన యల్లసాని పెద్దనామాత్యుండు దీనింగల యభిప్రాయమును బరిహసింప నెంచియో నను, గీర్వాణవాణీమహాకవి మాతంగ మాంధ్రపురంధ్రీ రత్నముల కారోపించిన-దోషము లేకము నాంధ్రభాషా మహాకవి-మత్తేభము ద్రావిడాంగనామణుల కాభరణప్రాయముగాఁ బ్రసాదించెనని క్రిందిపద్యమును దిలకించినంత నే రసికాగ్రేసరుల మానసవీథుల గోచరింపక మానదు.

చ॥ ఘనతర ఘూర్జరీకుచయుగక్రియ గూఢము గాక ద్రావిడీ
స్తనగతిఁ దేటగాక యరచాటగు నాంధ్రవధూటి చొక్కపుం
జనుఁగవలీల గూఢతయుఁ జాటుతనంబును లేకయుండఁ జె
ప్పినయదిపో కవిత్వ మనిపించు నగించటుగాక యుండినన్.

కావుననే యుత్తమమైన ధ్వనికావ్యమునందు

క॥ సగము చనుంగవ వెలినిడి
సగము చనుంగవను పైటచాటున నిడి క్రొం

జిగిబిగువు సొగసువగలను

జగములఁ గరఁగించి పలుకు చానరమించుజా.

అని చెప్పనొప్పును. దీనివలన రసాస్వాద లాలసులును తన్మయీభావన యోగ్యులునై వెలుంగు సహృదయ సార్వభౌములకు వాణీరమణీ శిరోమణి వాచ్యార్థమను స్తనాభోగ సౌందర్యాతిశయమును వెలిఁబెట్టి దాని ప్రతీతిసమాలమునవే లోలోననే పొంచియుండి దాగుడుమూఁతలాడుచుఁ దళుకులొలుకుచున్న వ్యంగ్యార్థ కుచకలశ లావణ్య సర్వస్వము నించుకించుక చవులూరఁ జూపుచు జాణలమనముల గరఁచునని తేటపడును. కావునఁ గామినీకుచ కలశన్యాయమున సహృదయైక వేద్యమైన వ్యంగ్యమునే ధ్వనిగా సంప్రదాయవిదులు వ్యవహరింతురు. దీనికి భిన్నముగా మధ్యమకావ్యమై చెలంగు గుణీభూత వ్యంగ్యప్రభేదముల యన్నిటిలోను వ్యంగ్యము వాచ్యము నపేక్షించుటచేతను చమత్కారకారి కాకుండుటవలన దానికీ పేరు లభించెను. వాచ్యవ్యంగ్యములు గలసియుండుటచేతను వాచ్యము ప్రధానమై వ్యంగ్యమప్రధానమై వర్తించుచు వాచ్యమునకు సొంపుగూర్చుటచేతను దీనిని మధ్యమకావ్యముగ నిశ్చయించి గుణీభూతమని పిలువఁజొచ్చిరి. సరసులుగానివారికిఁగూడ తెలిసినచో నగూఢమందురు. రసాము లెచట వాచ్యమునకు వన్నెఁగూర్చునో దాని నపరాంగమందురు. సహృదయులకుఁ గూడ శ్రమపడినఁగాని తెలియరానిదాని నస్ఫుటమందురు. మిగిలిన

భేదములన్నియు ననుభవము వలననే తెలియఁదగినవి కొన్నిటి నుదాహరింతుము.

1 అగూఢము.

గీ॥ నాటినాటికిఁ దా నలవాటుపడుట
మేటి యెడబాటు సైరింప ఘాటిగల్లు
నెదుర రానున్నఁ గలయిక నింక నొక్క
నిముసమేనియు సైరించి నిలువవశమె?

ఇచట నొక నిముసముగూడ సైరింపశక్యము గాదని తెలుపఁబడుచున్నది. కాన నిది సంక్రమితవాచ్యమై యభిమత కార్యసిద్ధికిఁ బ్రోత్సహించును.

గీ॥ చికురభరమును జీరాడఁజేసి పత్రి
వల్లులఁ గలంచి పిఱుదుల నల్లనంటి
మెడబిగియఁబట్టి చందోయినదుమఁబొడిచి
పెల్లువ వధూటులంగూడెఁ బ్రియునిలీల.

ఇందు సంయోగ మచేతనపక్షమున బాధితమగుటచే నిది యత్యంత తిరస్కృత వాచ్యమును; వ్యంగ్యము వాచ్యమునకు శోభఁగలిగించుటచే గుణీభూతమునై చెలంగును.

గీ॥ కారుచీకటి గ్రమ్మను కటికరేయి
మగని నెడబాసి యిత్తఱిఁ బొగులుచుంటి

నింటనెవ్వరు లేరైరి యిప్పుడునాకుఁ
జెడుగురానట్లు తెరువరీ! నడచుకొమ్ము.

ఈ పద్యమునందు స్వయందూతిక జారునకు నిజావసరమును దెలియఁజేసి సురతము నెపమున ననుసూచి సుఖం ప్రమని సూచించును.

2 అపరాంగము.

క॥ అతిశయ రశనోత్కర్షియు
సతతము నాభ్యూరుజఘన సంస్పర్శనియుఁ
రతినీవీమోచని యౌ
న్నత పీనస్తన విమర్దనంశీకరమే.

తెగిపడిన భూరిశ్రవుని చేతిని గాంచి వాని భార్యలిట్లు విలపింతురు.

గీ॥ క్షీరసాగరకల్లోల లోలలోచ
నలవిలాస విశ్వాసము లలరెనేని
సారమేమియు లేని సంసారమెల్ల
కాలముఁ సారవంతమై కానుపించు.

ఈ పద్యమున శాంతము శృంగారమునకు నంగమై వెలఁగును. ఇచట శృంగారము కరుణకు నంగమై వెలంగును.

సీ॥ కురులు సన్నగదువ్వి కొమరొప్ప ముడివైచి
కంచుకం బెడలించి కడగనుంచి
తనమేని నునుకాంతి కెనయైన తొగరంచు
వలిపెంపు మేలు దువ్వలువదాల్చి

కచభార కుచభార కటిభారములచేత
నడుగులం దడబాటు పొడముచుండ
చెలికత్తియలతోడఁ జెలఁగి సల్లాపముల్
సలుపుచు జలకేళి సలుపుకొంచు

గీ॥ పాణితలమందుఁ దాఁ బ్రిదును బట్టిపట్టి
తొడరి భామినీకులనెల్ల తోడితోడి
మేనఁ గుమ్మరించుకొనెడు మెలఁతసొబగు
కొల్లగొనకున్నె చూపర యుల్లమెల్ల?

ఇచట సాహసము వాచ్యమున కంగమై కానవచ్చును.

సీ॥ వలపుచూపులతోడ వలుదపాలిండ్లతోఁ గలికినవ్వు మొగంబుతోడఁ
బాలబుగ్గలతోడఁ జవదంపు మోవితో మేలిమి మిసమిసల్ మేనితోడఁ
గెంపులరైకతోఁ గెంజాయ చీరతో మేలిహొంబట్టు రుమాలతోడఁ
గలువరేని పదారు కళలు రూపముదాల్చి వచ్చెనేమో యన బాలలీలఁ

గీ॥ 'గారు' పైనెక్కి 'బీచిషికారు' కేగుఁ
గటకటా! యామె 'మోటారుకారు' లోని
'సీటు' నైనను గానైతిఁ జింతదక్కి
కపురపుటనంటి బోదెల కళుకులొలుకు
తొడలఁ జాపిడి హాయి చెందుదును గాదె.

ఇందు భావాభాస మంగమై చూపట్టును. మొదటి భాగమున రక్తురాలుగాని కాంతవిషయమై శృంగారమును, తుదిభాగమున రతిరూపమైన యాభాసమును, మొత్తము పద్యమునందు నాయికామణియందు నౌత్సుక్యాతిశయము నామె చేకూరదను నిర్వేదము పిదప నచేతనమైన 'సీటుగా

నైనఁగా నోచనైతినిగాయని నాయకుని దైన్యము గుణీభూతమై కానవచ్చును.

గీ॥ ఇచ్చవచ్చిన మచ్చిన నేగువాని
వలపునుగ్గులు వినఁబోని చెలిమికాని
మన్ననలఁబొంద నో వెత్తి మానసంబ
మింట్నితోవను దిరుగాడు చుంటివేల?

ఇచట వియోగరూపమైన భావశాంతి గన్పట్టును.

౨౭౨ గీ॥ ఇంటిలోఁగల సొత్తెల్ల మంటఁగలసి
పోయినను నాదుహృదయంబు హాయిఁజెంద
నేలనన; సూరకాలిన వేళఁగుండ
నిచ్చుచో వానిచేయి నాచేయిదాకె.

ఇందు సంయోగరూపమై భావశాంతి చూపట్టుచున్నది.

గీ॥ జలకమాడిన పసుపుచే మలినమైన
జాలవలయంబునంగల జాలకముల
సన్ననా చిన్నిపుల్లచే చక్కఁపఱచి
చెప్పు మెవని కృతార్థతఁ జేయఁగలవో?

ఈపద్యమున నాయకుని భావోదయము సూచింపఁబడెను.

గీ॥ సుభగ! దాక్షిణ్యభావంబు చూపువంక
వచ్చినంతనె మదిలోనివంతలుడిగె

నింక ననుకూలభావంబు నెఱిఁగాంచు
వనితలసుఖంబు వర్ణింప వశమె నాకు?

ఇచట నాయికామణికిఁ గల భావోదయము వ్యక్త మగును.

క॥ గరగరని యెండవేడిమి
నరయ శరీరతలలీన మగు ఛాయయుఁ దా
వెరచుచుఁ గదలఁగఁ గనుమా
తెరువరి! నీ వేల నుంత తీరికగనవో?

ఇచట తెరువరిని జూచినంతనే చలివేంద్రిలో నీరు పోయుచున్న కామినీమణి కాతనిపై గూరిమియు నింతనడి వేసఁగిని నాపఁసు! ప్రియాశ మొఁరించు చున్నాఁడుగదా? యను విచారమును రెండును గలుగుటచే నిందు భావసంధి విలసిల్లును.

గీ॥ నాకజీర్ణజ్వరంబు క్షీణతను జెందుఁ ౨౨౪
జెందనుండును నీమనా చింతయేల?
సుందరా! సుఖపృచ్ఛ! సురభిగంధ!
వలదు; గంధత నన్నంట వలదు; వలదు.

ఈ పద్యమునందు ఖండితనాయిక యీర్ష్యాలాపము లాడుచు నాయకుని దౌష్ట్యమును బ్రకటనచేసి వానికిఁ దన

యందు దయగలుగునట్లొనరించి తాను సంతోషము నొందు
చున్నది. అందుచే నీపద్యము స్థూలదృష్టికి భావసంధికి
దృష్టాంతమైనను సూక్ష్మదృష్టి వీక్షించినచో నిందు భావ
శబలత గూడఁ గానవచ్చును. ఇచట 'నజీర్ణజ్వరము' నుట
వలన 'నీవువిచ్చేయుదువని తలవాకిలి నిల్లుగట్టుకొని తెల్లవారు
దనుక వేచియుండుటచే నిదురలేమిఁ దినిన తిండి జీర్ణము
గాక యజీర్ణజ్వరము గలిగె' ననిభావము. కాన నాజ్వరము
తగ్గును. తగ్గకుండును; నీకు నాచింతయేల యని నాయికయే
ప్రశ్నించెను. ఇంక రెండవసగమున 'సుందరా!' యనుటచే
'నినువలచినవారు వేనవేలు గలర'నియు 'సుఖపృచ్ఛక
యనుటచే నీవు నలుగురిచే నిందపాలు గాకుండుటకు మాత్రమే
నాసుఖమునుగూర్చి యడుగుచుంటివ'నియు 'నీవు కేవలము
సుఖపృచ్ఛకుఁడవే కాని సుఖదాయకుఁడవు కావని'యు 'సుఖ
సంధాయకుఁడ వైనచో నన్నీరీతి నుపేక్షచేసి పెరవనితలతో
మురిపెంపుసిరుల మునిగి తేలుచుండవని'యు 'సురభిగంధ'
యను సంబోధనమున 'నీవిప్పుడే వారి బాహుపాశముల దృఢ
బంధనముల నించుక సడలించుకొని నాసుఖము నడుగుటకై
వచ్చితి' వనియుఁ దాత్పర్యములుగలవు. నాల్గవపాదమున
'వలదు గంధిత నన్నంటవలదు; వల' దనుటవలన 'నీవైన
సుఖముగ నుండుము. నీవునన్నుఁ దాకినచో నాజ్వరమువాసన
నీకు సోకవచ్చును. నీవారోగ్యవంతుఁడవై మెలంగినచో
నేను జీవించియున్నంతవరకు నీ సుందరవదనారవింద సందర్శన
భాగ్యమైన నాకపుడపుడు లభించుచుండు' నను వ్యంగ్యార్థ

మునకు ప్రీతికలుగును. మఱియు నిటనొక విశేషము. ఇచట 'నన్నంటవల' దనుటవలన 'నాపురాకృత ఫలమువలన నాకు నీసంభోగసౌఖ్యము సమకూరదాయె! ఇప్పుడు నీవు నన్నుం దాకుటవలన రోగవీక్షితుండవైనచో నాకతమున నీకొట్టి కెందలు సుందరీఃపణములుగుందు మందురో! ఆకాల నాకలవిలేని వియోగదుఃఖమును ముందు పుట్టువునఁగూడఁ గలుగఁజేయును. అట్టి కట్టడి కార్యమున కేనొడిఁగట్టలేను. ఇట్టులయినచో ముందు పుట్టువునయైన నీపొందుఘటించి నేను సుఖమనుభవింతును. కాన నిను బ్రతిమాలెద. నీవునన్నంటవలదను విశేషమును నీవాచ్యము వ్యక్తపఱచును.

గీ॥ పాంధుఁడా! విను స్కంధాగ్నివలన వనము ౬౬౫
గ్రామము తృణాగ్నివలన రక్షణమునొందు
నగరమందువసించెడి ముగుదఁ గాన
శీతవాతపరంపర భీతిఁజెందు.

ఇచట దూతికాముఖమున భావసంధి సంభవించును. అడవులలోనున్నవారలు నెగళ్లమంటలచేతను, పల్లెలలోనివారు గడ్డిమంటలచేతనుఁ జలిగాచుకొందురు. పట్టణమున కట్టెలు గడ్డి మెండుగా నుండవు. ఇరుగుపొరుగువారిచ్చిపుచ్చుకొను బుద్ధిగలవారు గాకుంటచే నప్పైన దొరకదు. కావున పాపబిరా చిన్నపిల్ల పరితపించుచున్నది. ఓ బాటసారీ! నీవైన నీమె మదిఁగల బెదరుడిపి చలిపోవు ప్రయత్న మొనరింపుమని దూతిక పాంధున కుపదేశించుచున్నది. ఇచట త్రాసవిత

ర్కములకుఁబోఁబడి గట్టుచేరకున్న వారికి దూతిక హితోపదేశము పెనుతెప్పయై కాపాడెను.

సీ॥ మనపొందు నెవరైన కనుఁగొందురేమొకో! వెంటనేచపలుఁడా వెడఁగుఁబొమ్మ
తొందరపాటేల చెందుచునుంటివి? కన్యాలలామను గానె నేను?
చిటికెనేస్తైన నీచేయూతనొసగుమ యక్కటా! నాకెట్టి చిక్కుగల్గె
కూడనికార్యమే జాడఁజేయుచునుంటి? వెందుబోవుచునుంటి వీవటంచు

గీ॥ వసుమతీపాలకా! వనవాసవృత్తి
మనెడి నీవైరిరాజకుమారి కూర్మి
కుసుమ కిసలయఫలములఁ గోయువేళ
వలపుఁ జెలికానిఁ గన్గొని పలుకుచుండె.

ఈ పద్యమునందు క్రమముగా శంక అసూయ ధృతి స్మృతి శ్రమము దైన్యము విబోధము ఔత్సుక్యములను నెనిమిది భావముల శబలత గానవచ్చును. ఈ భావశబలత రాజవిషయమైన రతిభావాంగమై చెలంగుటచే గుణీభూత వ్యంగ్యమై ప్రకాశించును.

ఇటుల గుణీభూతములైన రసాదులే రసాద్యలంకార వ్యపదేశమున వెలుంగుచున్నవి. గుణీభూతమైన రసము రసవదలంకారము; భావము ప్రేయము; రసభావాభాసములు నూర్జస్వి; భావశాంతి సమాహితాలంకార మనఁ జెలువొందును.

అంతియేకాని భావోదయాదులిటుల వ్యవహరింపఁబడవు. ఎందులకీ మాట చెప్పవలయుననినచోఁగొందఱు భావోదయము, భావసంధి, భావశబలతలను గూడ ప్రత్యేకాలంకారములుగఁ బరిగణించుటచేతనే. ఇంకనిచట నుదాహరింపఁబడిన పద్యముల ధ్వనిగుణీభూత వ్యంగ్యభేదములందు, ధ్వని భేదములు, గుణీభూత వ్యంగ్యభేదములు, నలంకార భేదముల, సంకరసంసృష్టి విభాగములుగూడ కొన్ని చెలఁగును. వానిలో గొన్నిచోట్ల నలంకార ధ్వనులును మఱికొన్ని చోట్ల రసాదిధ్వనులును జెలువారును. ఇటులనే గుణీభూత వ్యంగ్యమునఁగూడ ప్రాధాన్యతను గణించి వ్యవహరింపవలయును. ఎచటనేది ప్రధానమో దానినా పేరఁబిలువవలయును. చమత్కారాతిశయమే ప్రాధాన్యము. ఇది సహృదయ హృదయైకవేద్యమే. వాచ్యాంగభావము శబ్దశక్తిమూలమైన లక్ష్యక్రమగుణీభావము.

సీ॥ కాంచనమృగతృష్ణ కన్గవఁగప్పఁగ	౭౭
సంచరించితి జనస్థానమెల్ల।
కన్నీరు మున్నీరుగాఁగార వైదేహి
యంచు నెల్గెత్తి వచించి వాఁడ।
ఘటియిల్లెఁగా నలంకాభర్త వదనప
రీపాటి మూర్ఛనరీతిఁదలఁప।
విధివిరామము లేక విసివి వేసారఁగాఁ।
దుదకు రామత్వంబు దొరకెఁగాని।
గీ॥ దశలవసుతాధిగమము చేకూరకుంటఁ।
గోర్కెతీగలు వనలెత్తి కొనలుసాగి।
నలుదెసలు ప్రాకఁగా లేదు; నాకు నింక।
కటకటా! లేశమేని సౌఖ్యంబుగలదె?

ఈపద్యరాజము, దారిద్ర్యదేవతా దరహాసాంకురముల కాలవాలమైన కవిసార్వభౌముని పరిదేవనముగా నొప్పును. ఈ పద్యమునందలి పై **నాలుగు** పాదముల వలన నాతనికి రామత్వంబు పరిపూర్ణముగాఁ బ్రాప్తించెను. కాని గీతము లోని **భావమువలన నాతని** భాగ్యపరిపాకము చదువరులకు విశదమగును. **ఇందు** కవిచంద్రునకు మూఁడు వంతులు రామునితో సాటి చేకూరెను. ఈ సంగతి కవీంద్రుఁడు స్వముఖముననే మన కెఱుక పఱచుటం జేసి వాచ్యత సిద్ధించును. దాని కంగముగ శబ్దశక్తిమూలానురణన రూపమై రెండవయర్థము తెల్లమగుచున్నది. మాయా బంగరు లేడియై మారీచుఁడుగాన వచ్చుటచేఁ గన్నులు మూసికొని పోయి రాముఁడు దండకారణ్యమెల్లఁ దిరిగెను. పసిడిని వెదకుటకనగాఁ బ్రతిమాలి సంపాదించుటకై, పేరాసగొని కవిరాజు జనులున్న చోట్లనెల్ల ననఁగా పల్లెల పట్టణముల వెంట దిరిగెను. ఇచట 'కాంచన మృగతృష్ణ' 'జనస్థానము' లను నివి, శ్లేషమూలకములై విలసిల్లును. కన్నుల వెంట నెడతెగక నీరుగార రాముఁడు 'వైదేహీ' యని గొంతెత్తి పిలచెను. ఇచట కవి, తాను గనినవారి నెల్ల 'వై'=నిశ్చయముగా, 'దేహీ'—ఒసఁగుము, అని బిగ్గరగా నరచెను. రామునకుఁ దలప నలంకా భర్తవదన పరిపాటి మార్గణరీతి ఘటించెను. అనఁగా రాముని మార్గణములు లేక బాణములు, లంకాభర్త లేక రావణుని వదన పరిపాటిని బొందెను. లేక మొగములకు దాకి వాని తలల ద్రుంచెను. ఇచట కవికిఁ దలప నలంకా

భర్తృవదన పరీపాటి మార్గణరీతి ఘటించెను. అనఁగా సీతని యాచనాలాపములు కాభర్తలులేక కత్తినీను లైన రాజులు, వదనపరిపాటి లేక నేడిచ్చెద, లేపొసగెదనను మిథ్యాభావణములు గాఁ జెలువొందెనని తాత్పర్యము. అందుచే నీలుల విసివి వేసారగాఁ దుదకు రామత్వ మీాతనికి దొరకెను. ఇంతవఱకే కవికిరామునకును సమానము వర్తించును. వీరిరువురి శ్రమకును సంభవించిన ప్రతిఫలమునం దినుమంతయుఁ బోలిక కన్పట్టదు. రామునకు కుశలవ సుతాధిగమము చేకూరెను. ఈ కవిపుంగవున కది లభింపలేదు. అనఁగా రాముఁడు రావణుని చంపి సీతను గొనివచ్చిన పిమ్మట నాతనికిఁ గుశలవులను సుతులు గలిగిరి. ఇంక కవిహృదయమున దుర్మార్గులైన ప్రభువులకు ‹నవరసభావాలంకృతకవితాగోష్టి› రవంతయు రుచింపమింజేసి వార, లధరము గదలియు ‹గదలక మధురములగు బాస' లుపచరించిన కతమున, కుశలవసుతాధిగమము నేకూరకుండెను. అనఁగా నీతనికి గాసువీసములేమియు నరిచేతఁబడలేదు.

అర్థశక్తిమూలాంగ భావమైన వాచ్యము.

గీ॥ లేయి నాలుగుజాములు బాయుకతన　　౭౭౪
విరహమున వాడి వత్తలై వేగుచున్న
తామగలవేడికోలులై తినతిరాంగి
పాదపతనంబుసల్పెడు భానుఁగనుము॥

ఇచట రవి పద్మినీ వృత్తాంతమునందు నధ్యారోపణమైన నాయక నాయికావృత్తాంత మర్థశక్తిమూలవస్తురూపకమున వెలువడుచున్నది. సూర్యోదయ వర్ణనరూపమునం దనురాగము స్వల్పమని నాయకుండు నాయికామణికి సూచించుచున్నాఁడు.

వాచ్యసిద్ధ్యంగము ఏకవక్తృకపదవాచ్యాంగము.
ఏకవక్తృకవాచ్యాంగము అన్యవక్తృకశబ్దవాచ్యాంగము.

గీ॥ భ్రమయును, నరతియుఁ, మానసాలసత ప్రళయ
గరిమ, మూర్ఛయుఁ దను, సంగకములపీడ,
మరణముఁ, గల్గఁజేయుఁగా విరహిణులకు
జలదభుజగజ ప్రబల విషంబు సతము॥

ఈపద్యమునందు వివరింపఁబడిన భ్రమ, యరతి, యలసహృదయత, ప్రళయము, మూర్ఛ, తమము, శరీరపీడ, మరణములను నెనిమిది యవస్థలును, విషపానమొనర్చిన వారికిని లేక పాముకరచినవారికిఁ గ్రమముగా సంభవించును. ఇచట ప్రబలవిషమనుటచే హాలాహలము లేక కాలకూటమని తాత్పర్యము. జలదభుజంగమను రూపకమువలనఁ బ్రకృతముగాని గరళము లేక కాలకూటము సూచింపబడుచున్నది. అందుచే నిందు వ్యంగ్యము వాచ్యసిద్ధము. లేనిచో జలదమునకు భుజగత్వము సంభవింపక పోవుటచేత, పామువంటి మేఘమని పూర్వపదార్థప్రధానమైన యుపమిత సమాసాశ్రయమున నుపమాలంకారమునకు నాపత్తి చేకూడును. కాని

వ్యంగ్యముకన్న వేరుగా నధ్యవసితమైన జలమునకును భుజ
గత్వమున కాపత్తి యుండుటచే, నుత్తరపదార్థ రూపకసిద్ధి
గలదని భావింపవలెను. ఇది శబ్దశక్తిమూలానుస్వానప్రకాశమైన
ధ్వని. ఇచట నల్లఁదనముచేత మేఘములకు భుజగత్వసిద్ధియు,
విషము ననఁగా జలమునకు గరళరూపమును సిద్ధించునని
చెప్పినచో నుత్తమము.

గీ॥ కలహమధ్యమునన వినిర్గతములగుచు ౧౮౦
సుజన కర్ణశ్రుత రహస్య సూత్రచయము
హృదయమున జీర్ణదశ నధిష్ఠింప జీవ
మెడలఁగా దాని నగ్ని దహించునుమ్మె.

ఇచట దూతిక విశ్వాసఘనమునకై నాయికను ప్రోత్స
హించుటచే నిందలివ్యంగ్యము వాచ్యమున కంగమై చెలంగును.

అన్యవక్తృకవాచ్యాంగము

గీ॥ గాఢరోషదూషితమైనఁగాని సుజను
వదనమున సుప్రియంబులు వచ్చునొక్కొ-
రాహుముఖగహ్వరంబునఁ గ్రాగుచున్నఁ
జంద్రకిరణంబు లమృతవర్షంబె కురియు.

కృతాపరాధుఁడై భీతిలిన నాయకుని యభిముఖునిగాఁ
జేయ దూతిక పలుకుటవలన నిది యన్యవక్తృకమై వాచ్యాం
గముగా భాసించును.

సీ॥ "పోయివచ్చెదనేను; పోవఁగా నచ్యుతా!
చెలిమిమీరఁగ నాకు సెలవొసంగు
కందోయివిందుగాఁ గాంచినమాత్రాన
డెందమేచందానఁ గందళించు
ఒంటిపై కాలముగ్గెంటు పేదలఁజూచి
పనిలేని పనిగాఁగ బల్కఁజెల్లు
నేని"యంచు పిలుపుల నీటులుగుల్కుచు
సన్నసన్నముగాఁగ సరసలీల
గీ॥ విన్నబాటున తడబాటు వన్నెలొల్క
గోపికల్ బిగ్గఁగౌఁగిలిగూర్చి తేర్చి
మేన పొరిపొరిపులకల నూనివెలుఁగ
చిన్నివెన్నుఁడు మిమ్ము రక్షించుఁగాత!

ఇచట 'నచ్యుతా' ది పదములవలనఁ గలుగు వ్యంగ్య మంతయు 'పిలుపుల నీటులుగుల్కుచు' అను వాచ్యమునకు వన్నెఁగూర్చుచున్నది. ఈపద్యమున గోపిక కొంతభాగమును, మిగిలినభాగమును కవియు పలుకుటచేత దీని నన్యవక్తృకమని కొందరందురు.

అస్ఫుటము.

గీ॥ కాంచకుండినఁ జూడంగఁ గాంక్షగల్గు
కాంచినంతట నెడబాటు కించవొడము
వనితరో! నిన్ను గాననివారుగాంచు
వారలుంగూడ సుఖమును బడయలేరు.

ఇచట నదర్శనవియోగ భయములు రెండును లేకుండు నట్లు సేయుమని క్లిష్టవ్యంగ్యము.

క॥ మనసుఁ హరించు గాంచఁ
గనులున్న ఫలంబువోవుఁ గాంచనియెడలఁ
నునుఁదీగబోణి చెలువము
గనినఁ గనకున్న సమముగా వంచితులే.

పై పద్యములోని భావమే భంగ్యంతరముగా వచింపఁబడెను.

గీ॥ తవిలి దీర్ఘోష్ణ నిశ్వాస తప్తమగుచుఁ ౨౩౫
జెలఁగి బాష్పసలిల పరిషిక్తమగుచుఁ
గలికి యధరంబు నీవియోగమునఁజేసి
దారుణశ్యామశబలవ్రతంబు దాల్చె.

ఈపద్యమునందు శ్యామశబలవ్రతమనఁగా నెండలో నెండుటయు వానలో నానుటయునని తాత్పర్యము. అటుల తపమొనరించినచోఁ గోరికలీడేరునని పెద్దలు పల్కుదురు. ఆ నుడులాలకించి పాపమీ బాలికామణియొక్క బింబాధరము నీమధురాధర సాంగత్యము నభిలషించి నిశ్వాసముల వేడిమి నెందుచు బాష్పవారిదడీయుచు ఘోరవ్రతమునల్పుచున్నది. కాన నీవీమెపై దయసూపి చుంబనసిద్ధినిఁ బ్రసాదింపుమని దూతిక నాయకుని బోధించుచున్నది. ఇచట వ్యంగ్యము సహృదయులకుఁ గూడ స్ఫుటముగా దోచకుండుటవలన దీని నస్ఫుటమని వచింతురు.

గీ॥ పల్లెటూరను లవణంబు కల్లయైన
ననుభవింపుము స్వాధీనమైనదాని

సుందరాకార! స్నేహంబు శూన్యమైన
యేని సలవణమైనచో నేమిఫలము?

ఈపద్యముఁగూడ దూతికయే నాయకునితోఁ జెప్పుచున్నది. ఇచట లవణమునకును స్నేహమునకును రెండర్థములుగలవు. ఒకటి యాహారపరమును రెండవది విహారపరమునై భాసిల్లును. ఇచట ననఁగా పల్లెటూరను నీకు భోజనసదుపాయమును లేకపోవచ్చును. ఎట్లనఁ బల్లెటూరనంగడులు లేకుండుటవలన నుప్పుకావళ్ళుగాని యుప్పవో నెలుగాని వచ్చినప్పుడే మేము లవణమును కొని నిలువచేసుకొనవలెను. ఎన్నడో కాని రాకపోవుటవలన లవణమనఁగా నుప్పు తక్కువగానున్నది. కాని నీకిచట మెండుగా స్నేహమనఁగా నూనెమొదలుగాఁగల తైలము కావలసినంత కలదు. కాన కొంచెము నేతిబొట్టుతో లేక నూనెచుక్కనో పోసికొని తనివిఁదీర భుజింపుమని యాహారపరమైనయర్థము. ఇదియుఁగాక విహారపరమైన యర్థమెట్లన:- ఈపల్లెటూరి పడుచునకు నందచందములు వలసినంతలేవు. కాని నీపై నీమెడకు మిక్కుటమైన మక్కువకలదు. ఇచట లవణసంబంధమైనది గనుకనే లావణ్యము లేక సౌందర్యము? స్నేహమనఁగా నీపైఁ బ్రేమమనియు భావము. కాన నీమెడకుఁగూడి సుఖింపుమని తాత్పర్యము. "ఈవనిత తనంతఁదా వలచివచ్చెనని చుల్కనసేయఁదగదు. ఓ యందకాడా! వలపువెలియైన వగలసొగసులవలన నేమిఫలముగలదు? అనగా నంతయు సుఖము చేకూరదు" అని పద్యమునందలి మూఁడునాలుగు పాదములు

తెలియఁజేయును. ఈవిశేషార్థము బుద్ధివిశ్లేషపఱచినఁగాని దొరకమిచే దీనిని శ్లిష్టము లేక యస్ఫుటమని పల్కుదురు.

గీ॥ తీర నిహితాగ్రహస్తయై వారిపూర
లోలకల్లోల ఘూర్ణన శీల గురుని
తంబయై పురుషాయమానంబు వోలె
భేకమదె ప్రతిబింబించి వెల్గుచుండె.

ఇచట కొలనికెలవనిలచి వింతలుగాంచుచు నొకరి కొకరు తాముగనినవానిఁ దెలియఁజేయు నెపంబున నీటిలోఁ దేలియాడు కప్పను వర్ణించుచు నాయికామణి తనవిపరీత రతాభిలాషను వెలిఁబుచ్చును. కావున నీపద్యమునందలి భావముగూడ యస్ఫుటముగానే కన్పట్టును.

సందిగ్ధప్రాధాన్యము.

గీ॥ వెలది వీక్షింపఁగానల వేయికనులు
మగువ భావింపఁగా లక్షమానసములు
సుకృతశతకోటి భోగ్యమీ సురుచిరాంగి
పరువపుం బ్రాయమెన్నఁగా వశమెనాకు

ఇచట నాయకుని మానసమున సందేహము ప్రధానమై చెలంగును.

క॥ పురుషుఁడు పనిబూనినచో
సిరియో మరణంబొ నిజము చేపడుసుమ్మీ

మరణ మనారంభితునకు
కరగతమగుఁగాక లక్ష్మికరగతమగునే.

ఈపద్యమునఁగూడ సిరిసురిణములు సందిగ్ధప్రాధాన్యత వహించెను.

గీ॥ కళికి! కీర్తికంటిచూపుల మొలకలెత్తె
చెలువ! చిన్నారిపలుకులఁ జివురుదాల్చె
పొలతి! మునిమునినవ్వులఁ బూలుపూచె
శేమ! మెయిదాకి కోర్కె ఫలించుగాత.

ఇచటఁ జూపులు పలుకులు నగవులకు సందియము ప్రధానము.

గీ॥ సాంద్రహారచందనపుఁ బంకచర్చమైన
లలితమృణాలపు హారవల్లరులు చెలికిఁ
బతివియోగ విషాద దంభములు పవలు
చంద్రికాభిసారికకు వేషంబులయి.

ఇందు విరహవేదనకును నభిసారికావేషమునకును సందేహము.

గీ॥ రాజవీధి నివాసిని; రాజవదన;
తరుణి ప్రోషితభర్తృక దైన్యవృత్తి
వసతిజనముల సహవాసమైనఁగాని
కొంచెమేనియు శీలంబు కొరతపడదు.

ఈపద్యమునఁగల నాయికామణియొక్క వర్ణనమును గమనించినచో శీలభంగమున కెన్నికారణము లుండునో

యన్నియు నీమెను జెట్టపట్టియున్నవని తెలియుచున్నది. ఇందు నొక్కొకటి కలిగినచో సతీత్వము మంతఁగలయును. అవి యన్నియు నాయికను చుట్టుముట్టినపు డింకేమనిచెప్పఁ జెల్లును. అట్టిచో నీమెకు శీలము కొఱంతవడ లేదని వాచ్యముగలదు. దీనిని చదువువారలకెల్ల నిందలి నాయికశీలము చెడెనా లేదా? యని సంశయము తప్పక జనించును.

తుల్యప్రాధాన్యము

క॥ ఫలరహితమయ్యె జన్మము
నలినము తుహినాంశునిఁ గనంగఁ గలేమిఁ
గలువల చెలి పుట్టువయుఁ
ఫలితము గాకుండె ఫుల్లపద్మముఁ గనమిఁ

చంద్రపద్మినుల జన్మము సఫలముగానటులనే నా నీ పుట్టువులుగూడ నొకరినొకరు గొల్లకున్నచో రిత్తయేనుమా' యను వ్యంగ్యము వాచ్యమునకు శోభగూర్చును. ఇందు తుల్యప్రాధాన్యముగలదు.

గీ॥ అలరు మొలకల పూవు ప్రాయంపుసొంపు
నీసడించెడు నేరీతి నీమెనయసు
నేటినారిని పూవింటి మీటువెట్టి
కరసుఁదూపుల నారీతి మరుఁడు దొడగు ౨౪౪

ఇచట బాలికామణియొక్క యౌవనప్రాదుర్భావమునకును మన్మధుని ధనుఃప్రావీణ్యతకును దుల్యప్రాధాన్యము వన్నెగాంచును.

గీ॥ "మల్లెమొగ్గలు కావవి పల్లవంబు
నైచదనుమాట ముగుద! నిజంబుగాదు"
"పల్లవాహతి చేతఁ బర్వతయుగంబు
పతితమగుచుంటఁ గానవే? వలపుకాఁడ!"

ఈపద్యమున నాయికానాయకుల సరససల్లాపములకును వానివలన వ్యక్తములయిన యధరపీడన కుచమర్దనములకును ముఖ్యప్రాధాన్యము సొంపుఁ నింపుచున్నది.

క॥ ఏనూపురంబు శబ్దని
ధానము రతికేళినంచుఁ దరుణి త్యజించున్
దాని విదగ్ధ ధరించును
వీనుల నాజకంఠరుతము వినరాకుండన్.

ఇచట నూపురము మొఱపెట్టుచు తమ కూరిమినేరములఁ వెలిసేయునని వెఱచి తరుణీమణి దానిఁద్యజించెను. ఆ నూపురారావముల సందడియుఁ దమగళధ్వనులును గలసి మెలసి కానరాకుండునని తలచి నెఱజాణ దానినిధరించెను. ఈపద్యమునందు మధ్యాసంగమమునకును ప్రౌఢాసంభోగమునకును సమప్రాధాన్యమును జదువరులు గాంచఁగలరు.

కాకాక్షిప్తము.

క॥ ఓజీవా! దయసేయుము
నాదయితున కిప్పుడన్య నారీసుఖముల్

స్తనకలశముఖంబుల నంటి జారు చెమట
యే కరంబునఁ గడుగఁగా నేల చేల?

ఈపద్యము దూతికచే పలుకఁబడెను. ఒకతె యుత్స వమునకుఁ బోవువంకను మైనిండ సుగంధద్రవ్యములపూత దాల్చి మేలుకాదని గుసి మరల నింటికివచ్చి బహలిక వాపు కొనుటకై చల్లనినీళ్ళ నొడలు గడుగుచుండెను. ఇచట నాయికయే వలపుకాని రతికేళి నేలినకతమున మేనెల్ల చెమటనీటిధారలు జారుచుండెను. 'ఇంకఁ గడుగనేల' యను ప్రశ్నము 'కడుగనక్కరలే'దని సూచించును.

గీ॥ భ్రమరమా! నీవుపలుచోట్ల భ్రమయుచున్నఁ
గమలమెందాక మకరంద కలితమగుచు
కేసర రజస్సమూహమ్మై కీర్తికెక్క
నంతవరకది పేర్వాసి నందదొక్కొ?

ఇందు కాకువుచే 'నీమెను నీవువిరసించినను సతీత్వమున నీమెవన్నెగాంచు' నని స్ఫురించును.

అసుందరము

గీ॥ గగనకామిని భూమినల్లడలదిరుగఁ
గాలకాముకుఁడామెను గౌగలింప
సంజకెంజాయపయ్యెద సగముపడలి
రవిశశికుచంబు నేత్రపర్వంబునేయు

ఇందు సూర్యాస్తమయవర్ణనముచే నొక కామిమిథున సమాగమము వచింపఁబడెను. వినినవెంటనే తెలియునంట నిది యసుందరము.

క॥ చినుకులు పడుచున్నవుచు
మనమునఁ బొగులంగ నీవు మరియాదగునా?
నను నీ బిగికౌగిలి చెం
తను జేర్చి ముదంబుగూర్పఁ దగదే తరుణీ!

ఇచట "ముదంబుగూర్ప దగదే తరుణీ?" యనుటవలనఁ జదువరులకు "రతోత్సవముల దనుపుము తరుణీ?" యను భావము యోజించనక్కరలేకయే బోధపడును. కాన నిదియు నసుందరమే.

గీ॥ వేతసనికుంజమందుండి వెడలిపోవు
పక్షికోలాహలము విన బడిన వేళ
నింటిపనులమునుగుట నన్నిఁటినొద్దు
చెలియసుకుమారదేహము చీల్చఁబడియె.

ఇందు సంకేతమొసఁగినవాఁడు లతాగహనమును బ్రవేశించె నను వ్యంగ్యము గానవచ్చును. అందుననే వాచ్యము చమత్కారకారియయ్యెను. ఆ పులుగుల కలకలము వినినంతమాత్రముననే యవయవములన్నియు చీలికలాయె ననుటవలన నామె సమగ్రసౌందర్యము నుత్కంఠాతిశయమును దెలియవచ్చును. ఇచట స్వశబ్దమువలననే చెప్పఁబడుట వలన దీని నసుందరవ్యంగ్యమందురు.

ఉత్తమకావ్యమునందలి భేదములను గణించి నట్లే గుణీభూత వ్యంగ్యకావ్యమునందలి ప్రభేదములుఁ గూడ యథాయోగముగ లెక్కింపవచ్చును.

ఇచట యథాయోగముగా నుండుటచే ముఖ్యముకావ్యమునందు మాత్రము న స్వాలంకారముల వ్యంగ్యవ్యంజక భావము వలన జేకూరు నారుభేదములను లెక్కించుటకు వీలులేదు. అభిచారిత్వా నియమము లేన ధ్వని కావ్యముగనే పరిగ ణింపఁబడును. వీనిఁ బ్రస్తరించుచో ననఁగాఁ దీసివేసి నచో నలుబదియైదు భేదములుగ గుణీభూతవ్యంగ్యము నెలంగును. ఈ 45 ను శుద్ధభేదములని యనమెఱుఁగఁగును. ఇంక సంసృష్టిసంకరములతోఁ గూడ నలంకారములతోఁ గూడిన భేదముల నెన్నింటినో సూక్ష్మముగా నూహింపవచ్చును. ఈవానిలో ధ్వనికావ్యమునందలి శుద్ధ, సంసృష్టి, సంకరముల భేదముల మొత్తము పదివేల నాలుగువందల యేబదియైదుగా వివరింపఁ బడెను. అటులనే గుణీభూతవ్యంగ్యకావ్యమునందలి విభేద ములుగూడ నెనిమిదివేల నూటనలువదియైదుగాఁ బేర్కొనఁ బడెను. ఈసంఖ్యను మధ్యమోత్తమ తరగతులుగా విభజించి నచో నెనిమిదికోట్ల యేబదియొక్క లక్షల యేబదియైదువేల తొమ్మిదినందల యెబ్బదియైదు విధములు గలవు. ఈ సంఖ్యను మునుపటిదానినే నాలుగురెట్లు చేసినచో 340623900 ముప్పదినాలుగుకోట్లు, ఆరులక్షల, యిరువదిమూడువేల, తొమ్మిదినూర్లు ముఖ్యముకావ్య భేదములుగాఁ గన్పట్టును. అందువలననే ధ్వన్యాదిభేదములు వాని ప్రభేదములు ప్రభేద విభేదముల నన్నిటిని లెక్కించినచో వాని నుదాహరించుటకు తరముగాదని తాత్పర్యము. కావుననే వాని భేదోపభేదముల స్థూలారుంధతీన్యాయ మార్గాంగీకారముననే సహృదయ

చక్రవర్తుల కిట నుపాయుక మొసంగఁబడెను. ఈ ధ్వన్యాది భేదములు మహాకవుల ప్రతిభాతిశయమున ననంత ప్రకారములై గ్రంథాంతరములఁ బ్రకాశించును.

ఈ కారణముననే యాలంకారికులు సంగ్రహముగ ధ్వని మూఁడువిధములని పలికిరి. ఈ సంకలనము వ్యంగ్యముయొక్క త్రిరూపత్వముపై నాధారపడియున్నది. అందు కొన్ని వాచ్యతను సహించును; మఱికొన్ని సహింపవు. వాచ్యతను సహించునవి యవిచిత్రము, చిత్రములనఁబడును. వస్తుమాత్రము లవిచిత్రములు, నలంకారములు విచిత్రములని పిలువఁబడును. ఇంక రసాదిలక్షణమైన యర్థము కలనైన వాచ్యముగాదు. అందుచే రసాదులకు వాచ్యతాయోగ్యత లేనేలేదు. అవి కేవలము వ్యంజనవ్యాపారమూలముననే చర్వ్యమాణ జీవితములై ప్రకాశించును. అంతియేకాని వ్యాపారాంతరమున రసాదులాస్వాద్యమానము గావని చదువరులు జ్ఞప్తియుంచుకొనవలయును. కావున రసాదివ్యంగ్యమే చమత్కారగోచరమై కావ్యముల వెలుగొందుచుండును. ఈ వ్యంగ్యత్రయము నధికతర సంక్షేప మొనరించుటవలననే, యవివక్షిత వాచ్యము వివక్షితాన్యపరవాచ్యమును విభాగద్వయము సంభవించెను. ఇంక నధికతమ సంక్షేపముననే సర్వోత్థానబీజము స్ఫోటాత్మకమునైన వ్యంగ్యమై "ఏకమేవాద్వితీయంబ్రహ్మ" యను శ్రుతిప్రతిపాద్యమైన సచ్చిదానంద రూపము సగుణ నిర్గుణ విలక్షణమునై వెలుఁగు వస్తువై

ప్రకాశించుచున్నదని సహృదయహృదయావతంసుల మహా
శయము.

ఇంక కావ్యములలో వాచ్యార్థములేక ముఖ్యార్థము వినువార లందరకుఁగూడ నొకేరీతిని గానవచ్చును. అట్లుఁ గన్పట్టుచున్నను వ్యంగ్యార్థములేక ప్రతీయమానార్థము వక్తృ ప్రకరణాదులు మారుచున్న కొలందిఁ వేర్వేరుగా నాయా సందర్భముల ననుసరించి మదికిఁ దోఁచుచుండును. ఈ క్రింది పద్యమును పఠించినచోఁ జదువరుల కీసంగతి స్పష్టమగును.

గీ॥ చెల్లదే! భానుమండల మస్తమించె
నిండుజాబిల్లి వెల్గుచునుండె మింట
పులుఁగుగములెల్ల తమతమ నెలవులకును
సాఁగెరుచు దారుచుఁ జేరఁబోవు

ఈ పద్యమున వాచ్యార్థము సూర్యాస్తమయ వర్ణనమును వెలిఁబుచ్చును. ఇంక దీనినొక రాజు సేనానాయకునితో శత్రుసైన్యము నుగురించి పలికెననుకొనినచో 'సంజచీకటి పడుచున్నది. ఏమరుపాటున రిపులపైఁబడి వారినెల్లరఁ బారఁ దోలుట కిదియే మంచి సమయము' అను వ్యంగ్యార్థము గలుగును. అభిసారికతో దూతిక పలికెనని తలంచినచో 'ఈచీకటి వేళ నిన్నొరులు గురుతింపనేరరు. కాన నీవు నీయిచ్చవచ్చిన చోటైన వలపుకానిఁ గూడఁబొ'మ్మను సూచనయున్నది. వాసకసజ్జికతో సఖీమణి వచించెనని నచో 'నీవు సిద్ధపడుము.

ఈపాటికి నీవల్లభుఁడు వచ్చుచుండునను భావము గానవచ్చును. పనివాండ్రనుగురించి పలుకఁబడినచోఁ జీకటి పడుచున్నది. పనివాండ్రు నెల్లర నిక నింటికిఁ బంపువేళ యైనదని తేటపడును. సన్న్యాసుల పరాయణుఁడైన ధార్మికునితోఁ జెప్పఁబడెనేని సంధ్యాసమయ మగుచున్నది. కాలకృత్యములను నియతవిధుల నొనరింపఁ ద్వరపడను తాత్పర్యమున్నది. పనితొందరచే సిలువెడలిపోవు చెలికానితోఁ బలుకఁబడినచోఁ జాలదూరము పోవలను వెంటనే పని ముగించుకొని మఱల నింటికిరమ్మను నుద్దేశము గానవచ్చును. ఇంటి యిల్లాలు పశువులమేపు కుఱ్ఱవానితోఁ బలికినచోఁ బశువులను వేగ నింటికిఁ దోలుకొనిరమ్ము, చీకటిపడినచోఁ ద్రోవదప్పునని తెల్లమగుచున్నది. ఎండవడ దాకినవానితోఁ బలుకఁబడెనేని యింక వేడిమి కొంత తగ్గును. చల్లగాలి వీచునను భావము దోఁచును. వర్తకుఁడు సేవకులతోఁ బలికినచో "నమ్మకటకై దుకాణముననుంచిన వస్తువులనెల్ల వడివడిగాఁ గొట్టుగదిలో నుంచుము తలుపుల తాళములు వేచి గృహముల కేగుదము"ను సూచనగలుగును ఇంక నీపద్యమునే ప్రోషితభర్తృక వచించెనేని "ప్రియుఁడింటికింకను రాలేదు కదా" యను వ్యంగ్యార్థము స్ఫురించును. ఈ ప్రకారముగనే పలుకువారు వినువారు ప్రసంగసందర్భమును మారుచున్న కొలదియుఁ బలుదెరంగుల వ్యంగ్యార్థములు బయల్వెడలు చుండును.

ఇటుల పైన పేర్కొనిన భేదములేకాక వాచ్యవ్యంగ్యములకు సుప్రసిద్ధములైన స్వరూపభేదములుకూడ కలవు. ఇవి యేవనగా వాచ్యము విధిరూపమున నున్నపుడు వ్యంగ్యము నిషేధరూపమునను వాచ్యము నిషేధరూపమున నున్నపుడు వ్యంగ్యము విధిరూపమునను వర్తించును. కొన్నిచోట్ల వాచ్యము సంశయరూపముగ నుండి వ్యంగ్యము శాంతములేక శృంగారములఁ జెలంగి పలుకువాని లేక వినువానియొక్క వివేక విజ్ఞానములపై నాధారపడియుండును. మఱికొన్నియెడల వాచ్యము నిందారూపమున భాసిల్లుచున్నను వ్యంగ్యము స్తుతిరూపమునఁ బ్రకాశించును. ఇదికాక కాలభేదము చాలచోట్ల గానుపించును. వాచ్యము శబ్దమునుమాత్రమే యాశ్రయించును. ప్రతీయమానమనిన వోఁ బదము; శబ్దైకదేశము, కాక్వాదులు, వర్ణసంఘటనా స్వరూపములు మొదలైనవాని నాశ్రయించి వేరు వేరుగఁ జూపట్టుచుండునని ముస్నే రచించిరి. మఱియు వాచ్యము వ్యాకరణకోశాదులవలననే బోధపడును. వ్యంగ్యమన్నచోఁ బ్రతిభాకౌశలము, బుద్ధినైర్మల్యము చేతనే బోధపడును. వ్యుత్పత్తిశేషముననే వాచ్యమున కవగమనము చేకూరును. ఇంక వైదగ్ధ్యమని పేర్కొందిన సహృదయుల చమత్కృతివలననే వ్యంగ్యమున కవగమనము లభించును. కావుననే వాచ్యవిదుల బోద్ధలనియు, వ్యంగ్యవేదుల విదగ్ధులనియును బిలుతురు. ప్రకరణాది విశేషవశమున నీప్రతీయమానము నియతసంబంధ మనియతసంబంధము సంబద్ధసంబద్ధములుగాఁ వ్యక్తమగును.

అందుచేతనే వాచ్యార్థము ప్రతీతిమాత్రమును బ్రతీయమానము చమత్కారకారియునై కార్యభేదమును గలిగించు చున్నది. పైన పేర్కొనినఁ 'యల్లదే భానుమండల మస్తమించు' నను పద్యమునఁ జెప్పినట్లు వాక్య మేకవిధమునను, వ్యంగ్య మనేకవిధములుగను వెలుంగుచుండును. ఇంక నిట వివరింపఁబడిన స్వరూపభేదములలోఁ గొన్నిటి నీక్రింద నుదాహరింతము.

వాచ్యము విధిరూపము వ్యంగ్యము ప్రతిషేధము.

గీ॥ నాట్టిదెసలను ధార్మికా! నమ్మికమున
సంచరింపుము శునకము చంపఁబడియె
లీల గోదావరీనదీకూల కుంజ
వాసియగు దృప్తసింహంబు వలననిపుడు

ఈ పద్యమున 'సంచరింపుమ'ను విధి గానవచ్చును. కాని ప్రస్తుతమున నది వీలులేకుండుటచే 'సంచరింపవలద'ని నిషేధముగా వర్తించును. ఒకానొక కులట గోదావరీగట్టునఁగల పొదరిల్లును సంకేతస్థలముగా నొక కాముకునకు నియమించెను. ఆవేళకామె యాచోటికేగగా నట నొక ధార్మికుఁడా పొదలోగల పూవులఁ గొన్నిఁటిఁ దన జపతపములకై కోయుచుండెను. అప్పుడాతని వెడలనటుచుట కీరీతిగా పరకీయ పలికెను. ఈ పద్యమున వ్యంగ్యము సాధ్యమూలకము లేక యనుమాన

రూపమున సిద్ధించుచున్నదని కొందఱు వచింతురు. దీని నొల్లనివారలు

గీ॥ లలితజలకేళి తరళికరతలముక్త
పిహితరాధికావదనంపు మహితశోక
యూనవిఘటన సంఘటనానుకలన
మతియుఁగృష్ణుండు జగమెల్లఁ బ్రోచుఁగాత

ఈ పద్యమున రూపకాలంకారము లనుమేయములని నిరూపించిరి.

వాచ్యము నిషేధము వ్యంగ్యము విధిరూపము
నియత సంబంధము.

గీ॥ అచట! నాయత్త నిద్రించు నిచట నేను
దివసకంబున నే నీవు తేరిచూడు
పాన్పుఁజేర రేజీకటి బాటసారి
వలదు నాశయ్యమున్గిపోఁగలవు సుమ్మ

ఇచట 'నాశయ్య మున్గిపోవలద'ని నిషేధము వాచ్యరూపమునఁ దెలుఁగుచున్నను 'నాశయ్య మున్గిపోవలయుఁజుమ్మా' ని వ్యంగ్యార్థము చనువవులకు స్పష్టమగుచున్నది.

వాచ్యము సంశయము వ్యంగ్యము శాంతశృంగారములు.

గీ॥ మచ్చరమువీడి పెద్దలు మదిఁదలంచి
ధర్మమాత్రము చెప్పుడీ ధరణిలోన

గొప్పకొండలవా లేక మెచ్చులాంధ్ర
వా? నితంబములేవి కొల్వంగవలయు

## వాచ్యము నింద వ్యంగ్యము స్తుతిరూపము.

కం॥ తుదముట్టకున్నఁ గలుగుఁగా
హృదయజ్ఞులచే సుఖంబు లెట్లారతిఁగా
దదితరులచేతఁ గోర్కులు
తుదముట్టినఁ గలుగవంచుఁ దోచుఁగా పదికిఁగా ౨౦

ఇచట నాయిక 'నీవు నను మోసగించితివి. నా కోరిక తృప్తమాయె' నను నింద వెలువడునట్లు పలుకుచున్నది. దీని మూలముననే 'నీవు నెఱజాణవు నన్నొల్లకున్నను మేలేసుమా' యను భావమునందు 'నీవు చాల సరసుఁడవు. కొంతకాలము నన్ను పేక్షించినను లేక పైకి నిరసించినట్లు కన్పట్టుచున్నను నీకు నాపై నేదో లేని మక్కువకలుగు'నను నాయకవిషయమైన స్తుతి గమ్యమానమగుచున్నది.

## విషయభేదము అనియతసంబంధము.

గీ॥ వలపుఁబ్రియురాలి పెదవిపై పంటిగంటు
గాంచియెవ్వఁడు మదిని సైరింపఁగలఁడు
తేటిగల తమ్మి మూర్కొని కొటువడియె
వలదువలదంచు వేడిన వామశీల

ఈ పద్యమునందు విషయభేదమేరీతిగాఁ గలదనినచో నిచట వాచ్యము సఖీవిషయముగను వ్యంగ్యము పతివిషయ

ముగను మఱి వేఱువిధములుగను జెలంగును. 'వలదువలదంచు వేడినను వినక తుమ్మెదకల తమ్మిపూవు నీమె వాసనచూచె' నని వాచ్యము సఖీవిషయము. 'తేటికాటువలన పెదవిపై గంటు కానవచ్చును. అంతియేకాని మఱి వేఱుగాదు. నీప్రియురాలు నిరపరాధురాలుసుమా' యని పతివిషయమై వ్యంగ్యమున్నది. 'ఇపుడు నేనెటులనో కష్టపడి గప్పిపుచ్చితిని. మఱల పంటిగంటులు పడునట్లు ముద్దుగొనకుమా' యని జారవిషయము. 'నా తెలివితేటలవలన నీనేరమును మాటుపఱచి నీభర్తను నమ్మించితిన' ను స్వగర్వఖ్యాపనముచే విదగ్ధవిషయము. 'మూరుమగలఁ గూడుచోఁ బైపై ముద్దులతోనే తృప్తిఁజెందవలయుఁగాని పలుకాటులఁ బొందరాద'ని యసతీవిషయమున మహోపదేశము. ఇటులఁ దరచిచూచికొలందియు వెన్నవంటి వ్యంగ్యార్థవిశేషము వెలివచ్చుచుండును. అందుచే నిందు విషయభేదము గానవచ్చును.

వ్యంగ్యము సంబద్ధసంబంధము.

౨౬౨ కం॥ పురుషాయితమున నిందిర
పురుషోత్తము నాభికమలమునఁ గనిబ్రహ్మన్
హరిదక్షిణనేత్రంబును
సురతాకులయగుచుఁ దాను చుంబనచేసెన్

ఇచట హరిపదమువలన దక్షిణనయనము సూర్యాత్మకమని వ్యంగ్యముగలదు. దాని నిమీలనమున సూర్యాస్తమయమును, దానిచే బద్మసంకోచమును, దానిమూలమున బ్రహ్మ

కప్పఁబడుటయుఁ గలుగును. ఇటుల గోప్యాంగములఁ గానరాకుండ జేయుట రతికేళీవిలాసమని రసికులకుఁ దెలియనిది కాదు.

ఇచట నుదాహరించిన పద్యములనెల్ల విమర్శించినచో సంకేతితార్థాభిధేయమున కర్థము నపేక్షించి శబ్దములు చెలంగునని బోధపడును. అనఁగా నింతకుమునుపు నలువురిచేత నేపదముల కేయర్థములని నియమింపఁబడి వ్యవహరింపఁబడుచున్నవో, యాయా పదము లాయా యర్థములనే మనకిచ్చుచుండును. ఇటుకాక యర్థనిరపేక్షములై మృదువర్ణాదులు వ్యంజకములై చెలంగును. కావుననే యర్థాపేక్షకములై వాచకములును, నర్థనిరపేక్షకములై వ్యంజకములును వెలుంగుచుండును. అందుచే వాచకత్వమున్నను వ్యంజకత్వము గానేరదు.

ఇంక 'వేతసనికుంజమునుండి వెడలిపోవు' నను పద్యమునందు మొదటివాచ్యము తాను ప్రకాశించుచు వ్యంగ్యమును వ్యక్తపరచి తనంతటానే విశ్రాంతి నొందుచున్నదేకాని ధ్వన్యర్థమును వికసింపఁజేయుటలేదు. కావుననే దీనిలోఁ దాత్పర్యవిషయమైన వ్యంగ్యార్థమునకుఁ బ్రతీతి కలుగుటలేదు. ఇచట స్వపదముననే వ్యంగ్యము పేర్కొనఁబడుటచేత గుణీభూతవ్యంగ్య మసుందరముగా గణింపఁబడెను. పోనీ తాత్పర్యార్థమే వ్యంగ్యార్థమునకుఁ బ్రతీతి కలుగఁజేయు ననుకొన్నచో శబ్దమే దానికిఁగూడ ప్రమాణముగాన నదియు సమంజస

ముగాఁ గన్పట్టదు. అందుచే నభిధాతాత్పర్యములలో నేదియుఁ బ్రతీయమానార్థమునకు వ్యాపారముగాదు. కొన్ని చోట్ల వ్యంగ్యము లక్షణామూలమై సిద్ధించినను ముఖ్యార్థ బాధాదిత్రయ సమయము ననుసరించి లక్షణప్రవర్తించుటచేత నది యభిధాపుచ్ఛభూతమై చెలాగును. కాన లక్ష్యార్థ వ్యంగ్యార్థములు రెంటినిగూడ నొకటిగా వచించుటకు వీలు లేదు. వ్యంగ్యమేకీతగాఁ బ్రస్తావాదిబలమున ననేకములుగాఁ గానవచ్చునో లక్ష్యముగూడ నాతీరుననే నానావిధమై కన్పట్టును. ఎట్లన-

౨౬౩ సీ॥ సరిసాటివారయని పరిభవంబునుగూర్చి
ఏదిలోనయుఁ జేసి మసలుఁగొంటఁ
జెట్టరక్కసుఁ బెట్టి కట్టిడిపని సేయఁ
గూడునో దానిని వాఁడొనర్చెఁ
గులము పెద్దలకెల్లఁ దలవంపులేయుండ
నుంచ నెట్లగు నట్టులోర్చితీవు
కనులార నీకడఁగండ్లు గాంచుట కిల్లు
నమ్ములు దాల్చుట వమ్ములయ్యె
గీ॥ నక్కటా! ప్రియజీవితుండై వెలుంగు
రాము చేతను బ్రేయసీ! ప్రేమనూప
నేది చేయంగఁదగియుండునో తలంప
నట్టిపని నంతయేని జేయఁగబడెను॥

ఈ పద్యమునందలి 'యక్కటా! ప్రియజీవితుండై వెలుంగు రామునిచేతను బ్రేయసి!' యనుచోఁ గల 'రామ' పదము 'కాతరత్వము'ను సూచించును. 'కఠినగుండెవాఁడ

రాముఁడనేను! సర్వము సహింతు' ననుచోనున్న 'రాముఁడ
ను శబ్దము 'సర్వదుఃఖభాజనత్వము' ను దెలియఁజేయును.
ఇంక 'రాముఁడాతండ'ను చోట 'రామ' శబ్దము, ఖరదూషణాది
హంతృత్వము'ను వ్యక్తపఱచును.

ఈరీతిగా లక్షణీయార్థముగూడ నానాత్వమును భజిం
చుచు విశేషహేతుభూతమై చెలఁగును. మఱియు శబ్దార్థా
యత్తము ప్రకరణాద్యపేక్షముననే లక్ష్యార్థావగమము నేకూర్చు
చున్నదో దీనికన్నఁ బ్రతీయమానమును క్రొత్తదానినేల
కల్పింపవలయునని కొందరందురు. దీనికిఁ బ్రత్యుత్తరమేమన
లక్ష్యార్థములకు నానాత్వము గన్పట్టుచున్నను ననేకార్థ శబ్దా
భిధేయముల నందువలెనే నియతత్వమే చూపట్టుచున్నది.
ఇచట ముఖ్యార్థముచేతనే యనియతసంబంధమును గుఱుతిం
చుటకు వీలులేదు. ఎట్లన 'హరి' శబ్దమున కనేకార్థములున్న
నాయర్థము లీవరుసలోనే నియతములై కన్పట్టును. మఱియు
'గంగా' శబ్దమునకు ముఖ్యముగ స్వార్థముచే సంబద్ధమైన
'తటము' నేలక్షింపవలయును గాని 'వనము' మొదలైనవాని
లక్షించుటకు శక్యముగాదు. దీనికన్న భిన్నమై వ్యంగ్యా
ర్థమునందు నియతానియతసంబద్ధ సంబంధములు గానఁగును.
వీనికి దృష్టాంతము లీవరలో నొసఁగఁబడియె.

కావున, లక్షణాత్మకమే ధ్వననముగాదు. వలయున,
లక్షణానుగమనముచే ధ్వననము గానవచ్చును. మఱి

లక్షణానుగతమే ధ్వననమనుటయుఁ గూడను ఎందుచేతనన, అభిధావలంబనముఁ గూడ నది గోచరించును. ఇంక నుభయమున ననుసరించునని చెప్పుటకుఁ గూడ తగదు. కారణమేమన నవాచకవర్ణానుసారముగ నది కల్పట్టును. శబ్దానుసారియై చరించునన సాహసింపరాదు; హేతువేమన నశబ్దాత్మక నేత్రత్రిభాగావలోకనాదిగతమై కూడనది ప్రసిద్ధినొందును. ఇచట వ్యంగ్యము ప్రతీయమానముగుచో వాచ్యమునుండి బద్ధమూరముగా నేరకుంటచే వ్యంగ్యము లక్షణానుగతమని చెప్పుటకు వీలులేదనియు, నర్థమున కనుపయోగములైన కోమలాదివర్ణములుగూడ రసాదివ్యంజకములగుటచే వ్యంగ్య మభిధాలక్షణోభయ రూపముగాదనియుఁ గడగంటిచూపులు కన్నీటిధారలు కుచయుగకంపనాదుల కలుచుటవలననే మానసము గరంగుటచే వ్యంగ్య మభిధామాత్రముననే కలుగనేరదనియుఁ జదువరులు జ్ఞప్తియుంచుకొనవలయును. వెండియు సంకేతము లేకుండుటవలన ధ్వనన మభిధగాదు, స్ఖలితముగాని గతి కలుగుటవలన లక్షణకాదు. అవ్యయప్రతీతి కలుగుచున్నపుడు క్షీణశక్తివలనఁ దాత్పర్యముకాదు. ఇటుల వెలుంగుచుండుటచే నభిధా లక్షణలు తాత్పర్యాత్మకములైన వ్యాపారత్రయమును మేరమీరిన ధ్వననమను పేరుకల వేరొకవ్యాపారమును సహృదయులు సమ్మతింపకతప్పదు.

# సప్తమసుమము.

---

వాచ్యము నతిశయించి వ్యంగ్యము వెలుంగుచున్నచో దాని నుత్తమకావ్యముగను. వాచ్యము నతిశయింపక వ్యంగ్యము గుణీభావము నెందినచో దానిని మధ్యమకావ్యముగను మున్ను లక్షణములు నిర్ధించి లక్ష్యములను బ్రదర్శించితిమి. ఇంక నిచట గుణాలంకారములతోఁ గూడి వాచ్యచిత్రముం గల్గి వెలుంగు నవ్యంగ్యమను కడపటి కావ్యభేదమును జర్చింతిము. ఇందు నవ్యంగ్యమనఁగాఁ గొంచెము వ్యంగ్యార్థముతోఁ గూడినదని భావము. ఇట్టి చిత్రకావ్యమునందలి వ్యంగ్యము స్ఫుటముగాఁ జదువరులకుఁ గానరాదు. ఇంతమాత్రమున దీనిని మధ్యమకావ్యభేదమైన యస్ఫుటవ్యంగ్యమని తలంపరాదు, ఇంక నీకావ్యము కేవల వాచ్యరచనవైచిత్ర్యములతో నిండి రసాదివ్యంగ్యార్థములు లేకుండుటవలనఁ గావ్యమనుకొనియే కాని కావ్యమనుపేరు దాల్పక విస్మయమును గూర్చు వృత్తములలోనుండి యాలేఖ్యప్రాయమై ప్రతిబింబకల్పమై కళామాత్రమై వెలుంగును. ఇందువలననే దీనిని సహృదయులవరకావ్యము లేక యప్రసిద్ధకావ్యముగాఁ దలంచిరి. ఈ కావ్యమునందు గుణములు ప్రధానములగుటవలన నిది శబ్దార్థచిత్రముల చెలువొందును. ఇది రూపకాద్యలంకారములచేతను సుబంతతిజంతములు మొదలైన పౌశబ్ద్యసమావేశమునను విలసిల్లునని కొందరు వచించిరి. అనగా శబ్దా

లంకారములచే నర్థాలంకారములతో పెంపొందునని భావము. ఉభయరూపాలంకారముల మఱికొందఱంగీకరించిరి. శబ్దము పోలెనే యర్థముగూడ కవిసంరంభము లేక కవిప్రయత్నమును దెలియఁజేయుననియు నర్థము పోలెనే శబ్దముగూడ రసప్రతీతిని గలుగఁజేయుననియు నుభయాలంకారవాదులు వచింతురు. వీరి మతమున శబ్దార్థోభయ చిత్రమను మూఁడవ భేదము గూడ సంభవించును. వీనికి లక్ష్యములనిత్తుము.

1 శబ్దచిత్రము.

సీ॥ కబరీభరమునందుఁ గమ్రసౌరభభార
 ముననొప్పు మల్లికా పుష్పములును
మల్లెసుమంబుల మఱపించఁ దలఁచెడి
 చల్లనిదరహాస చంద్రికలును
జంద్రికాజాలకిఁ జక్కట్లు దిద్దెడు
 ముద్దులంగులుకెడు మోముఁదమ్మి
తమ్మితూఁడులకుఁ దా నెమ్మలుగఁబెడి
 పల్లవయుతము లౌ బాహులతలుఁ
గీ॥ లతలకును బొమ్మవెట్టెడి లలితసుమస
మేతమై చెల్వమమరెడు మేనితోడ
మురువులొలుకంగఁ గూర్చున్న ముగుదకన్న
స్వర్గమున వేఱెకలదె భూస్థలిఁ దలంప.

2 అర్థచిత్రము.

సీ॥ అలకజాతములోన నలకజాతము గ్రాల
 వలపును వెదజల్లి వలపునుగొని

కనకాంబరమునందుఁ గనకవల్లి చెలంగ
ధనము నాసనుగొల్పి ధనమునుగొని
యరుణపల్లవముపై నరుణకుట్మలమొప్ప
రక్తిమ వెసఁజూపి రక్తిఁగొని
యబ్జరుచులవ్వాంగు నబ్జాక్షికనయించె
జయముసు బరిగొల్పి జయమునుగొని
గీ॥ పృథివి సామ, దాన, భేద, దండోపాయ
ముల నెఱింగి ప్రజల సిలుగుపడుచు
రాజచర్యలీల రాజనిభానన
రహిఁజరించు తెలుగు రమ్యమయ్యె.

3 శబ్దార్థోభయము.

చ॥ మొదటను గెంపుసొంపులను మున్ప్రమ బంగరు రంగుపూతలన్
బిదపఁ జెలంగుచున్ మదనుసెయ్యని తియ్యని కాగితంబు సం
పద పాలిపోవ వత్తలయి పాలినచెక్కులచాయఁ జందురుం
డడె వెలుగొందుఁ గోయబడునా తెలి కామర దంపతుల్కులన్.

తుదకు కావ్యమన్నిచోట్లను విభావాదిరూప
మున నే పర్యవసానము నొందవలెను.

ఈపద్యములలో రసము స్ఫుటముగాఁ గన్పట్టక పోవుటవలన నివి యవ్యంగ్య కావ్యభేదములు. శబ్దార్థాలంకార భేదముల ననుసరించి, దీనిలోఁగూడ ననేక భేదములు నెలంగు చుండును. అయినను దీనికంతగాఁ బ్రాశస్త్యము లేకుండుట వలన వీని భేదోపభేదములనెల్ల నిరూపించుటకు సాహసింప లేదు.

---

# అష్టమకుసుమము.

---

ఇంతదనుకఁ గావ్యభేదములును గావ్యమునకు నాత్మ
యైన రసధ్వన్యాదులయొక్కయు స్వరూపనిరూపణ మొనర్పఁ
బడెను. ఆత్మతత్త్వ మెఱింగిన పిదప నెల్లరకును శరీరాకార
విచారణ మత్యావశ్యకము. కావున నిటఁ దొలుతఁ గావ్యగుణముల
సంగ్రహముగఁ జర్చించి వెనుక నలంకారములఁ జెప్పెదము.

మానవులకు శౌర్యాదులవలెనే కవితా
సతికిఁగూడ రసోపకారకములు, సుశ్లాఘా
హేతువులునైన మాధుర్యాది గుణము
లచలస్థితిఁ గలిగి విలసిల్లును. ఈ గుణములు
కావ్యాత్మ ననుసరించి మెలంగునే కాని యాకా
రము వెంటనంటిచెలంగవు.

ఎట్లన లోకములో నాకారగౌరవముగలవారి కెందరికో
శౌర్యాదిగుణములు గన్పట్టవు. శౌర్యాది గుణోపేతు
లెందరో యాకారలాఘవము గలిగియున్నారు. అందుచే
రూపురేఖావిలాసము లున్నవారందరును గుణగణరత్నాకరు
లని సామాన్యసూత్రమును మనము విధించుటకు వీలులేదు.
ఈహేతువువలననే యాత్మకుసంబంధించి గుణములు వెలుంగు

నని పండితులు వచింతురు. ఈరీతినే మాధుర్యాది రసవ్యంజకము
లైన సుకుమారాదివర్ణములు మాధుర్యాదివ్యవహారప్రవృత్తిఁ గలిగి
కావ్యములఁ జెలంగును. మాధుర్యాద రసాంగములైన వర్ణములు
సౌకుమార్యాది మాత్రములనే మాధుర్యాదులుగాఁ
జెలంగును. అసౌకుమార్యములైనవి మాధుర్యాది రసోప
కరణములైన సమాధుర్యాదులుగానే మెలంగి రసపర్యంత
విశ్రాంతి ప్రతీతిసాధ్యములై వ్యవహరింపఁబడును. ఇందు
వలననే రసధర్మములైన మాధుర్యాదులు సముచిత వర్ణాదుల
చేతనే వ్యంజితములగునని చెప్పుట న్యాయము. అంతియే
కాని వర్ణమాత్రాశ్రయములు లనుటకూడదు. కావుననే గుణ
ములకు వ్యంజకత్వ మంగీకరింపఁబడెను.

ఇంకరసమునకు నంగభూతములైన శబ్దార్థములమూల
ముననే దానికతిశయము నొడఁగూర్చుచు రసమునకు నేవి
సొంపులింపుచో దాని నలంకారములందురు. కంకణము మొద
లైన యవయవముల ద్వారమున శరీరమునకు శోభ
నాపాదించు హారాదులంబోలె నివి చెలంగును. అనుప్రాసాదులు,
శబ్దాలంకారములు, నుపమాదులు, నర్థాలంకారము లనఁ
బడును. ఈయలంకారములుగూడ రసపరిపోషకములుగానే
సామాన్యముగ భాసించును. అట్లుకానిచో నుక్తివైచిత్ర్య
మాత్రములుగానే గణింపఁబడును. ఇట్లగుటచే నలంకార
ములు నియమముగ రసోపకారకములు గావనియు వీనికి చల
స్థితి కలదనియుఁ జదువరులెంచవలయు. అందుచే, సనువాయ

వృత్తిని శౌర్యాదులును, సంయోగవృత్తిని హారాదులును జెలంగునట్లు గుణాలంకారభేదము గానవచ్చును. ఓజోగుణ ప్రభృతులును ననుప్రాసాద్యలంకారములును సమవాయ వృత్తి చేసుండునని కొందరనుట సమంజసముగాదు. మఱియుఁ గావ్యశోభాకర్తారములైన ధర్మములే గుణములనియు కావ్యాతిశయహేతుభూతములైనవే యలంకారములనియు మఱికొందరాడువచనములుగూడ యుక్తియుక్తములు గావు. వీరుచెప్పిన దాని నంగీకరించినచో నన్నిగుణములును గావ్యవ్యవహారములా లేక కొన్నిగుణములేనా? అన్నిగుణములని సమ్మతించినచో కొన్నిగుణములతోడనేగూడి వెలుంగు గౌడీయ పాంచాలీరీతులనెట్లు కావ్యాత్మగా సమ్మతింపనొప్పును? వీనికి నిదర్శనములుగఁ గొన్నిదృష్టాంతముల నిటరూపింతును.

౨౬౭ గీ॥ దూరముగ హారవల్లరి బారవేయు
కమలము లవేల ఘనసార కలపమేల?
వలదువలదు మృణాలమో చెలియటంచు
బాలిక దివానిశంబులు వలుకుచుండు.

ఇచట రేఫము లకారము మరలమరల వచ్చుచుండుటచే నీయనుప్రాసము శబ్దమునలంకరించి, దానిమూలము శృంగారరస పరిపోషకమగుచున్నది. రేఫము శృంగారవ్యంజకమందురు.

క॥ కరమర్దించుచు సంధిని
నరయుచు నన్యోన్య మండలాక్రాంతములై

తరుణీ! నీ స్తనములు భూ
ధరవరులంబోలెఁ దాము దనరారుఁజుమీ.

ఇందునలంకార మర్థద్వారమున రసమును బెంపొం
దించును.

క॥ సురలోకసుఖము దొరకను
వరవర్ణిని దేహభోగ భాగ్యమువలనన్
అరుణాధరంపు మధురిమ
పరిహాసము సేయు నమృతపానమునైనన్      ౭౭.

ఈపద్యమునఁ బూర్వార్థమున విశేషోక్తియు నుత్త
రార్థమున వ్యతిరేకాలంకారమును గలదు. ఈ పద్యములలో
గుణములకంతగాఁ బ్రిధానత గానరాకున్నను కావ్యవ్యవ
హారముగలదు.

మాధుర్యౌజఃప్రసాదము లని గుణములు
మూడేకాని ప్రాచీనులుపల్కినటులఁ బది
కావు

ఆహ్లాదకత్వమే మాధుర్యము. ఇదిశృంగారమున ద్రుతి
కారణము. ఇచట ద్రుతియనగ గళితత్వము లేక యార్ద్రతగా
వచింతురు. సంభోగమునకన్న గరుణరసమును దానికన్న
మిన్నగా విప్రలంభమును దానిని మించి శాంతమును నత్యంత
ద్రుతి హేతువులని నుడువుదురు. ఒకదానికన్న మిన్నగ

నింకొక దానియందు మాధుర్యగుణము నన్నిలోలుకుచుండును. చిత్తవిస్తృతిహేతువే యోజము. ఇది వీరరసము నను దీప్తి నించును. ఇచటదీప్తియనఁ జిత్తవిస్తారములేక జ్వలితత్వమని చెప్పుదురు. వీరమునకన్న భీభత్సరసమును దానికన్న నెక్కువగ రౌద్రమును సాతిశయములందురు. ఒకదానికమించి వేరొక దానియందోజోగుణ సముత్కర్షత వర్షించునందురు. ఎండినకట్టెల నిప్పువోలెను, తెల్లని మడుంగుల దేటనీటి కైవడిః దనంచి దాను ప్రాకునట్టుల నన్నిరసములను, నన్ని రచనలును మెలంగుదానిని ప్రసాదమని పేర్కొందురు. ఈ గుణములు గుణవృత్తిచే లేక ముఖ్యవృత్తి మూలముననే, శౌర్యాదు లాత్మకువోలెనే, రసమునకుపచరించుట జేసి, కావ్యోత్పాదులు మాధుర్యాదులను శబ్దార్థములకు వ్యవహరించుచున్నారు. ఇంక గుణములు మూడా? లేక పదియా? యని చదువరులకు సందియము గలుగవచ్చును. ఇచట నుదహరించిన మూఁడు గుణములుగాక మిగిలినవానిలోఁ గొన్నిగుణములు రసధ్వన్యాదులలోఁ గలిసిపోవును; మఱికొన్ని దోషత్యాగములుగాఁ గన్పట్టును; వేరొక కొన్ని దోషత్వమును భజించును. కావున మాధుర్యము, నోజము, ప్రసాదములన గుణములు మూఁడేకాని పదికానేరవు. అందుచే నర్థగుణములఁ గూడ నంగీకరింపఁ గూడదు. ఇతరులచే నుపచారమాత్రములుగా శబ్దగుణములని వచింపఁబడినవి సత్యముగ రసగుణములై వెలుగొందును. వర్ణ, సమాస రచనలు గుణములకు వ్యంజకత్వములై చెలంగును.

ఇంక, నే యే యక్షరము, లే యేగుణములకు, వాని మూలమున, నే యేరసములకు సొంపుగూర్చునని చో 'ట' వర్గనువీడి 'క' మొదలు 'మ' తుదివరకును, రేఫమును ణకారమును నుః యోగించినచో మాధుర్య గుణముండును. ఇచట 'క' మొదలైన వర్ణములకుఁ దలపై నాయావర్ణముల కడపటివర్ణములు గూడి యుండవలయుననియు [ఉ కుంజము.] రేఫణకారములు హ్రస్వాంతరితముగా నుండవలయుననియు భావించవలయును. ఇంక సమాసము లేక యావృత్తి పద్యములలో నుండరాదు. ఒకవేళ నున్నను మధ్యమ సమాసముగా నుండవలెను. మఱియు రచన లేక ఘటనముకూడ నీరీతిగానే చెలంగవలయును. వర్ణసౌకర్యమున్నపుడే రచనామాధుర్యము గూడనుండును. వర్గముల మొదటిమూడవ యక్షరములతోఁ బాటువానితుదల రెండవనాల్గవవర్ణముల కూర్పును [ఉ. కచ్ఛము వృచ్ఛము] రేఫమునకుఁ గ్రిందను లేక క్రిందుమీదులను వానికి సరియైన యక్షరముల కూటమియు [ఉ- అర్కుఁడు వక్త్రము] సమానాక్షరము లొకదాని క్రింద నొకటి కూడుటయు [ఉ-విత్తము చిత్తము] టవర్గమునఁ దలి మొదటి నాలుగువర్ణములును శ ష లు ను బ్రయోగించినచో నోజోగుణము గన్పట్టును. ఇచట దీర్ఘసమాసములే విలసిల్లును. ఇందు గుంఫము లేక రచనవికటము లేక యుద్ధతముగాఁ జెలువారును. ఎచట శబ్దములుగాని సమాసముగాని రచనగాని వినినంతనే మానసమున కింపుసింపునో యచటఁ బ్రసాదగుణము వెలుంగును. కావుననే సంఘటనాదులు గుణపరతంత్రములై చెలంగును.

ఐనను గొన్నిచోట్ల వక్తృవాచ్య ప్రబంధముల నౌచిత్యము ననుసరించి రచనాసమాసవర్ణములు వేరువిధముగఁ జరించును. ఎట్లన నాఖ్యాయిక శృంగారరసమయముగానున్నను దానిలో మసృణవర్ణములు మొదలైనవి కానరావు. రౌద్రరసభూయిష్ఠమైనను కథలో దీర్ఘసమాసములుగాని వికటాక్షర సంఘటనముగాని కన్పట్టదు. ఇటులనే నాటకాదులఁగూడ రౌద్రము మేరమీరినను దీర్ఘవృత్తు లత్యంతముగ నుండవు. ఈ రీతిగా నితరములుఁగూడ ఔచిత్యము ననుసరించి మెలఁగును. అందువలననే శృంగారరసమున కొన్నిచోట్ల సమాసప్రాచుర్యమును వీరాదుల నసమాసరచనయుఁ గానవచ్చును.

క॥ అందాకఁ గందళించున్
సుందరులకు విభ్రమములు సురతంబుననిం
కెందాక నిమీలనమున్
జెందవునీలోత్పలంపు సిరిగలకన్నుల్

గీ॥ అలమృణాళము తర్కపేశలము గాదు
చాలపరుషము సరసిజమాల సుమ్ము
మానినీ! నీదుమేని కోమలతకింక
పల్లవంబులకథ నొక్కపలుక నేల?

క॥ ముదితా! వస్త్రాంచలమున
వదనంబుస్పృశించు సూర్యువారింపకుమా
పదపడి దరవికచాబ్జము
వదనంబీరెంటిచవుల వాసినెఱుంగున్

గీ॥ నెయ్యపుంగిన్క నురిత్రాడు; నెత్తమాడ
విత్తముల్; గేళిదూలినవేళ సురటి;
లేలకొట్టాటc బూబాన్పులీలవెలcగు
ముగుదపై చీర నాభాగ్యమునలభించె

గీ॥ స్వర్ణధరణీధరంపు సర్వస్వమెల్ల
తస్కరించిన స్తనములcదాపcజెల్లc
బూన్కి మానుధానిధిగెల్చి పొల్పెసంగు
మోమునకు మేలిమును గేల? ముద్దుగుమ్మ

ఈ పద్యములలో మొదటి రెండింటను మాధుర్య వ్యంజకములైన వర్ణములు గానవచ్చును. కాని కడపటి వానిలో ప్రాయికముగనోజోగుణప్రధానములైన యక్షరములే మిక్కుటముగా నున్నను, మొత్తమున పద్యములలోని భావము శృంగార రసోద్దీపకమగుటచే బద్యముల నన్నింటను మాధుర్యగుణమే వెలుంగును.

గీ॥ అలసుధాంశున కెడయైన యామినివలె
వలపుకానికి వెలియైన బాలలీల
త్యాగమే లేనివాని భాగ్యంబుపగిది
నీరసంబగు కవితరాణింపcబోదు

గీ॥ నూదిమొనమోపహారివమా! సుఖతరముగ
ననుcగుప్రియురాలిచందోయి నలరుచుంటి!
మరునిబాణశతంబులు మర్మములను!
జించనన్నామె కలనైనcగాంచదేల

ఇందు ప్రసాదగుణముగానవచ్చును. ఇటులనే నోజో గుణమునకుcగూడ గాననగును.

మాధుర్యాదిగుణ వ్యంజకములుగా సూచింపఁబడిన యక్షరముల నేర్పులేక యెన్నికవలన ననుప్రాసముసంభ వించుననియు, దీనిమూలముననే యుపనాగరికాదివృత్తు లేర్ప డెననియు బూర్వులువచించిరి. ఈవర్ణముల యొప్పువలని పొంకముననే వైదర్భ్యాదిరీతులు పుట్టువాండెననియు, వాని వలననే చదువరుల మనముల నొకానొకవిధమైన సొంపు నింపు తలంపులు మొలకలెత్తుననియు వారు నుడువుదురు. దీనిని సమ్మతింపక పదముల కూర్పువలన రీతులు జనించె ననియు, శబ్దముల పొందికవలని బింకముననే కైశిక్యాది వృత్తు లుదయించెననియు, వానికతముననే సహృదయుల హృదయ ములఁ జెప్పఁ దరముగాని మోదమొసవించు భావములు రేకులెత్తుననియునవీనులు పలికిరి. రసాదులకనుగతమైన ప్రకృష్ట మైన యాసములేక న్యాసమే యనుప్రాసము. ఈయనుప్రాసము వ్యంజనసాదృశ్య మనఁగా వర్ణసామ్యముపై నాధారపడియుం డును. స్వరసాదృశ్యము రసానుగతమును కాదు కావున సహృ దయ హృదయావర్జకమది కానేరదు. ఇది ఛేకానుప్రాసము వృత్త్యనుప్రాసమని రెండువిధములు. ఇచట ఛేకమన విదగ్ధ మనియు నియతవర్ణగతమైన రసవిషయ వ్యాపారమే వృత్తి యనియు నిర్వచనము. ఎచట ననేకాక్షరము లొకటిరెండు మారులే వచ్చునో యచట ఛేకానుప్రాసమును, ఎచట నొకటి గాని రెండుగాని వర్ణములు మూఁడు లేక నాలుగుసారు లుప యోగింపఁబడునో యచట వృత్త్యనుప్రాసమనియు వచింతురు. ఈ వృత్త్యనుప్రాసమే మాధుర్య వ్యంజకములతో నిండినచో

నుపనాగరికవృత్తియనియు, నోజోవర్ణములతోఁ గూడినచోఁ బరుషవృత్తియనియు, మిగిలిన యక్షరములతోఁ గలసినచోఁ గోమలవృత్తియనియుఁ జెప్పిరి. ఈ కడపటిదానినే కొందఱు గ్రామ్యవృత్తిగా బల్కుదురు. ఏలయనఁ బ్రధానవ్యంజకములతిశయ శాంతిరహితములై గ్రామ్యస్త్రీగామ్యమునఁ జెలంగుటచే దీనికీపేరు గల్గెను. ఈ మూఁడువృత్తులనే కొందరు వైదర్భీ గౌడీయా పాంచాలీరీతులుగా వ్యవహరింతురు. ఎచట తాత్పర్యమునమాత్రమే భేదము గానవచ్చునో యచట లాటానుప్రాసము. ఇది లాటదేశపు జనులచే మిక్కుటముగ నుపయోగింపఁబడుటచే దీనికీపేరు వచ్చెను. కొందఱు దీనినే పదానుప్రాసమందురు. ఈ లాటానుప్రాసమునందలి ప్రభేదములను, యమకాదిశబ్దాలంకారములవిభేదములను, గ్రంథవిస్తరభయమునఁ బవరింపలేదు. ఇచట రీతివృత్తులకుఁ గొన్నిటికి దృష్టాంతముల నొసంగెదము.

### వైదర్భీరీతి

సీ॥ కోరివెదకినమీఁదఁ జేకూరునదియు ౨౪౪
పెనగులాడంగ బల్మిచుంబితము నైన
యాప్రియాధరమొక్కటే యైనదాన
వేరువేరురసంబులు వెడలుచుండు

సీ॥ సురతరసరభసకచగ్రహాలులితలలి
తాలకావల్లరీ గళితంబులగుచు

నెలతధమ్మిల్ల మల్లికానికర మెల్ల
కౌలము౯ నీయురంబున వ్రాలఁగాత

మొదటిపద్యము సమాసరహితమును రెండవదిసమాస సహితమునై చెలంగుచున్నది. వైదర్భిరీతి సమాసము లేకయే తరుచుగాఁ గన్పట్టును. కాని సమాసమున్న నది సుగమమై రసోద్దీపకమై మెలంగినచో దానినిగూడ వైదర్భి రీతిగనే వచింతురు.

పాంచాలీరీతి

279 గీ॥ హరిణనేత్రి! తరంగముల్ పొరలనిమ్ము
లోచనములబ్జగర్వ విమోచనముల
సుందరి! కళిందనందినిన్జూచి తవీచి
డంబరగభీరమగునప్పు డంబరంబు

గీ॥ ఘోరరణసీమ బహుళసింధూరలిప్త
వైరిరాజేంద్రగజకుంభ పాళివోలె
కుంకుమారుణమగు ప్రియాకుచయుగంబు
వీరదృష్టులరమియింప వెరవెఱుఁగదు

ఛేకానుప్రాసము

గీ॥ సైచఁగారాని మందువేసంగి రేల
గొండొరులనిండుకౌఁగిట- బండినట్టి
సాంద్రహరిచందనంపు పంకచర్చయేని
కామిమిథునసంతాపంబు గడపలేదు

వృత్త్యనుప్రాసము

కll వలదు వలదింక విసరన్
లలిఁదామరపాకు వీవనలచే నాకుజా
పలుమరు వీచిన రగులుచుఁ
జెలియా! యెదలోని చిచ్చు చెలరేగును మీా

గీll రతులఁదరుణుల నూపుర రణితమట్లు
కేకిలావుక చాతక కోకిలముల
మధుర గీతులం కాముక మానసముల
నపహరించెడు నైపుణి నరయఁగలవె

లాటానుప్రాసము లేక పదానుప్రాసము.

గీll వలపుఁ బ్రియురాలిఁ బాసినవాని కెన్నఁ
దుహినదీధితియే దవదహనమరయ
వలపు బ్రియురాలిఁ బాయనివాని కెన్నఁ
దుహినదీధితియే దవదహనమరయ

౨౭౫

---

# న వ మ స మ ము

---

అలంకార స్వరూప నిరూపణ మొనరించునపుడు గూడ ప్రాచీనార్వాచీనాచార్య వర్యులకు భిన్నాభిప్రాయములు నెలరేగెను. సౌందర్య సంపాదకమే యలంకారమని కొందఱు పలికిరి. ఉత్కర్షాహేతుభూతమని మఱికొందఱు నుడివిరి. చారు

త్వాతిశయోక్తిసంధాయకమని వేఱొక కొందఱు వచించిరి. విచ్ఛి
త్తివిశేష విలసనము లేక వైదగ్ధ్య భంగీభణితిప్రకారమని మఱి
కొందఱునుడివిరి. శోభావహము లేక రామణీయకతాపాదకమని
వేరొకకొందఱాడిరి; ఇట్టులనేకవిధములనేకాలంకారికులువారి
వారి ప్రతిభానుసారముగ నలంకారమునకు సామాన్య లక్ష
ణము ననుసరించి ఎవరెట్లు విధించిన నీలక్షణము లన్నియు
నందఱుం గూర్చునవియే యలంకారము లను భావమును వెలి
బుచ్చుచున్నవి. అలంకారములు ప్రథమమున పరిమితముగా
గన్పట్టినను, కవిబ్రహ్మల కల్పనా కౌశలమున నవి కాలక్ర
మమున నంతును బంతును లేక శతాధిక సంఖ్యాసముపేత
ములై విలసిల్లెను. ఈ యలంకారముల ప్రత్యేకతను గురిం
చియు, వాని వేర్వేరు విభాగములం గూర్చియు, స్వతంత్ర
గ్రంథము లెన్నియో పుట్టువోందెను. గ్రంథవిస్తర భయమున
నాయా యలంకారముల విభేదముల నిట విమర్శింపలేదు.
వివరముల నెఱుంగ గోరువారు వాని నలంకార చంద్రిక
యను మాప్రచురింపబోవు గ్రంథమందుం గాంచగలరు. ఆ
గ్రంథమునందీ యలంకార సంపూర్ణ చరిత్రమును జదువరులు
దిలకింపగలరు.

ఇంక ప్రాచీనులలో నవీనుడును, నవీనులలో ప్రాచీ
నుడునుగాం జెలంగి, యత్యల్పముగను, నత్యధికముగను గాక
మధ్యసంఖ్యాకములుగ నలంకారముల నంగీకరించి గణుతి
గాంచిన కావ్యప్రకాశకారుని మతానుసారముగ వాని నిట

సంగ్రహముగ బ్రదర్శించెదము. సర్వాలంకార గణనా ప్రసంగమున నాద్యమై వెలుంగుచు, కావ్యవిబుధోద్యానమునకుం గల్పాగమమై చెలంగుచు, వాణీరమణీహారనాయకమణియై వెలుంగుచు, ననుపమాన ప్రభల సహృదయుల కనుల మిరుమిట్లు గొల్పుచు, నుపమాలంకారము సెలువారుచుండును. ఇచట నాయా యలంకారములకు లక్షణమును, లక్ష్యముల నొసంగుచు, సందర్భాను సారముగ నితరపక్షముల గూడనించించుక చవిగొనం దలంచువారల కనుకూలించునట్లు, వాని లక్ష్యములలోఁ గొన్నిటినిఁ గూడ నుదహరింతుము.

ఉపమానోపమేయముల రెండుఁ బోలిక పొలుపొందుచు, చతురుల డెందముల సొంపులు ముంపుచుండునో దాని నుపమాలంకార మందురు. దీనినే సాధర్మ్యమని పలుకుదురు. అనఁగా సమానధర్మ సంబంధము గల్గి యుపమానోపమేయములు సెలువొందునని భావము. ఉపమానము, నుపమేయము, సాధారణధర్మము, నుపమావాచకములను నాలుగవయవములతో నిది సెలంగును. ఎచట నాలుగును గన్పట్టునో యచటఁ "బూర్ణోపమ" యనియు నొకటిగాని రెండుగాని లేక మూడుగాని లోపించినచో దానిని "లుప్తోపమ" యనియు వచింతురు. ఈ రెంటిలోఁ బూర్ణోపమ యారురీతులుగను, లుప్తోపమ యేడు తెఱగులుగను గానవచ్చును. ఈ లుప్తోపమ మఱల పదియు తొమ్మిది

ప్రభేదము లై రెండును గూడి మొత్త మిరువదియైదు విభే
దము లని యుపమాలంకారము వెలుంగును.

285 క॥ సముదిత రాగమనస్కృత
రమణీమణి గండపాండురంబగు మేనన్
గుముదవధూనాథుండా
ప్రమదా! మాహేంద్ర దిక్కుపై వెలుఁగొందున్॥

ఇచట గండపాండురమనుటచే నిది సమాసఘటితము.

గీ॥ చిత్తమిల సుఖదుఃఖ వశీకృతముగ
నెవరికిఁ జెలంగువారల కెల్లవేళ
దినములు నిశలగు నిశలు దినములగును
సవిత విధుఁడగు విధుఁడును సవితృఁడగును॥

ఇచట ధర్మోపమావాచకములు లోపించెను.

క॥ పలుమరు దిరిగిన గంటక
కలితంబగు కేతకిన్ సుఖంబు రవంతే
ని, లభింపదు; మాలతితోఁ
దులఁదూగు సుమంబు మధుప! దొరకదు సుమ్మీ॥

ఇందు ధర్మోపమానలోపములు గానవచ్చును.

గీ॥ వెన్నెలంబోలె కందోయి విందుసేయుఁ
గల్లుకైవడి నొడలికిఁ గైపుఁ గూర్చు

ప్రభుతరీతి నితంబినీరత్నమెల్ల
జగము కైవస మొనరింపఁ జాలుఁగాదె॥

ఒక్కదానిని పెక్కింటితోఁ బోల్చుటచే నిది మాలోపమ.

గీ॥ జాముకైవడి దివసంబు చనియె; దినము
చాయ మాసము; మాసంబు సరణి వత్స
రమ్మె, వర్షమువలె జవ్వనమ్మె; జవ్వ
నమ్మె మాదిరిగా జీవితమ్మె జగతి॥

ఇచటఁగూడ మాలోపమయే చెలఁగును.

క॥ స్మరుచేయౌవనరేఖయు
ఖరకరుచే గగనతలము కమనీయరసో
ద్ధురతఁ గావ్యము, నీచే
ధరణీవలయంబు శోభఁదాల్చు మహాత్మా

గీ॥ బుద్ధి శ్రుతమున వ్యసనాన మూర్ఖతయును
జలముచే నది చంద్రునివలన రాత్రి
మదముచే నారి ధృతియుసమాధిచేత
వినయమున నరేంద్రతయుశోభించుచుండు

కొందఱిమతమున నిందు మాలోపమయు మఱికొందఱిమతమున నీపద్యములలో దీపకాలంకారమును జెలంగును.

గీ॥ మతివిధంబున మూర్తియు మధురమయము
మూర్తికైవడి శుభయుసమ్మోదదాయ

కన్నులె శఫరీతిజ లక్ష్మి ఘనతఁ గాంచె
నాతి! నిమిషఁజాలు భూనేత గలఁడె?

మొదట నుపమేయములుగా నున్నవి పిదప నుపమాన ములగుటవలన దీనిని రశనోపమగా వచింతురు.

క॥ శరదిందు సుందరాస్యయు
సరసిజ దళదీర్ఘనయన చక్రిస్తనియుఁ
దరుణీమణి నామనముఁ
గరుణవహింపక దహింపఁ గారణమేమో?

ఇచట నుపమావాచకము లోపించెను.

గీ॥ సాటిలేని నీసెమ్మెను నీటుదలచి
యేలరా! చంద్ర! నీవిప్పు డెగిరిపడెదు
భువనమండలమెల్ల నో మూఢ! యెవఁడు
వినికి వేసారి పలుమారు వెతకెఁ జెప్పుమ.

ఇచట 'మూఢ' పదమువలని స్వారస్యమునఁ జమత్కార మతిశయించి యుపమానము ప్రతీయమానమగుచున్నది. ఇంక నీపద్యమునందలి మొదటిపాదమునఁ 'దలచి' యనుటకుబదులు 'కాంచి' యనియు మూడవపాదమునకు మారుగా "నీభువనమండలంబెల్ల నెవ్వఁడివు" డనియుఁ జదివినచో వక్త్రగతమైన చంద్రవిషయాక్షేపరూపమైన యసూయ కలదో లేదో చదువరులే నిశ్చయింతురుగాక!

ఇతరోపమానముతో సంబంధము లేకుండుటయే “యనన్వయము.”

క॥ గగనము గగనాకారం
బొగి సాగరమెంచ సాగరోపమమేయౌఁ
దగు రామరావణులవలె
జగతీస్థలి వారి ఘోర సమరము గాంచిలున్.

క॥ జలముల విధంబున జలముల్
గలువల చెలికానిరీతిఁ గలువలఱేఁడున్
జలజాబ్ధులవలె జలజం
బులు శారదవేళఁ జాల పొలుపారు ధరన్.

ఈపద్యములలో నాయావస్తువుల కాయావస్తువులే యుపమానములు.

ఉపమానోపమేయముల పరివృత్తి లేక విపర్యాసమే “యుపమేయోపమాలంకారము”

గీ॥ జలమువలె నభము నభమువలె జలమ్ము
నంచవలె నెల నెలరీతినంచ వెలుఁగు
శారదను కుముదాకృతి తారకములు
తారకాకారమునఁ గుముదములు వెలుఁగు

క॥ సిరివలె మతియున్ మతివలె
సిరియున్ విభవము విధానధృతియున్ ధృతిగా

దిరి గావిభవంబును నీ
ధరణీతల సాధునకును దనరారుఁజుమీ.

ఈపద్యములలో నుపమానమున కుపమేయమును నుపమేయమునకు నుపమానమును దమకుఁ దామెుండొంటికి పరిసాటివచ్చుచున్నవి.

ఉపమానమువలననే పరిష్కృతమునులేక యుపమేయమును సంభావించినచో "నుత్ప్రేక్షాలంకారము"

క॥ చెక్కులు తామెుండొరులను
వక్కువ మీఁరంగఁగాంచి మనసోచమటం
చెక్కుడు దూరపిల్లుననఁ
జిక్కుచు సుక్కుచు పతంబు చింతిలునకటా!

ఇచటఁ గ్రియాభావ ముత్ప్రేక్షాలంకారముగఁ గానవచ్చును.

౩౨౦ గీ॥ పాలుపుగా మేనఁజీకటి పూసెననఁగ
గొప్పగా మిన్ను కాటుకఁ గురిసెననఁగ
క్షితితలంబునఁ జెనటుల సేవవోలెఁ
జూపు నిష్ఫలమయ్యె నోసుందరాంగి.

ఇచటఁ బూర్వార్థమున స్వరూపోత్ప్రేక్షయు నుత్తరార్థమున నుపమాలంకారమును గన్పట్టును. కావునదీని నర్థాలంకార సంసృష్టిగాఁ గొందఱంగీకరింతురు.

క॥ వనిత చనుంగవఁ గన్గొం
తిసె యూవకులు బ్రిమసి సొగసి తలలూతురు సం

దునఁ జిక్కుకొన్న చూపుల
పెనకువతో నూపి యూడఁబెరికెడు లీలన్.

ఇది ఫలోత్ప్రేక్ష కుదాహరణము.

గీ॥ చందనాసక్త భుజగ నిశ్వాస మారు
తాహతిని మూర్ఛితములయి తనరుచున్న
మలయవాయువులీ మధుమాసములను
జెలఁగి పాంథుల ప్రబల మూర్ఛితులఁజేయు.

ఇచట నుత్ప్రేక్ష యనుక్తమై వెలంగుచున్నను వాక్యార్థమూలమున వ్యక్తమగుటచే దీని నుత్ప్రేక్షాధ్వనిగాఁ బల్కుదురు.

గీ॥ గట్టుఁజేరి తిమింగిల ఘట్టనములఁ
జిందులందొ్రక్కు పురవిలాసినులఁగాంచి
కఱడుగట్టిన నురుగుల కైతవమున
పక్కుమని నవ్వునటు తామ్రపర్ణి వెలయు.

దీనిని సాపహ్నవోత్ప్రేక్షగాఁ బేర్కొందురు.

గీ॥ పంచబాణుండు యాత్రకు బయలుదేర
శంఖనాదముల్ మ్రోసెడిసంగిఁ దరుణి!
మంజుగుంజారవంబుల మధుపకులము
మల్లెమొగ్గలమీదను నుల్లసిల్లు,

ఈపద్యమునం దుత్ప్రేక్షాలంకారము కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధమై వస్తువ్యంజకమై వెలుగొందుచున్నది.

అప్రస్తుతమునందు లేక యుపమానమునందు సందియముదయించుటవలన నెచట నుపమేయమునకు సొంపుజనించునో యచట "సందేహాలంకారము"

గీ॥ ఇందుబింబమొ హరిణాంకమేమి యయ్యొ
వికచపద్మమొ నీర మెవ్వీధిగతించె
లలిత సవిలాసవచనల మెలగుచుంటఁ
గలువకంటి మొగంబని తలపనగును.

గీ॥ లలనా! కుచకటిభారము
కలిమిఁ బీడింపఁబడెడు కానఁ గనవా
కలమదిలో సందేహము
'కలదా లేదాయటంచు' గలుగకయున్నే?

గీ॥ [illegible]ఁడో, సురేత్రనాథుఁడో, పావకుండో,
బలియొ, కర్ణుఁడో, శిబిచక్రవర్తియో, య
టంచు నినుగాంచి ప్రత్యర్థు లర్థులెల్ల
చిత్తవీధి వికల్పన సేయుచుండ్రు.

ఇచట మొదటిపద్యమునఁ దొలుత సందేహముగలిగి తుదకు నిశ్చయ మొదవెను. రెండవదానియందు మొదటి దానిలోవలె సందియము డిందుపడలేదు. ఇఁక మూడవపద్యమున సంశయము సంకీర్ణరూపమునఁ జెలంగుచున్నది.

ఉపమానోపమేయములకు భేదము లేకున్నచో
"రూపకము"

గీ॥ ఇంక్రీడప్రసిద్ధః నీబాహు లెంచిచూడ
జయరమాద్వారతోరణస్తంభయుగళి
ఖడ్గము కృతాంతరసనయైక్రాలు; నీదు
రసన శారదయేసుమీ! రాజరాజ!

ఇందు రూపక మనేకవిషయమై చెలంగుచున్నది.

క॥ అలికుల కబరీ భరయై
జలజాననయై మనోజ్ఞ చక్రస్తనియై
లలితమరాళాంశుకయై
నిల్చెను వాపీవిలాసినీమణి గనుమా

ఇది యుభయావయవరూపకము.

గీ॥ తలపఁ ద్రైలోక్య మండప స్తంభములగు
శార్ఙ్గకోదండ గుణకర్కశంబులైన
నీలనీరదదేహు విశాలబాహు
లెలమిఁ గాపాడుఁగాత మిమ్ములనతమ్ము.

ఇచట నశ్లిష్టశబ్దనిబంధనమై కేవలరూపకము గాన వచ్చును.

గీ॥ చూపులను వెన్నెలంబోలె సుఖమునించి
మెడను జలజమాలికవోలె మేలొసంగి

మదికి రసభావనవిధాన ముసముగూర్చి
మరపునకు రాకయుండెసుమా లతాంగి

ఇది నిరవయవమాలారూపకము.

గీ॥ తప్పు చేసినదాసుఁడో మెప్పులాడి!
దోఁ లబిడ్డల కాలితన్నులకుఁదగును
చిరుసుఁబులకల గురుతుల కలుషముండ్ల
తావల నీకాలుకందెనో యనుచువగతు.

ఇది నిరవయవ కేవల రూపకము.

క॥ హరిఁజేరుచు నేనాపెను
చిరునగవుల కౌనుకలను జెల్లించితి; నా
తరుణీమణియుఁ దనధర
పరిరంభణమిచ్చె ద్యూతపణముగ నాకున్.

ఇది మమ్మటాచార్యుని మతమున రూపకాంతర్భావము. కాని నవీనులు దీనిని బరిణామాలంకారముగా సంగీకరించిరి.

ప్రకృతమును లేక యుపమేయమును ద్రోసి
పుచ్చి లేక కప్పివెట్టి వేరొకదానిని లేక యుప
మానమును సత్యమని స్థాపించినచో నది
"నపహ్నవాలంకారము"

క॥ ఇదికాదు తోటిమాటికి
మదమూనఁ గై పెక్కి చేయు మధుపారావం

బడుగో మదనుఁడు విలుగొని
ముదమున సారించునారి మ్రోతలు వినుమా.

క॥ ఇది హేమంతసమయమంచున్
వదరెదవా రెవరొ? సతులఁ బతులన్ గూర్పన్
బెదరింపఁగఁ జేదాల్చిన
మదనుని చక్రీబాణమ్ము మాపనిది సుమా.

గీ॥ మాలతిన్ బాసి జీవింప మనసు గొనక
చంచరీకము చితిఁదగ్ధ మొందుచుండె
నుద్దియా! నీవుపల్కిన సుద్దినిజము
గాదు; కింశుకసుమమును గనియెఁజేసె.

ఇందు మొదటిపద్యమున నప్రకృతమున ప్రకృతము యొక్క యపలాపము గానవచ్చును. రెండవపద్యమున మొదట నపహ్నవమును బిదప నారోపమును, మూడవదానిలోఁ దొలుత నారోపమును వెనుక నపహ్నవమును గానవచ్చును.

ఏకార్థమును వెలిఁబుచ్చు పదములకు వాక్య
మందెచట ననేకార్థములు గన్పట్టునో యచట
“శ్లేషాలంకారము”

గీ॥ అహహ! నీదృష్టి కృష్ణార్జునానురక్త
యైన కర్ణావలంబినియౌచుఁ జెలఁగ
వలపుఁ బ్రియురాల! చెప్పు మెవ్వానిచేతఁ
బుడమి విశ్వాసపాత్రతఁ బొందఁగలదొ.

ఇచటఁ ‘కృష్ణ’ యనఁగా నలుపురంగును గృష్ణుఁడును, ‘అర్జున’ యనఁగాఁ దెలుపురంగును నర్జునుఁడును ‘కర్ణావలంబిని’

యనఁగాఁ గనులు వెడల్పును నిడుపునుగలిగి చెవులవఱకువ్యా
పించినవనియుఁ గర్ణుని నాశ్రయించినవనియుఁ దాత్పర్యము.
కావున నిచట శ్లేషాలంకారము. ఇచట కర్ణార్జునుల కిరువుర
కును విరోధము సుప్రసిద్ధము. ఒకరిని జెట్టబట్టిన వారింకొకరిఁ
గూడియుండుట సంభవింపదు. అందుచే నీపదములలోని శ్లేషను
విరోధమునకు రంగమై విలసిల్లుచున్నది.

౨౧౮ క॥ ఉన్నతమును గాలాగురు
సన్నుతమును లీలఁ బ్రోల్లసద్ధారాసం
పన్నమును బయోధర భర
మెన్నఁగ నెవ్వనికి మోదమొనరదు తరుణీ!

ఇచట నున్నతమనఁగా గొప్పదియు నెత్తయినదని
యును, కాలాగురుసన్నుతమనఁగాఁ గాలాగురువలె నల్లని
వనియు కాలాగురుపూతచే నల్లనైనవనియు, ప్రోల్లసద్ధారయ
నఁగా నెడతెగని స్వచ్ఛమైన ధారలనియు నెడతెగక
ప్రకాశించు మంచిహారములనియు, నిట్టుల వెలుఁగొందుచున్నట్టి
పయోధరభరమనఁగా మేఘముల సమూహమనియు కుచ
ములభారమనియు శ్లేషమూలకమై యర్థము వచ్చెను.
కావున నిది శ్లేషాలంకారము. మఱియు నీపద్యము శబ్దశక్తి
మూలమైన యనురణనధ్వనికిఁగూడ లక్ష్యముగాఁ జెల్లఁగును.
ఇందుపమాలంకారవ్యంగ్యము ప్రకాశించుచున్నది.

గీ॥ కాంచె మల్లద రాజు రాగావృతుండు
సుందరకరాభివృష్టుఁడై సొంపుమల్ల

నిల్లి శ్యామాముఖం బల్లనల్ల నిపుడు
చుంబనము సేయుచున్నాఁడు సొగసులాడి!

ఈ పద్యమునందు రాజనఁగా చంద్రుఁడనియు రాజనియు, కరమనఁగా కిరణమనియు హస్తమనియు, శ్యామాముఖ మనఁగా సంజచీకటియనియు జవరాలి మోమనియు, చుంబన మనఁగాఁ బ్రాకుటయనియు ముద్దుగొనుటనియు, వేర్వే రర్థములు గలవు. కాన నిది శ్లేషాలంకారము - మొదటి పాదమును మార్చి “కాంతమమా చంద్రుఁడనురాగాన్వితుం డై” చదివినచో సమాసోక్త్యలంకారమని నిర్వివాదముగఁ జెప్పవచ్చును.

శ్లిష్ట విశేషణముల మహిమవలనఁ బ్రకృతార్థ ప్రతిపాదకమైన వాక్యమునం దప్రకృతార్థము గూడ సంక్షేపముగఁ జూచింపఁబడినచో సమాసోక్త్యలంకారము

క॥ అనురాగవతిని సంధ్యను
దినవాథుఁడు వెంటనంటితిరిగిన నేమే
మనసగు దైవవిచిత్రము
వనుపడమ సమాగమంపు భాగ్యంబకటా! రే॥ం

ఈ పద్యమును గొందఱు సమాసోక్తిగను మఱికొంద ఱాక్షేపముగను గైకొనిరి. ఇంక నొక కొందఱు దీనియందుఁ గల సమాసోక్తి విశేషోక్తి కంగముగా నంగీకరింతురు.

౩౬౫ గీ॥ చలిత తారకౌకళిత నిశాముఖంబు
నధిక తరరాగమునఁ జందురుఁడాక్రమింప
రాగమున సమస్తము పురోభాగసీమ
గళిత తిమిరాంశుకము నామె కాంచకుండె.

ఇందు విరావేతుముగ సమాసోక్త్యలంకారముగలదు.

గీ॥ ఈమనోరమ, తన్వీలలామ, బాల,
పుష్పహాసిని, పుష్పాంగి, పుష్పనేత్రి
తరుణశేఖర! నిన్ను సందర్శనంబు
చేసినంత వికాసము నొందెనమ్మ.

కొందఱి మతమున ననుసరించినచో నీపద్యమున సమాసోక్తి గలదు. కాని దీనిని సమ్మతింపక నవీనులిందు వ్యంగ్యరూపకమని పలుకుటయే సముచితమని వచింతురు.

గీ॥ పాణిపల్లవశోభావిభాసి, దంత
కాంతిసుమపంక్తిసంయుత, కబరికాభ
రాలిబృంద సువేషయై హరిణనేత్రి
డెందమానంద పరవశ మొందఁజేసె.

ఈ పద్యమున సమాసోక్త్యలంకారము చెలంగునందురు. కాని యీ మూఁడవపాదమున సుశ్లేషయై యుండుటకు మారుగా పరికల్పితయై యుండి చక్కనచో సమాసోక్త్యుపమాపేక్ష సంకరమైయున్నది. అందుచే దీనినిసమాసోక్తిగా గ్రహించుటకన్న నేకదేశవివర్తియైన యుపమగా నంగీకరించుటయే మేలని నవీనుల మతము.

గీ॥ అధిప! నీయాగ్రహము హాలాహలసమంబు
భూప! నీయనుకంప సుధోపమంబు
చంద్రసదృశంబు నీయశంబు నృపతి!
భటులు మకరోద్భటులు సుమా వసుమతీశ!

ఇది యౌపమ్యగర్భ విశేషణోత్థాపితమైన సమాసోక్తిగాఁ బ్రాచీనులందురు. వారి పలుకులు విచారసహములుగావని నవీనులాడుదురు.

గీ॥ మలినమూర్తివి, చాంచల్యమతి, వనల్ప
జల్పకుఁడవైన, నినుఁగాంచి సంతసంబు
పూర్ణరాగిణి, పరసయు, ఫుల్లవదన,
యగు సరోజిని విడువగాఁదగునె మధుప. [illegible]

ఇచటసమాసోక్తియని కొందఱు నప్రస్తుత ప్రశంసనగాఁ గొందఱును బల్కుదురు. సమాసోక్త్యలంకారమునం దప్రస్తుత వృత్తాంత సమారోపముగూడ చారుతాతిశయ సంపాదకమని చిరంతనాచార్యుల చిరతరాభిలాషమై చెలువారును.

౨౨౮ గీ॥ రామణీయక ప్రాతరారంభవేళ
రహిఁ గరస్పర్శ పూర్ణానురాగుఁడగుచు
ముద్రితానన పద్మినీ బోధసేయు
భాస్కరుఁడభ్యుదయమొంది ప్రబలుఁగాత!

అలంకార మతానుసారులీ పద్యమును సమాసోక్తికి లక్ష్యముగాను ధ్వనిమతావలంబకులు దీనిని గుణీభూతవ్యంగ్యముగను స్వీకరింతురు. ఈ పద్యమున వ్యంజనమాహాత్మ్యము ననే ప్రకృతవాక్యార్థమునందప్రకృతవాక్యార్థమనఁగా నాయికానాయకానుకూల వ్యాపారము స్ఫురించుటచే గుణీభూతవ్యంగ్యమనుటయే రమణీయతరమును సహృదయ సమ్మతమునై వెలుంగును.

వస్తుసంబంధము లేనిచోట నుపమాపరికల్పనము నెలఁగినచో "నిదర్శనాలంకారము; మఱియుఁ గ్రియామూలకమనే స్వస్వరూప స్వకారణములకు సంబంధము సంఘటించినచో నదికూడ "నిదర్శనాలంకారమే"

గీ॥ ధూమముగా ఘనపటలము గ్రమ్మె మింట
దూరమునుండెఁ బ్రియురాలు చేరఁదగదు
కలవు దివ్యౌషధులు హిమాచలము మీఁదఁ
గొండపైఁ గోడెత్రాచుల గుంపులుండు.

ఇచట విశేషణమున విశేషము సాధింపఁబడెను.

గీ॥ అధికపదవిని బొందిన యల్పమతులు
మఱల వెంటనే క్రిందికిఁ దొరలుచుండ్రు
శైలశేఖరగతమైన బాలతృణము
చారుమారుతాహతిఁ గ్రింద జారిపడును.

ఇందుఁ గార్యకారణములకు నన్వయము గలిగి యుపమానోపమేయత్వమూలకమై వస్తుసంబంధరూపమగు నిదర్శనము గన్పట్టును.

గీ॥ ఎవఁడు భూమీతలంబునం దెల్లజనుల
బాధలం బెట్టి సుచిరసంపదల నొందు?
ననుచుఁ దెలుపునా దినమెల్ల నతిశయిల్లి
చరమగిరిశృంగమునఁ దివాకరుఁడు సేరు.

ఇచట బింబ ప్రతిబింబ భావమున నిదర్శనము చెలంగును.

గీ॥ కలచుఁ గువలయమాలికాంచితములను
చెలువ కుటిలకటాక్ష విక్షేపతతులు
మోముల కళానిధి విలాసమున్ హరించు
బాలకెమ్మోవి కిసలయ శ్రీల నేలు.

ఇందు నిదర్శన మసంభవవస్తుమూలకమై వెలుంగును.

క॥ నెట్టనఁ బాడఱిపోయెను
బుట్టువ భవభోగలోభమున నాశధరన్

జెట్టుగ చింతామణినిన్
గట్టా! వెలబోతిఁ జిల్లిగవ్వకు నేనున్.

ఈపద్యమున ననేకవాక్యగతమై యసంభవవస్తు నిదర్శనమున్నది.

క॥ మరుకేళిఁ దాముగోరిన
తెరవల కెమ్మోవిరుచుల తియ్యఁదనంబున్
ధరణిన్ ద్రాక్షారసమున
సరసాగ్రేసరులు మఱచుఁ జవి గాంతురనుమా!

ఇచటఁ బ్రకృతమైన యధరమధురిమ ద్రాక్షారసము నందసంభవమైనను వెనుకటిపద్యమునందుఁ బోలెనే సామ్యమును బొందును.

ప్రస్తుతమును జెట్టబట్టి ప్రస్తుతముగాని దానిని
వర్ణించినచో "అప్రస్తుత ప్రశంసాలంకారము"

గీ॥ మొలకమొగ్గలను రువులు గులుకు ముద్దు
కూనఁ నవమాలికకుఁ జింతగూర్చ నేల?
యెక్కడో క్రొక్కాడు నొత్తుడు లెల్లసెచు
పూవుఁదీవలతోఁ గూడఁబొమ్మ తేటి!

కొండఱీపద్యమున నప్రస్తుత ప్రశంస గలదనియు మఱికొందఱిందుఁ బ్రస్తుతాంకురము గలదనియుఁ బల్కుదురు. ప్రౌఢాంగనలెందరో కానవచ్చుచున్నను వారిని

విడనాడి శాలికామునిని బొందఁ గోరు కాముకుని, నెఱజాణ యొకతె గేలిసేయుచుఁ దనపాతివ్రత్యమును బ్రకటించుకొను చున్నది. ప్రకృతి భృంగోపాలంభన మీభావమునకుఁ బ్రతీతి గలిగించుటచే నప్రస్తుతప్రశంస గానవచ్చును.

క॥ తన్నినవెంట తటాలున
వెన్నంటుచు పైకిలేచి వెడవెడఁ దలపైఁ
దన్నెడు మన్మే మేలగు
మిన్నక నోరెత్తకున్న వెంగలికన్నన్.

ఇచట విశేషము ప్రస్తుతముగా 'గానవచ్చినన' సామాన్యమభిహితమై చెలంగుటచే నప్రస్తుత ప్రశంసాలంకారము.

క॥ చందలువేలును డేగలు
చిందులుద్రొక్కెడిని కడుపుచిచ్చునఁ దలదా
పందగుసెలవు నభోవీ
థిందొరకదు పులుఁగున కిక దిక్కెవిధియే.

ఈపద్యమున సాదృశ్యమాత్రమూలమై, పులుఁగప్రస్తుతముగాఁ జెలఁగ నొకానొకనికిఁ జాలమంది శత్రువులుగల రను ప్రస్తుతము వ్యక్తమగుచున్నది.

గీ॥ సరసకల్హార సంస్పర్శ జనితశైత్య
మాంద్య సురభిళకానన మారుతములె

ధన్యతమములు సుమి! నిరాతంకముగను
రాము నిందీవరశ్యాముఁ బ్రేమఁ దాకు.

ఇచట వైధర్మ్యమూలకమైన ప్రస్తుతమునకుఁ బ్రతీతి కలదు.

క॥ కోకిలను నేను; నీవో
కాకివి మనకిద్దరకును కాలిమ సమమే
కోకో యంచుఁ గూయఁగ
లోకం బిర్వురను గురుతెఱుంగును జామీ.

ఇందుఁ గాకికోకిలలకు వాక్యరూపముగఁ బ్రస్తుతమధ్యారోపమై యెలంగుటచే నిట నసంభవమూలకమైనది కన్పట్టెను.

గీ॥ నేను మిక్కిలి నీచుఁడ నేయటంచు
కూపమా! ఖేదమిసుమంత కూడవలదు
దరిసెర సహృదయుఁడవు నీవగుట సత్యము
పరగుణగ్రాహుఁడవై వరలుచుందు

ఇచట శ్లేషమూలమున నప్రస్తుత ప్రశంస గలదు. శ్లిష్టవిశేషణములున్నను, దీని నసమాసోక్తి యనుటకు వీలు లేదని నవీను లందురు. 'మలినమూర్తివి చాంచల్యమతి వనల్పజల్పనుఁడ'వను పద్యము వోలెనే ప్రాచీనులు సమాసోక్తిగా దీని గణింతురు.

గీ॥ విధివశంబున వచ్చె నీ మధుకరుండు
కుటజమా! వీనిఁ బోఁగొట్టుకొనఁగ వలదు

మధురమకరందబిందు షట్పదములఁ బోదలు
నీరజంబులఁ జూచి మానసీయుఁ డితఁడు

ఇదికూడ శ్లిష్టవిశేషణసముపేతమైన యప్రస్తుత ప్రశంసాలంకారమే.

గీ॥ పాండుపర్ణయుఁ గంటకపరివృతయు నగు
నక్కటా! పరజన్మయుయై చెలఁగు
కేతకిం గాంచి సుంతయు రోతలేక
చంచరీకమ! యెట్లు సేవించెదోకో.

కొందఱీపద్యముఁ బ్రస్తుతాంకురమనియు, మఱికొంద ఱప్రస్తుత ప్రశంసాలంకారమనియుఁ జెప్పుదురు.

గీ॥ చిన్నికోకిలా! లేమావి గున్నఁగూడి
తేటపిండెంతకాలము నిట్లు లోలుక
దంతకాలము నీవు వనాంతరమున
నిలచి నిరసంపు దివసము ల్గడపుకొమ్మ.

ఈపద్యమునఁ బూర్వులు ప్రతివస్తూపమాలంకారమున్న దనియు నూతను లప్రస్తుత ప్రశంసాలంకారము గలదనియుఁ జెప్పెదరు.

ఉపమానముచేత నుపమేయమును దాచియుంచుట లేక కప్పివెట్టుటయే "యతిశయోక్త్యలంకారము"

గీ॥ సరసిజము సలభము లలోన, సరసిజమున
కైరవము, కైవయుండెనా కనకలతిక!
యదియు సుకుమార సుందర మకట! సఖుఁడ!
యిట్టియుత్పాత సంతతి కేమనందు.

ఇచట ముఖాదులు కమలాదిరూపమున నధ్యవసిత ములై కానవచ్చుటచే నిదిభేదమునఁ దతిశయోక్త్యలంకారము. నవీనులుకొందఱు దీనిని విభావనాలంకారముగా భావింతురు.

క॥ ఒడయారెయొయ్యారము వేరే
నుడికారము నడక సొంపులుగా వేరెసుమా!
జడుఁడు ప్రజాపతిదాని
పడతుక నేరీతిఁజేయ వశుఁడగుఁజెపుమా.

దీని నభేదమునందు భేదరూపకమైన యతిశయోక్తిగా గణింతురు. ఒయారము నుడికారములు నిజమున కొకటియే యైనను వేఱుగాఁ గవిచే నతిశయము కొఱకు కల్పింపఁబడెను. ఉత్తరార్ధమున సంబంధమునందు నసంబంధ మూలకముగా నతిశయోక్తిగలదు.

క॥ తోలుత విలాసినిమన ము
త్కలికా ఘంటలతఁజెంది తనరారె; పదం
పడి వకుళరసాలవనం
బులు నలుదెసఁ బసరుఁబూవ పొంగ్గులఁదొడిగెన్.

ఈపద్యమున కార్యకారణములు పౌర్వాపర్య విపర్యయ రూపమును జెందుటచే నతిశయోక్త్యలంకారభేదము గన్పట్టును.

క॥ వాలికనేఁ బొంగుచాయల
బాలామణి బాహుమూల పరిచిహ్నితమౌ
బాలేందు రేఖఁ గాంచఁగ
నేలా మింటికెగస నబ్బురమెత్తెదు బావా!

నఖార్ధచంద్రరేఖలకు భేదముఁ గల్పించిన నభేదము చెప్పఁబడెను

క॥ శ్రీవల్లభుఁడని తరుణులు
గోవిందుఁడటంచు వృద్ధగోపీనివహం
బేవిధమునఁ గాంచఁబడిన
నావిధి బాలికలు దలచి రాయాగతులన్.

నవీనాలంకారికుల మతమున నీపద్యమునం దుల్లేఖాలంకారము చెలంగును. కాని మమ్మటాచార్యుల మతమున నిదియు నతిశయోక్త్యలంకార విభేదముగానే గ్రహింపఁబడును. ఆయాపద్యములలోనున్న యాయా యలంకారముల నిరూపించునపుడు చారుతాతిశయమునే ప్రమాణముగా సహృదయ శిరోమణులు స్వీకరించి నిశ్చయించుటచే భిన్నమతములు ప్రబలఁజొచ్చెను.

ఉపమానోపమేయ వాక్యములలో నొకసామాన్యధర్మమునే రెండుసారు లుపయోగించిన చో "ప్రతివస్తూపమాలంకారము"

క॥ దొరకెను దేవీభావము
పరివారపదంబు నేల వాంఛింపవలెన్

పరిభోగయోగ్యమగునా?
ధ త్రైవలరూపచిహ్నితము రత్నమహా!

ఇచటఁ బరిహారపదము సామాన్యశబ్దము. పరిభోగ యోగ్యమనుటఁ బర్యాయవాచకము, పరిహారపదత్వ పరిభోగ యోగ్యత్వము లేకార్థత్వముఁ గల్గి పలుకఁబడుటచేఁ బ్రతివస్తూప మాలంకారము. క్రిందిపద్యమునందు నిదర్శనాలంకారము గలదందురు.

గీ॥ విమలుఁడీసుడా. చ శేరేఁడు విశదమూర్తి
శివగిరికిశవాస సుశ్రీలశేలు
ధరణి సజ్జనుల్ స్వజనుందరులు గారె?
ప్రకృతిశోభనమఱయ దర్పణముసుమ్ము.

ఇందు విమల విశదాను లేకార్థబోధకము లగుటవలన నీపద్యమున మాలారూపకమై ప్రతివస్తూపమ చెలంగును.

గీ॥ హరిణశాబాక్షిలోలాలకావృతంపు
ముఖవికాసము వీక్షణముం బొనర్ప
భ్రమరసంభారసంభ్రమ భరితమైన
జలజలక్ష్మి విలాసముం దలఁచువాఁడ.

ఇచట నౌపమ్యము పదార్థగతమై ప్రకాశించుటవలన దీనిని స్మరణాలంకారము [illegible]
నీపద్యమునఁ బ[illegible]
లందురు.

గీ॥ పండువెన్నెలరుచుల నేర్పఱచుపచుల
సత్యముగ వెన్నెలపులుంగు చతురురాలు
లలితరతికేళి నర్మవిలాసములను
నిజముఁగాఁగ నవంతిజ నిపుణురాలు. [illegible]

ఈపద్యమున 'చతురురాలు నిపుణురాల'ని పలుకుటచే సాధర్మ్యమూలకమై ప్రతివస్తూపమ గన్పట్టును. ఇందలి నాల్గవ పాదమును మార్చి, "వేరనిపుణులవంతిజమీఁరలేర" యని చదివినచో దీనిని వైధర్మ్యమూలక ప్రతివస్తూపమగాఁ జెప్పుదురు.

ఉపమాన ముపమేయ సాధారణ ధర్మము
లన్నింటికిని బ్రతిబింబకల్పనమే "దృష్టాంతము"

గీ॥ కవులపలుకులు గుణములఁ దవ్వులకున్నఁ
జెవులఁ దియ్యని చవులను జిలుకుచుండు
మాలతీమాలవలపుల మఱియువున్నఁ
జూపరుల కన్నుదోయికి సొంపునింపు.

క॥ నినుగాంచినంత రమణికి
మనమున సంతాపభరము మటుమాయమగుఁగా
గనినంతఁ జంద్రుఁ గుసుమం
బును గైరవిణీవధూటి పూచును జుమ్మా. [illegible]

ఈపద్యముల సాధర్మ్యమూలకమై బింబప్రతిబింబ భావయోగమున దృష్టాంతముగలదు. ఇటులనే వైధర్మ్యముఁ గూడఁగాననగును.

ప్రకృతాప్రకృతము లనఁగా నుపమానోపమేయ
ములధర్మముల నొకేతరవ నుపయోగించుట
కాని లేక వానిక్రియల పెక్కింటి నటులనే
ప్రయోగించుటకాని "దీపకము" గాఁ జెలంగును.
ఇందు మొదటఁ జెప్పఁబడినది పిదపఁ జేర్పఁగాఁ
బడుదానికై గుణానుపూర్వ్యంబో 'మాలాదీప
కము" గా వచింతురు.

గీ॥ కృపణులధనంబు, మృగరాజకేసరములఁ
గులవధూటిజనంబుల కుచయుగంబు,
ఫణిఫణాగ్రముల వెలుంగు మణుల నెవఁడు
బ్రతికియుండంగఁ జేచాచి పట్టఁగలఁడు?

ప్రాకరణికాప్రాకరణికములధర్మము క్రియారూప
మున నేకవారము న నుపపాదింపఁబడెను. ఈక్రియ మొదట నుప
యోగింపఁబడుటచే దీని నాదిదీపకమందురు.

గీ॥ చంద్రికిరణంబుల నిశలు సారసిజముల
వలనఁ గొలఁకులు పూవుగుత్తులను లతలు
రాజహంసల శారదారమయుఁ గావ్య
కథలచే సజ్జనులు శోభగాంచుచుందురు.

ఇచటఁ గావ్యకథలసజ్జనులు పెంపుగాంచుట ప్రకృత
మును తక్కినవన్నియు నప్రకృతములునై చెలంగును. ఒక
సారి చేర్పఁబడిన క్రియయే వాక్యములనెల్ల వెలిగించుటచే
దీపకమని చెప్పఁబడును. ఇదియుఁగూడ నంత్యక్రియాదీపకమే.

గీ॥ వ్రాలుమండె పయోనిధి భాస్కరుండు
సరసిరుహగర్భముల భృంగసంచయంబు
వృక్షవాటికానీడల విహంగకులము
మానవతులందు మెల్లమెల్ల మన్మథుండు.

దీనిని నాదిదీపకమందురు. క్రియ మొదటనుపయోగింపఁబడెను.

క॥ గురుశుశ్రూషను బుద్ధియు
సురసేవించుటను సురత సుఖసంపదయుఁ దా
ధగ చంద్రోదయమున సా
గరమును బెంపొందె సొంపుఁగాంచు లతాంగీ!

ఈ పద్యమునఁగూడ నంతదీపకమే కన్పట్టును.

గీ॥ సానకెక్కిన మణిగెంపు సన్నగిలిన
నెలయు నని మొనఁ దలఁబడి నిలుచువాఁడు
కేళిఁదూలిన బాలిక వేలకిచ్చి
పేదపడిన రాజు మఱికి వెలుఁగుఁగాదె.

ఇచట రాజవర్ణనము ప్రస్తుతమై చెప్పఁబడుటచే నిదియు నంతదీపకమే.

గీ॥ కలిమిఁగాంచఁగ మింటఁషికారుబోవ
గొప్పవారలకథలను గోరివినఁగ
మంచివారికి మేల్జేయ నెంచినంత
మోదమెవరికి మదిలోన బొదలకుండు.

క॥ చలియించును, చెమరించును,
తలవంచును, మాఱుమోముదాల్చుఁ, దమి ము
ద్దులనొసఁగఁగోరిమదిలోఁ
దొలితలిమమునేఁబాల తొట్రిలుచుండుఁ.

ఈ పద్యములరెంటియందును కారకదీపకము గాను౦డు
చున్నది.

నియమితములయినవాని లేక ప్రాకరణికా
ప్రాకరణికములయినవాని నొకానొక ధర్మము
నుపయోగించినచోఁ "తుల్యయోగితాలంకా
రము"

360 క॥ అనులేపనముల సుమముల
వనితారత్నములు సంజపడినంత ధరిం
చి నిగూఢనిద్రఁజెందిన
మనసిజుఁ మేల్కొలుపుచుండ్రి మానసపీమఁ.

ఇచట సంధ్యావర్ణనము ప్రస్తుతమగుటంజేసి ప్రస్తు
తములైన యనులేపనాదుల కేకబోధక్రియా సంబంధము
గూర్పఁబడెను.

క॥ ధనముఁ ధర్మము కొంచము
ఘనతయుఁ గీర్తియుఁ బరోపకరణంబైనఁ

గన, సారహీనజీవిత
మును ధనాళిఁ సారవంతముగ నొనరించుఁ.

ఈపద్యమున కర్మభూతములైన దానాదులకు సారతా రూపమైన యేకగుణసంబంధము సంఘటితమయ్యెను.

గీ॥ పాకశాసనసమ! ధరావలయమెల్ల
నీవు పరిపాలనంబున నెగడుచుండ
వైరిలలనావిలోచనద్వయికిఁ దపిన
ముల దినంబు వర్షంబయి చెలఁగెఁజుమ్మ.

ఇందు గుణక్రియలభావమగుటచే శబ్దమాత్రసంపాదకమై శ్లేషరూపముననే యభేదాధ్యవసాయమూలకమై యర్థము పిండీకృతమై చెలంగుచుఁ దుల్యయోగితాలంకారము దీపించుచున్నది.

ఉపమానముకన్న నుపమేయ మాధిక్యమును
వహించినచో "వ్యతిరేకాలంకారము"

గీ॥ నిండునెల రోజురోజు క్షీణించెనేని
మఱలమఱలఁగ నభివృద్ధి మహిని గాంచుఁ
జాలు కోపము; తరుణి! ప్రసన్నవగుము
సడలెనేని జవ్వనమింకఁ బడయలేము.

ఇచటనుపమేయమునకన్న నుపమానమధికమని కొంద అందురు. వారి పలుకులు యుక్తియుక్తములుగావని ప్రకాశ

కాదని మతము. రుద్రటాదుల మతమున జంద్రునికన్న జవ్వనము న్యూనగుణముగ గలిగియున్నది. కాన నుపమానమున కాధిక్యము గానవచ్చును. ఇంక మమ్మటాచార్యుని మతమున 'జవ్వనము చంద్రునివలె మరలమరల రానిది' కాన యౌవనమునకే యాధిక్యము గన్పట్టుచున్నది.

364 క॥ మలినతఁ గోశనిషణ్ణత
ములఁ జన ద్రుఢతలనిబద్ధ ముష్టిగుణములన్
దలపన్ గృపాణగృపణుల
కిలలో నాకారభేదమే కలదు సుమీ.

ఇచట శ్లేషరూపకమై యుపమానమునకన్న నుత్కర్షతవహించి వ్యతిరేకాలంకారము చెలంగునని కొందఱందురు

గీ॥ లలితబిబ్బోక లీలావిలాసములను
సతము నవ్యతరంగిత గతులఁ జెలఁగి
సస్మితస్నిగ్ధ ముగ్ధతఁ జానమోము
సరసిజవిలాసమెంతయుఁ బరిహసించు,

ఇచట నుపమేయము త్కర్షతఁ గలిగియున్నది. ఈ పద్యము నందలి మూడు నాలుగు పాదములకు మారుగా

366 "కలికివదనంబు యామినీకాంతవోలె
వికసితాంబుజ సంపద 'పెంపడంచు'"

నని చదివినచో నుపమానమున కపకర్షత చేకూరును.

నా మొకధనటులుంచి యోయుంద గాడె!
వేగనుదఃవుము నీకధ వినఁగవలతు.

కొందఱిమతమున నీపద్యమున నాక్షేపాలంకారము గలదు. ఈ పద్యమునందలి ద్వితీయార్ధమునకు బదులుగా "నామొకోనిర్దయుండ! నీవేమటంచు పలకెదటులుంచు మిఃస్త్రి డాపాడువార్త" యని చదివినచో వక్ష్యమాణ మరణవార్తా విషయము పెదవినుండి బయటకు వెలువడకయే నిలచి పోయెను.

హేతురూపమైన క్రియకుఁ బ్రతిషేధము గలుగు చున్నను ఫలముసంభవించినచో "విభావనా లంకార"మనఁగా కారణములేకయే కార్యము గలిగెనంటయే "విభావనము"

గీ॥ శస్త్రములుండాల్పక వివేక శాలులైన
తరుణులమదులుగూడ విదారణంబు
నల్పకమలలోచనల యనల్పకపట
చారులీలా విలాస మింపారు గాత.

ఇచట దారణమునకు శస్త్రము కారణము. అట్టి హేతువులేకయే కార్యము గలుగుచున్నది.

3౹౦ గీ॥ ఎంతయుండియు సొంపులకిక్కయైన
జవ్వనము ముద్దరాండ్రకు నివ్వటిల్లు

వంతనుండియు నుంత నిప్పైనలేక
నీటుగాండ్ర మనంబుల నీఱుసేయు,

పై పద్యమున ననుక్తనిమిత్తమైన విభావనయు నీపద్య
మునందుక్తనిమిత్తమైన విభావనయుఁ జెలంగును.

కారణములన్నియు గుమిగూడియున్నను కార్య
మును వచింపకుంటయే "విశేషోక్త్యలంకా
రము"

క॥ తనువు హరింపంబడియున్
గన శంభుని చేహృతంబుగాదు బలంబే
వ్వని కావున విల్తుఁడొకం
డనయము ముల్లోకముల జయంబు వహించున్

క॥ కాలియు కర్పూరమువలె
వాలాయము జనుల శక్తివంతుం డగునా
మేలిపరాక్రమశాలికిఁ
జాల నమస్కృతులు సేతుస్మరవీరునకున్

ఇచట మొదటిపద్యమునఁ దనూహరణకారణమయిన బలహారణము చెప్పఁబడలేదు. కావునదీని నచింత్యనిమిత్త మందురు. రెండవదానియందుఁ గాలిపోవుటయను కారణము గన్పట్టుచున్నను శక్తివంతుఁడై స్మరవీరుఁడు వెలుంగుచున్నాఁ డని వచింపఁబడెను. కావున వీనిలో విశేషోక్త్యలంకారము గలదు. కొందఱు మొదటిపద్యమును రూపకభేదమనస

లక్ష్యముగను మఱికొందఱిమతమున నీరెంటుపద్యములును విరోధాలంకారభేదములుగను జెలంగును.

౩౯౩ కం॥ మనసిజ శరాగ్ని తరుణీ
మణిమానస సీమ దహ్యమానంబైనన్
బెనుపొందుచుండు స్నేహము
కనుఁగొనఁగా నిట్టి వింత గలదే ధరణిన్

ఈపద్యమునఁగూడ కొందఱు విశేషోక్తిని వచింతురు.

గీ॥ సిరులఁబొరలిన మత్తతఁ జేరరాక
జవ్వనముపయిఁగొన్నఁ జంచలతలేక
దొరతనంబున్నగర్వంబు దొరయనీక
ధరణిలోనమహాత్ములు దనరుచుందురు.

ఇచ్చట మహాత్ములనుటవలన నిమిత్తము క్తమై కన్పట్టును. ఈపద్యమునందలి నాల్గవపాదమునుమార్చి "భూతలంబునఁ గొందఱు పొదలుచుంద్రు" ని చదివినచో నిమిత్తమనుక్తమై విశేషోక్త్యలంకారము వెలుఁగును.

గీ॥ చాలగోరితి నుపనిషత్సారమెల్ల
మతిపథంబున గీతయు మననమయ్యె
నిట్టులైనను హా! శారదేందువదన
హృదయసదనంబునందుండి యేగదకట!

ఇచట నుపనిషదర్థ విమర్శనమున సకలలోకానిత్యత్వ జ్ఞానముదయించి యైహికసుఖముల విరతిజనించుట సహజము,

గీతాపఠనమువలనఁ కలుగవలసిన ఫలమునుగూడ నిదియే. కాని విరతిహేతువులు ప్రసిద్ధములై కన్పట్టగా విరతి గలుగకుండుట వలన రాగాధిక్యరూపమైన ప్రతిబంధకమునకు ప్రతీతి గలుగుచున్నది. అందుచే నీపద్య మనుక్త నిమిత్త విశేషోక్తికి లక్ష్యము. ఇంక నీ పద్యమునందు త్తరార్థము నిట్లులైనను హా! శారదేందువదన! చిత్తమెల్ల రాగాంధమై చెలగుచుండె'నని పఠించినచో నుక్తనిమిత్తమై మార్పు నొందును.

పదార్థముల యన్వయమునందుఁ గ్రమము నతి
క్రమింపకున్నచో॥ యథాసంఖ్యాలంకారము"

గీ॥ ఓమహీపాల! నీదుశౌర్యోగ్యవృత్తిచేత
వినయసంపదలీలచే విద్విషులకు
విదుషులకుఁ గాంతలకుఁ జిత్తవీథులందుఁ
దాపము ముదంబు రతియుఁ జిత్రముగఁ దనరు.

ఇచట సమమస్తమై క్రమము వచింపఁబడుటచే నిది శాబ్దము. మఱియు నీక్రమాలంకారము సమాసనిర్మితమై యర్థానుగతమై కొన్నిచోట్లఁ జెలంగుచుండును.

గీ॥ శారదాంబుదహాయతేక్షణములలర
పీతనీలాంబరంబుల వేడ్కఁదాల్చి
వ్రజకులంబునగోవుల పాలుపిదుకు
కృష్ణరాములఁగాంచఁగా నింపునింపు.    377

గీ॥ మొలక లెత్తెను, చిగిరించె, మొగ్గ దొడగెఁ
బూవుపూచెనుఁ దివ్యనిమావిగున్న
మొలక లెత్తెను చిగిరించె మొగ్గ దొడగెఁ
బూవుపూచెను మదిలోన భావభవుఁడు.

ఈ పద్యములలోఁగూడ యథాసంఖ్యాలంకారమే దీపించును.

సామాన్యమున విశేషమునుగాని విశేషమున సామాన్యమునుగాని సాధర్మ్య వైధర్మ్యములసమర్థించినచో "అర్థాంతరన్యాసము"

గీ॥ అపరదిక్కామినీ సంగమానురక్తు
చిత్తుఁడగు దిననాథుని చెలువు గాంచి
కలుషతవహించెఁ బూర్వదిక్కాంతముఖము
తెరుగా! యీర్ష్యఁ బూననివారలెందు?

౩౪౦ గీ॥ సుస్థితుండయి సూర్యుండు సూమమున్న
మధుపములఁగూడి పద్మిని ముదముసెందు
నస్తమించిన వర్ణించు నలవియగునె
యవనిలో స్త్రీలకున్ బ్రియత్వములఁగలవె?

గీ॥ ఉత్తమోత్తములఁచు చేరొందియున్న
మత్తకాశినులను చేస్విను రిత్తకాదె?

రాజదేవేరియయ్యెఁ గైరవిణి సతము
మధుపములఁగూడి రమియించి ముదము గాంచు.

ఈ మూడుపద్యములను గొందఱు సమాసోక్తికి దృష్టాంతములుగఁ గైకొందురు. ఈపద్యములలో మొదటి దానియందు నాల్గవపాదమున నర్థాంతరన్యాసము గాన వచ్చును. ఇంక రెండవ మూడవ పద్యములలోఁగూడ నర్థాంతరన్యాసమున్నది. కాని వీనిలో నది దృష్టాంతముచే సమర్థింపఁబడినది. మఱియు రెండవపద్యమున నర్థాంతరన్యాసముత్తరార్థమునను, మూడవపద్యమున బూర్వార్థమునను గవిచే నెలకొల్పఁబడెను. అనఁగా మొదటిరెండు పద్యములలో విషయము నిరూపింపఁబడినవెనుక నర్థాంతరము పొందుపరుపఁబడెను. కడపటి పద్యమునఁ దొలుతనే యర్థాంతరము పేర్కొనఁబడిన పిదప విషయము వచింపఁబడెను.

వస్తుగతిచే విరోధము గానరాకున్నను వాని
రెండింటికిని విరుద్ధత్వము వచింపఁ బడినచో
"విరోధాలంకారము"

క॥ నలినీమృణాలమలయా
నిలశీతల వస్తువితతి నిన్నెడబాయక
లలనాలలామ కెంచఁగఁ
జెలువుఁడ! దవదహనరాశి చెలువుననుండెన్.

ఇచట నలినీత్వాది దహనత్వ జాతిరూపమున విరోధము గన్పట్టును.

౩౩౩ గీ॥ ఫలవిశేషంబువలనను సమవనతములయి
ఫలవిపత్తి మహోన్నత పదవినంది
సత్పురుష మానసంబులు సంతతంబు
ధరణిరుహశిఖరంబులకరణి వెలయు.

ఫలవిశేషమునందు సమవనతముగ నుండుటకును, విపత్తి నున్నతముగ నుండుటకును విరోధము సెలంగుచున్నది.

క॥ పుట్టించును పాలించును
గిట్టించును లీల నొక్క త్రుటిలో జగముల్
మిట్టిపడు చిట్టిమీనం
బెట్టు జనార్దనపదంబు నెలమింగెనో?

ఇచట మీనత్వజాతికిని జనార్దనద్రవ్యమునకును విరోధము.

క॥ ఖలవచనము పేశలమై
చెలువారినఁ గాల్చుచుండు చిత్తంబెల్లన్
మలయజముంబలె సుజనుల
పలుకులు మోదంబుఁగూర్చు పరుషంబైనన్.

ఇందు పేశలత్వ పరుషత్వగుణములకును గాల్చుట కూర్చుటలను క్రియలకును విరోధము గానవచ్చును.

గీ॥ రాజమార్తండ! నీవు తీరంబుసేర
సమద గజమద సలిల నిష్యందనిమ్న

గాపరిష్వంగ భాగ్యంబు గల్గు కతన
శివుజటాపగ కాళిందిసిరివహించె.

ఇచట గంగా యమునా రూప ద్రవ్యములకు విరోధము సెలంగును.

కం॥ హారిణులు గాకయున్నను
హారిణులు తమంత నీ యొయ్యారపు జను లె
వ్వారల మనములఁ గొలఁదికి
మీరిన విస్మయము ప్రియము మేకొనకుండున్

ఇందు 'హారిణులు గాక యున్నను హారిణు' లనుటచే విరోధము.

గీ॥ కోమలములు శీతలములై గూడియున్న
ఖలుల పలుకులు కటకటా! తలఁచినంత
సాధుజనముల మనముల సంతతంబు
చీల్చుచుండును మఱిమఱి కాల్చుచుండు. త్రివేణి

ఈపద్యమున 'కోమలములై చీల్చుటయు' 'శీతలములై కాల్చుటయుఁ' జెప్పఁబడుటచే విరోధము స్పష్టముగఁ గానవచ్చును.

డింభాదుల స్వక్రియా రూపవర్ణనమే 'స్వభావోక్త్య లంకారము."

౩౪౧ గీ॥ కరసరోజంబుచేఁ బదసరసిజమును
వదన సరసిజమందునఁ బదిలపఱచి
మఱ్ఱియాకునఁ బన్నుండు కఱ్ఱని ము
కుఁదుని మనసారనేఁ గొలుచుచుందు.

గీ॥ అరయఁగడు నెఱ్ఱనై వంపు దిరుగుముక్కు
మూఁడు తెఱఁగుల రంగులతోడి పెడరయు
మివుల మెత్తనై పచ్చగా మెఱయు నెక్క
లెలమినింపెడుపలుకులఁ జిలుకచెలఁగు.

సీ॥ వాలంబుచేఁ గాది వసుధాతలంబును
ముందరికాళుల నుమ్మరమ్మ
గాఁ జిమ్మి; మేనెల్లఁగడుఁ జిన్నదగురీతి
తనలోనికిం దానె ముణుచుకొంచు;
వెనువెంటనే బంటుతనము చేవలుదేర
జవమున జదలంటఁ జౌకళించి
నలుదెసలను జూఱు మలయునట్టులు గాఁగఁ
గడువడి గొంతెత్తి గాండ్రుమందు

గీ॥ నిదుర చెందిన మృగముల నెమ్మనముల
బెదరుపుట్టించి; వానినిఁ జెదరఁగొట్టి
కెంపులంబోలు కందోయి కినుకఁ జెనకఁ
గాఱడవులందు బెబ్బులి సారెఁ దిరుగు.

సీ॥ వెనుకకాళులసాచి; వెన్నుముకను గడుం
గడు వెడల్పగునట్లుగాఁగఁ బెంచి
పింపుల నెత్తుగనున్న మేనెల్ల నిడివిగాఁ
బొడిగించి, వంపుగా మెడను వంచి
మోముమలంచి రొమ్మును జేర్చి జూలునం
గలదుమ్ము విదలించి గడ్డితినఁగఁ

గోఁకమదినిఁ జేకూరుటచేఁ దన
మూతిని ముకుపుటంబులనుగూడ

సీ॥ నెకనెడంగదలించుచు నిటులనటుల
మెల్లమెల్లన నకిలించి తెల్లవాఱ
నిదుర లేచిన గుఱ్ఱమిఁ బాదవసుండు
కాలిడెక్కను పలుమాఱు నేలఁగీఱు.

ఈపద్యములలో మొదటిదానియందు బాలకుని క్రియావర్ణనము రెండవదానియందుఁ జిలుకయొక్క రూపవర్ణనమును గలవు. ఇచట డింభాదులనుటవలన వ్యాఘ్రతురంగాది మృగముల క్రియావర్ణనముగూడఁ జేయనొప్పును. కావున మూఁడవపద్యమున బెబ్బులియొక్క క్రియావర్ణనము నాల్గవపద్యమునందుఁ దురంగక్రియా సంస్థానవర్ణనము సల్పఁబడినవి.

పైపై నింద గన్పట్టుచు, లోలోన స్తుతిగాఁ బరిణమించినను, స్తుతి గానవచ్చుచు నిందగా ఫలించినను, దీనిని "వ్యాజస్తుతి" గా వచింతురు. ఇందు మొదటిది నిందాపూర్వకమైన నుతియు రెండవది నుతిరూపకమైన నిందయునై చెలంగును.

సీ॥ ప్రచుర కుచయుగ ముక్తాభరణము తోడ
నమిత కంటక కలితాంగ యష్టితోడ

393

నీవు కుపితుండవైనను దేవ! వెనుక
కలిగె విశ్వస్తలై రిపువనితలందు॥

ఈ పద్యమున రిపుస్త్రీలకుఁ బీడ గలుగుననుటవలన నిందగాఁ బైఁ గానవచ్చి, పదములలోని విశేషార్థమును గమనించిన వెంటనే రాజు శత్రునాశకుఁడను భావముగల్గి స్తుతిగా పర్యవసానము నొందును. ముక్తాభరణలనఁగా ముత్యాల హారమనియు, నాభరణముల త్యజించినదనియు కంటకకలితాంగయష్టియనఁగా రోమాంచముతోఁ గూడిన శరీరమనియుఁ గరకుముండ్లతో నిండిన మేననియు; "విశ్వస్తలై" యనఁగా విశ్వాసాశ్రయులై యనియు, విధవలై యనియు నర్థము గలదు. ఈ రెండర్థములలో నొకటి నిందను, రెండవది నుతిని సూచించును.

గీ॥ జీవనంబు పయోద! సంజీవనం బ
టంచుఁ బల్కు వ్యాజస్తుతి యగును గాని
ఘనుఁడ! సాయంబు ధర్మరాజునకుఁ జేతు
వధిక వధన సస్తోత్రమై వన్నె గాంచు॥

ఇందు ధర్మరాజునకు సాయ మొనరింతువనుటచే మొదట స్తుతిగాఁ గన్పట్టుచున్నను, పధికవధ నాచరింతువనుటవలనఁ దుదకు నిందగాఁ బరిణామము నొందుచున్నది.

395 గీ॥ ఆరయఁ బరోపసర్పణానంత దుఃఖ
పావక శిఖాశతంబులవలన సతము

చుంబితాంతఃకరణులై తను-ధరా త
లంబునఁ జరింతురుగా పావసంబులెల్ల॥

ఈ పద్యమునందుఁగూడ స్తుతిరూపకమై నింద గన్పట్టుచున్నదని కొందఱు వచించిరి. కాని నవీనులలో మఱి కొంద ఱీపద్యమును వ్యాజస్తుతిగా నంగీకరింపరైరి. ఇచట సాంసారిక జననింద పర్యవసానమైనను బాధపస్తుతి వ్యాజస్తుతికాదు. ఇందు మొదట ప్రతీతమైన స్తుతికి బాధ కన్పట్టుటలేదు కాన దీనిని వ్యాజస్తుతిగాఁ దలంపరాదు.

గీ॥ నీదు గుణ పక్షపాతంబు నీదు బుద్ధి
నిపుణత ఖలుండ! నేను వర్ణింపఁగలనె?
సాధుజనములలో గుణశాలియైన
వాని రేబవళ్ళును మఱవంగలేవు॥

ఇచట దుశ్చరితుని కీర్తనమున స్తుతియున్నఁ దుడకది వానివిషయమున నిందగానే చెలంగుచున్నది.

ఒకే యర్థమును జెప్పుచున్నను, దానితోఁ
బాటు వేరొకదానిని గూడఁ, గూడగట్టుకొని
రెంటిని దెలియఁ జేయుచో "సహోక్తి"

గీ॥ అనఘ! నినుబాయుఁగ అతాంగి కకట! పవలు
రేలతోపాటు నిట్టూర్పు గూడ హెచ్చె               394

వలయములతోడ బాష్పధారలను జారె
జీవితాశయు మేనితోఁ జిక్కుచుండె॥

ఇందు రేబవళ్లతోఁ బాటు నిట్టూర్పులు హెచ్చుటయు మొదలుగాఁగల వానిని బేర్కొనుటచే సహోక్త్యలంకారము.

గీ॥ కలుదెగల చందురుఁడు వెన్నెలలఁ గాయ
కలువపూవులతోఁగూడ వలపు విచ్చె
చీకటులతోడ ధైర్యము చెదరిపోయె
తమ్మిపువ్వులతోడఁ జిత్తమ్ము గుందె॥

పై పద్యమున సామ్యరూపమున సహోక్తి వెలుగుచుండ నీపద్యమునందు సంబంధభేదమున భేదముతోఁ గూడిన సహోక్తి గానవచ్చును. ఇందు కలువపూవులతో వలపు విరియఁబారుటయుఁ గమలములతోడఁగూడ డెందము డిందుటయు వర్ణింపఁ బడుటవలన భేదమున్నది.

గీ॥ వైరిమండల ఖండన వైదుషీవి
భూషణా! నీవు కోపముగాఁ బూనినంతే
నరి వధూలోచనములకు గిరిగహనము
లందు దినములు వర్షములయ్యె సుమ్ము॥

ఇచట రాజు కినుకఁబూనుటయు, వైరి వధూలోచనములు వర్షమ్ములగుటయు జోడుగా వర్ణింపఁబడుట సహో

క్తియు, వక్షమ్ముల ద్యోతనమటచే నిందు సహోక్తి శ్లేష మూలమున సభేదాధ్యవసితమై వెలువారుచున్నది.

వేరొకటి లేకయే నొకటి కొన్నిచోట్ల శోభించునో, మఱికొన్నిచోట్ల శోభించదో దానిని "వినోక్త్యలంకార" మందురు. అనఁగా నొకవస్తువు కొన్నిపట్టుల నింకొకదానితోఁ గూడినచో సొంపు నింపును. మఱికొన్ని పట్టుల నింకొకదానితోఁ గూడకుండినచో సొంపుల నింపునని భావము.

క॥ నెల లేలఁ బాసినంతట
వెలుఁగఁడు; రే యతనిఁ బాయఁ జెనుచీఁకటిలో
మెలఁగు; నివి రెండు గలిసా
కెలఁగువ్వ క ముకుల కందు చిత్తజ సుఖముల్॥

గీ॥ వినయ భావము లేకున్న విభవమేల?
శశి వికాసము లేకున్న నిశ యదేల?
సరసకవితా విలాసంబు కొఱత వడిన
వాగ్వైదగ్ధ్యత గల్గిన ఫలితమేమి?

ఈ పద్యముల చంద్రుని బాసిన రాత్రియు, రాత్రి నెడబాసిన చంద్రుఁడును సొంపు సంపాదింపరని భావము అటులనే వినయములేని విభవమును రసకవిత్వము లేని వైదగ్ధ్యమును రాణింపవు. ఈ రెండుపద్యములలోను

చేర్పఁబడిన వస్తువులు గనఁగూడినప్పుడే మోదముఁగూర్చునని తాత్పర్యము. ఇటులనే 'ఫలరహితమయ్యె జన్మము నళినము తుహినాంశునిఁ గనఁగఁ లేమి' నను పద్యమునందుఁ గూడ వినోక్త్యలంకారమే చెలంగుచున్నది.

క॥ జలదాగమంబు వెలిగాఁ
గలువల చెలికాఁడు మింట కాంతులఁ జిమ్మెన్
లలి గ్రీష్మర్తువు వెలిగా
జలజంబులు నీటవలపుఁ జవులన్ జల్లెన్॥

ఈ పద్యమున జలదాగము చంద్రులును, గ్రీష్మర్తు కమలములును జోడు గూడనప్పుడే చమత్కారాతిశయము గూర్చునని కవిభావము.

గీ॥ మందపవన మృణాళేందు చందనములు
శీరహార శైవాల కుశేశయములు
ప్రబల విరహార్త చేతనావళికి శైత్య
రహితమయ్యెఁ బ్రతీతిమాత్రంబు గాదె?

ఇందు శైత్యమున్నను లేనట్లు చెప్పఁబడెను. ఇదియు వినోక్తియే.

సమానములచే నర్థముల కెచట వినిమయము
గలుగు నచట "పరివృత్త్యలంకారము"
ఇచట వినిమయమనఁగా నొకదాని నొసఁగి
వేరొకదానిని గైకొనుటయే.

క॥ కొనఁబడె నా ప్రాణంబులు
వనజానన! దర్శనంపు ఫలముగ నిచే
రణ రణక దానముననే
మనసేల హరింతు మంచిపనిగాదు సుమా!

ఈ పద్యమున ప్రథమార్థమున సమముగను, ద్వితీయార్థమున న్యూనముగను వినిమయము విలసిల్లుచున్నది.

గీ॥ రాజ! నానావిధ ప్రహరణమువలన
దారుణ నినాదయుక్త ప్రహారములను
సంప్రహారంబునం బొంది శత్రువీర
విసరమునకు వసుంధర విప్రలంభ
శూన్యగాఢ పరీరంభ సుఖము నొసఁగె॥ 405

ఈ పద్యమున వసుంధరకు వైరివీర విసరము సమరమున నానావిధాయుధ ప్రహారముల నిచ్చి గాఢపరీరంభ సుఖమును బొందఁజేయుటచే న్యూనము నొసఁగి యధికమును గ్రహించిరి. మఱియు భూదేవిపక్షమున వీక్షించినచో నామె తక్కువదాని బుచ్చుకొని వారి కెక్కువదాని నొసఁగెను. పై పద్యమునందు దర్శనమొసఁగి ప్రాణములఁ గైకొనెననుటచే రెంటికిని సామ్యమున్నది. ఆ పద్యముననే రణరణక దానముననే మానసమును హరించె ననునప్పుడు తక్కువదాని నిచ్చి హెచ్చుదానిని బుచ్చుకొనుట సంభవించెను. ఈ ద్వితీయార్థమును మార్చి 'మనమును నీకిచ్చి వెసఁ గొనినాఁడ వియోగబాధ కోమలిని సుమా' యని చదివినచో నీకు నేనెక్కువదాని నిచ్చి తక్కువదాని ననఁగా నుత్తమమైన మానసము

నొసఁగి యథసుమైన వియోగబాధను గైకొంటినని బోధపడును. అప్పుడీ విశేషణములఁగల సాన్వయతాసాన్వయతలు స్పష్టమగును.

గీ॥ అరయఁగా నస్థి మాలామయంబు నొసఁగి
ముండమాలామయంబగుచుండు తనువు
గైకొనుచునుంటి దీన నో కాలకంఠ!
వచ్చు లాభ మదెట్టిదో పలుకరాదె?

ఇచట ధర్మిధర్మభావ వ్యత్యాసరూపమగు విపర్యయము సెలఁగును.

క॥ మణిగాజటంచు గాజే
మణిగాఁ గొంటలు దలంత్రు; మతిఁగొందలు గా
జును గాజుగాఁగ మణినే
మణిగాఁ దలపోయు బుద్ధిమంతులు సుమ్మీ

ఇందు మొదట గాజుయొక్క ధర్మిత్వము మణియొక్క ధర్మత్వము చెప్పఁబడి, పిదప మణియొక్క ధర్మిత్వము గాజుయొక్క ధర్మత్వము పలుకఁబడుటచే ధర్మభావ విపర్యాసము గానవచ్చును. మఱియు 'వలపుప్రియురాలి బాసిన వానికెన్నఁ డుహీనదీధితియే దవదహనమరయ' అను పద్యమునందుఁగూడ పూర్వార్ధమునఁ దుహినదీధితియందు దవదహనత్వమును నుత్తరార్ధమున దవదహనమునందుఁదుహినదీధితత్వమును బలుకఁబడుటచే విపర్యాసము గానవచ్చును. పై పద్యమునందువలె దీనిలో ధర్మధర్మిభావ

వ్యత్యాసముగాదు. ఇందు ప్రేయసీ విరహోపాధిచేఁ బరస్పరధర్మ విపర్యాసము వివక్షితమగుచున్నది.

భూత భావిభావములు ప్రత్యక్షములగునట్లు చేయఁబడినచో "భావికాలంకారము." ఇచట కవిభావము చదువరులకుఁ బ్రతిబింబ రూపమునఁ బొడఁగట్టునని తాత్పర్యము.

గీ॥ ఒక్కపుడిసిలిచేఁ గడునక్కజముగ
దివ్యమత్స్యకచ్ఛపముల దృష్టిగాంచు
ముని, మహాత్ముఁడు, కుంభజన్ముండు, యోగి
చంద్రుఁడాతఁడు సర్వదా జయముగాంచు.

ఈ పద్యమునందలి యగస్త్యుని వర్ణనా విశేషమును వినువారికి విష్ణుని మత్స్య కూర్మావతారములు ప్రత్యక్షములైనట్లు దోఁచుటచే నిది భావికాలంకారము.

కం॥ కనుఁగవ కాటుక రేఖలు
వనితామణి! మున్ను మిఘులవన్నె వహించెన్
గనని చెలువంబిక మీ
దను జెలగల నగలఁదాల్చి తళ్కుల నించున్. 409

ఇందుఁ బూర్వార్ధమున భూతవర్ణనమును, బరార్థమున భావివర్ణనమును జెలంగుచు దీనిఁ వినువారి మానసముల బాలికామణియొక్క నయన శోభావిశేషమును, సౌందర్యాతిశయ

మును ప్రతిబింబించునటుల భూతభావి సంబంధములైన యంజన భూషణ సంభారము వర్ణింపఁబడెను.

వాక్యపదార్థ గతులచే హేతువు నెలంగినచో
"కావ్యలింగము."

41\. గీ॥ వసుమతీతలనాథ! నీ వాజిరాజి
పాదఘాత నిర్గత ధూళి పటలపంకి
లంబు గంగను భారభయంబు చేత
శిరమున ధరింప నోపఁడా గరళగళుఁడు.

ఈ పద్యమునందు కవిప్రౌఢోక్తిసిద్ధమై గంగానదికి సంభవించిన పంకిలత్వమూలమున శివునకు భారభయము గలిగెను. ఈ భారభయమే గంగాత్యాగమునకుఁ గారణమయ్యెను. అందుచే నిచట నేకపదగతమై కావ్యలింగము దనరారుచున్నది.

కం॥ ధర పున్నమ చందురునిన్
బరిహాసము సేయు నీదు వదనాంబుజమున్
బరికించు తరుణుఁ డెవ్వఁడు
మరునకు కింకరుఁడు గాడు మానిని చెప్పమా

ఇందు నేకపదార్థగతమై వాస్తవ మూలకమై పూర్వార్థము పద్యమునందలి పరార్థమునకు హేతువై చెలువారును.

గీ॥ ధారుణి నసంఖ్యపక్షగమై తనరు నీదు
దాన జలవాహినింగాంచి ధరణినాథ

గంగా! త్రిపథగ దాను శివునిమూర్ధ
నం సిగ్గిలి తలఁదాచుకొనుచునుండె.

ఇచట ననేక పదఘటితమౌ వ్యాఖ్యార్థమునందలి వాక్యార్థము పదార్థమునకు హేతువగుచున్నది. ఇందు హేతువు కవిప్రౌఢోక్తి సిద్ధము.

కం॥ తళుకులవెదఁ జల్లెడి కను
గొలకుంజూపులను జిలికి కుసుమాయుధు సె
చ్చెలులు లతాంగులు జగతీ
స్థలి నొక త్రుటిలో హరింత్రు తరుణుల మనముల్.

ఇందు ననేక పదఘటితమౌ వాస్తవహేతువు సెలంగుచున్నది.

వాచ్యవాచకత్వముల మూలమునఁ గాక భిన్నముగ వచింపఁబడినచో "పర్యాయోక్తి." కావున భంగ్యంతరమునఁ దాత్పర్యకథనమునే "పర్యాయోక్త్యలంకార" మందురు.

గీ॥ రావణునిఁ గనినంత నైరావణ ముఖ
మందు మదమును, హరి హృదయంబు నందు
మానసంపద, చిరరూఢమైన స్వర్గ
వాసవాంఛయు విడువఁగాఁ బడియె నకట.

ఇచట శబ్దమూలముననే యైరావత దేవేంద్రులు మదమానములఁ ద్యజించి రనుటచేఁ బ్రకారాంతరమున

శత్రుని పరాజయమును, రావణుని బరాక్రమమును వచింపఁబడెను.

415 గీ॥ అలక చికురపాశ విహారకేళిఁ
బొంది నందన మందు నానందమొందు
పారిజాత మంజరులకుఁ బంక్తివదను
సైన్యముల భంగపాటిప్డు సంభవించె.

ఈ పద్యమునందు రావణునిచే స్వర్గము జయింపఁ బడెనను ప్రస్తుతార్థము, వైచిత్ర్య విశేష ప్రతిపత్తికొఱకు పంక్తిముఖుని సైన్యములవలనఁ బారిజాత మంజరులకు భంగపాటు చేకూరెనను కార్య ద్వారమున వర్ణింపఁబడెను, గాన పర్యాయోక్తము.

గీ॥ తెలికనుంగవ వెంబడి వెలికి వెడలి
వలుదచందోయి పైజారి వన్నెలొలుకఁ-
నీటిబొట్టులు వగతుర సెలతు కలకు
దారమేలేని ముత్యాల పేరులయ్యె.

పై పద్యమునందుఁ గార్యము ప్రస్తుతము వర్ణనీయ మయ్యెను. ఇంక నీపద్యమున వర్ణనీయుఁడైన వసుమతీ నాథుని శత్రుమారణ రూపకారణము వలెనే కార్యభూతమైన శత్రుస్త్రీజనాక్రందన జలముగూడ ప్రభావాతిశయ బోధకమై వర్ణనార్హ మగుటచే నిదియును పర్యాయోక్త్యలంకారమే.

గీ॥ ఇరుగడల పేటిదెబ్బల గురుతులుండెఁ
జిగురు కెమ్మోవి నరకుల చిన్నెలుండె

వని సౌవర్ప(గ( దగియుంటి వంతె కాని
తరుణిరో! దూతకర్మతు( దగవు నీవు.

ఇచట నాయకుని( బిలువ(బోయిన దూతికయే, నాయికకు సవతియై మరలివచ్చెను. అప్పుడా ప్రౌఢనాయక భంగ్యంతరమున తన మనోగతి భావమును దూతికకు పై విధమున వెల్లడించెను. కావున నిది పర్యాయోక్తము.

గీ॥ సరస పరిరంభణోద్దామ సౌఖ్యవంధ్య
మై రతంబు చుంబనమాత్రమై రహింప
రాహుభార్యకు తీక్ష్ణచక్రప్రయోగ
మహిమ నెవ(డు విధించె నా మహితు( గొలుతు.

ఈ పద్యమున రాహుశిరచ్ఛేద మొనరించిన వానిని సేవింతు' ననుభావము ప్రకారాంతరమున వచింప(బడెను.

వస్తుసంపద్వర్ణనముగాని, మహాత్ములచరిత్ర కథనముగాని చేయ(బడినచో "నుదాత్తాలంకారము."

గీ॥ వీట నెలరాల( గట్టిన మేటికట్ట
డములు మబ్బుల క్రిందుపడంగ(జేయ
వెన్నెలలవేడిమి( గరంగి జాలికి వాడలు
వెల్లువల( బూలదోటలు పెంపు గాంచు 419

ఈ పద్యమునందలి వర్ణనము పురజనుల సంపదలు మేర మీరి విలసిల్లుచున్నవని వ్యక్త మొనరించుచు. కాన

నిందు పౌరుల లోకాతిశయ సంపత్తి వర్ణనము చెలంగుటచే నుదాత్తము!

గీ॥ బొడ్డునందుండి పుట్టుకఁబొందినట్టి
తమ్మిచూలి నుతింప జగమ్ము లెల్ల
నడఁచి మున్నిటి సెజ్జ కల్పాంతసమయ
మున కపటనిద్రఁ బురుషుండు మునుఁగుచుండె.

ఇందు ప్రస్తుతమున సముద్రుని మహాత్మ్యమును సర్వ లోక సంహారకుండైన హరి చరిత్రమును గానవచ్చుట «నుదాత్తము.»

గీ॥ ఈమహాటవిలోన శ్రీరామమూర్తి
లీల దశరథ వచనాను పాలనావి
చారుఁడై నివసించి యసాధ్యబలన
హాయమున రాక్షస క్షయ మాచరించె.

ఇచట రాముని వీరచరిత ముపలక్షణము లేక యంగమై దండకారణ్య వర్ణన మంగీభూతమై వెలుంగుటచే 'నుదాత్తము.'

ప్రస్తుత కార్యమున కొక కారణము గన్పట్టు చుండఁగాఁ గారణాంతరములుఁగూడ సంభవించి నచో "సముచ్చయము." మఱియు గుణక్రియల నొకే పరి వచించినపుడుగూడ "సముచ్చయా లంకారమే."

సీ॥ వారింపఁగారాదు పంచశరుండేయు
మార్గణవితతి; నిర్మలము కలము
గూరిమి చెలికాఁడు దూరంబు నందుండె
మానసమున చింత మ్రగ్గుచుండె
మక్కువ మదిలోన నిక్కుటమగుచుండె
భోగయోగ్యంబైన పూపప్రాయు
మతికతిసంబులు ప్రాణముల్; స్త్రీత్వంబు
ధైర్యవిరోధియై తేనరుచుండు
గీ॥ కాలము వసంత మదయుండు కాలుఁడకట
చతురలైన సఖీమణుల్ సరసలేరు
గుబ్బమబ్బల నన్నిటి గ్రుచ్చి వచ్చు
విరహభారము నింక నెవ్విధి సహింతు.

ఈ పద్యమునందు వారింపరానిదగుటచే నశోభనము
లైన పంచశర మార్గణము లాదిగాఁ గల కారణాంతరముల
వలన విరహభారముసహింప శక్యముగాదనిపర్యవసించుచున్నది.
మఱియు భోగయోగ్యంబైన పూపప్రాయము శోభావహమై
నను గూరిమి చెలికానికి దూరమున నుంటచే విరహభారమును
బెంపొందించి దానిని దాటరాదను కార్యమునందుఁ బరిణమిం
చుటంజేసి, యదిగూడ యశోభనముగానే చెలంగుచున్నది.
కాన నిం దసహ్యోగమూలకమై సముచ్చయాలంకారము
భాసిల్లును.

చ॥ విమలకులంబు; కన్గవకు విందొనరించెడు రూపముల్; పరా
క్రమమతులంబు; వైభవమఖండము; వేదపురాణసమ్మతం
బుమతి; భుజాబలంబు సరిపోల్పఁగరాదిక వీనిచేత, గ
ర్వమును వహించువారికి నృపాలక! శృంఖల మీవె ధారుణిన్ 423

ఇచట విమలకులము మొదలైన శోభనకారణము లన్నియు గర్వమును గూర్చుటయందుఁ బర్యవసించుటచే, సద్యోగసంభవమై సముచ్చయాలంకారము గన్పట్టును.

మ॥ అరరే! ధీరసమీర! చందనమహీజాళిం దగన్ బుట్టిఁ గ్ర
  మ్మర, దాక్షిణ్యమునన్ జగత్ప్రియుఁడవై, మందాకినీవారిపై
  శ్రీ రహిన్ వర్ధిలినన్ దహించెదవు నాదేహంబు దావాగ్నివై
  మఱి, మత్తున్ మలినాత్మకున్ బికముఁ నన్ మాటాడఁగా నేటికిన్.

చ॥ పగలు శశిల్ మఱుంగు నెల; పద్మములేని కొలంకు; ప్రాయపున్
  జిగి సెరిదూఱు కామినియు; శ్రీ లెడదొరంగిన సజ్జనుండు; నె
  మ్మొగమున విద్యలేని నరమూర్తియు; లోభినృపుండు; తాని చెం
  త గల ఖలుండు నామదికి ధారుణిలోనివి సప్తశల్యముల్.

ఈ రెండు పద్యములందును సదసద్యోగము గానవచ్చును. వీనిలో శోభనపదార్థములు నశోభనపదార్థములును రెండునుగూడ కలసి మెలసి కారణములై కార్యము గల్పించును. మొదటిపద్యమున దహించుటకు చందన మహీజాళి జన్మమే చాలియుండఁగా దాక్షిణ్యాది హేత్వంతరములు గూడ చేర్కొనఁబడెను; ఇందు పైమూఁడుపాదములుమాత్రమే గ్రహించినచో సద్యోగమును, నింక నాల్గవపాదమును మాత్రమే గణించినచో మాలిన్యాదులచే నసద్యోగమును పద్యమునంతయు స్వీకరించినచో శోభనాశోభన యోగమును చదువరులకుఁ గన్పించును. ఇఁక రెండవపద్యమునఁ జందురుఁడు మొదలైన మంచివస్తువులును, ఖలుఁడు మొదలైన చెడువస్తువులును గూడుటచే సదసద్యోగమని కొందఱు పల్కుదురు;

దీని నంగీకరింపక ప్రకాశకారుఁడు సహజముగఁ జంద్రుఁడు మొదలైనవే శోభన వస్తువులనియు, వానికిఁ జేకూరునట్టి కళలు తగ్గుట మొదలైనవే యశోభనములనియుఁ గావున నీపద్యమున శోభనాశోభన యోగము లభించునని యువచించెను.

కం॥ సకలారికులముఁ బోరిఁ గొన
నొకకృతిలో విమలమయ్యె నో మానవనా
యక! నీబలములు; ప్రతిభటుల
ముఖములు మలినంబు లగుచుఁ బొడఁగట్టె నుమా.

ఇందు వైమల్య మాలిన్య గుణముల సముచ్చయము గలదు.

క॥ అరుణిమ కనుఁ గవఁ జెలఁగెన్
దరుణీ! ప్రియుమోము మలినతం జెలరేగెన్
జిరునగవు మొగము నాంచఁగ
మరువహ్ని వెలింగె వాని మానససీమన్

ఇచటఁ బ్రథమార్థమున గుణయోగ పద్యమును, ద్వితీయార్థమునఁ గ్రియా సముచ్చయమును గానవచ్చును.

కం॥ వెలిదమ్మి రేకుల చెలువై
చెలువారెడి కనులు కినుకచేఁ గలుషంబై
చెలఁగెన్ విపత్కటాక్షం
బులు పగతుర నొడలఁబడును భువనాధీశా. 428

ఈ పద్యమున గుణక్రియా సముచ్చయము గన్పట్టును. భువనాధీశుని కనుల కాలుష్యగుణమును, పగతురనొసళ్ల విపత్కటాక్ష పతనక్రియయు సంభవించుటచే గుణక్రియా సముచ్చయము.

క॥ జలదములొదవఁ గాటుక
వలెనే నలుపెక్కె మిన్ను; వనితల నునుఁజె
క్కులు తెలుపుగాంచు, మఱి పాం
థుల డెందము లెఱుపుమీరి తోఁచును సుమ్మీ

క॥ ఉదితముగా శశిబింబము
రుదితము గావించు చందురు వియోగిజనుల్
ముదితుండగు మదనుండుఁ
మదవతు లౌదల ధరించు మర్యాదలచేఁ.

వీని రెంటిలో మొదటి పద్యమున బహుగుణ సముచ్చయమును, రెండవదానియందు బహుక్రియా సముచ్చయమును గలదు. మొదటిదానిలో నలుపు, తెలుపు, ఎఱుపులు కలసి మెలసియున్నవి. రెండవదానిలో నుదిత, రుదిత, ముదిత, క్రియలు కూడియున్నవి.

ఒకవస్తువునే క్రమముగా నొక్కొక్కచో
నున్నట్లు పలికినఁగాని యనేక వస్తువులు క్రమ
ముగా నొక్కచో నున్నట్లు వచించినఁగాని
"పర్యాయాలంకార" మందురు.

గీ॥ మొదట సాగరు నదిలోనఁ బిదపశివుని
కంఠపీఠికఁ దుది మహాఖలులజిహ్వఁ
గ్రమముగా నిట్టు లభివృద్ధిఁగాంచినావు
కాలకూటమ! నీస్థితి చాలమేలు

ఇచట నొకదానినే (కాలకూటమును) వరుసగా పెక్కు చోట్ల నున్నట్లు వర్ణించుటచే నిది పర్యాయాలంకారము.

కం॥ లలనామణి! బింబోష్ఠము
తొలుతన్ రాగమువహించి తోఁచెను; నీకో
జలజాక్షి! నేఁడు నటులే
చెలువారుచు నుండె హృదయసీమయుఁ గాంచన్.

అధరమందలి రాగము లేక లౌహిత్యము సహజముగాని తాంబూలజముగాని కావచ్చును; హృదయమందలి రాగము ప్రేమాఖ్యము. ఇచట శ్లేషవలన నభేదాధ్యవసాయమునను రాగపదార్థము క్రమముగా ననేకముగఁ జెప్పఁబడుటచేఁ బర్యాయము.

గీ॥ దైత్యవీరలు శ్రీసహోదరత వెలుఁగు
సురల రత్నాహరణకేళి నూపినట్టి
లలితహృదయైక రసమును వలపుఁజేలుల
పల్లవాధరముల సుమబాణుఁడునిచె.    433

ఈ పద్యమున సుమబాణుఁడు లలితహృదయైకరసమును ప్రియాధరముల నునిచెననుటచేఁ బ్రయోజక నిర్దేశభేదము గన్పట్టుటచేఁ బర్యాయము. బింబాధరము సకలరత్నముల

కన్న నధికమనుటచే వ్యతిరేకముగూడ వ్యంగమగుచున్నదని కొందఱు పల్కుదురు. సకల రత్నసారసదృశ మధర మనుటచే నతిశయ గర్భితమై యుపమాలంకారము ప్రతీయమానమగునని యభినవగుప్తాదుల మతము.

పర్యాయ॥ కం॥ ఎఱ్ఱప్రియతమునందు నానెఱఁ
బెదవుల రాగంబు రాత్రి పేర్మినొసఁగె న
య్యదియె సవతుల కన్నుల
నుదయమునం గానవచ్చె నొక్కుమ్మడిగన్

ఇందు తాంబూలాది జనితరాగమునకును, మానకోప జనితరాగమునకును నభేదోపచారము గన్పట్టును. నిజమున కీరెంటికిని భేదమున్నను నభేదము కల్పింపఁబడుటచే నొకేరాగమునకు ననేక స్థలముల స్థితి వచింపఁబడెను. కాన నిదియుఁ బర్యాయమే.

కం॥ ఖలుల వచనములు మధురిమఁ
జిలుకుచు మివుల నమృతంబు చిందును మొదలన్
బలుకంగ నేల మోహము
గలిగించు హాలాహలంబు గాంచఁగ నదియే

ఈ పద్యమున ననేకములైన విషామృతము లొక్క చోటనే [ఖలులవచనములలో] కలవని చెప్పఁబడుటచేఁ బర్యాయము.

కం॥ ఇల నే పగతుర మగువల
వలుదచనుంగవ పెలంగి వన్నెలు మీరన్

జెలువారె తారహారము
లలరెఁ గన్నీటి బొట్టు లచ్చట నకటా!

ఇచటఁగూడ నొకచోటనే క్రమముగా ననేకము లున్నట్లు పలుకఁబడెను. ఒకటియై చెలంగిన పగతురమగువల వలుదచనుంగవ, వారి పతులు సజీవులుగా నున్నప్పుడు తారహారములఁ జెలువారెను; వారి పతులు విగతజీవులైనపుడు, బాష్పబిందు సందోహ మందే వెలుఁగొందుననుటచేఁ బర్యాయము.

సాధ్య సాధనముల మూలమున దేనినైన
సమర్థించి పలికినచో "ననుమానాలంకారము."

కం॥ నునుజెక్కులు తెలుపెక్కుట
గనుదమ్ములు మూతపడుట గమలాక్షిమనం
బున ననుపు కాని మోము నె
ల నెలకొని వెలుంగునని తలంపఁగవచ్చున్ [illegible]

ఈ పద్యమునఁగల విరహవర్ణనమునఁ జెక్కులు తెలుపెక్కుటయుఁ గనుదమ్ములు మూతపడుటయు సంభవించిన కతమునఁ గమలాక్షి మనమున ననుపుకానిమోము నెల నెలకొని వెలుంగుచున్నదని యూహింపఁబడినది. చంద్రుని కిరణములు సోకినంతనే వస్తువులు తెలుపెక్కుటయు, పద్మములు ముకుళించుటయుఁ బ్రకృతి సిద్ధము. ఇచటఁ బ్రియునిఁ బాయుట వలనఁ గలిగిన కపోలపాండిమము, నేత్రనిమీలనమును

రూపకవశమున విచ్ఛిత్తి సంపాదకమై యనుమానాలంకార ముగా భాసించుచున్నది. మరియు 'నాల్గుదెసలను ధార్మికా నమ్మకమున సంచరింపు'మను పద్యమునఁ గూడ యనుమానా లంకారమే చెలంగుననని కొండఱి మతమని మున్నే వేర్కొని యుంటిమి. ఈ పద్యమునకు ప్రతిగా 'లలిత జలకేళి తరళ కరతల ముక్తపిహితరాధికావదన' మను పద్యమున రూప కాలంకార మూలమున ననుమానాలంకారమునకుఁ బ్రతీతి కలదనియు నీ వరలో వచించితిమి. అటులనే పైపద్యమున ననుమానాలంకారము రూపకోత్ప్రేక్షాదుల మహిమచే వైచిత్ర్య పుష్టిఁ గలిగియున్నది.

౫౨౭ క॥ తెరవలచూపులు పడుకటఁ
గరకుం దూపులును నచటఁ గ్రమ్మిచు నుండుఁ
శరముల వెంటఁ దోడి ముం
దర మదనుం డేగు నంచుఁ దలఁతున్మదిలో.

ఇందు విచ్ఛిత్తి విలసనము కవిప్రౌఢోక్తి జన్యమై చెలం గుచున్నది.

క॥ కలదంచు నోనితంబిని
పలుకందగు నీదు మధ్యభాగం బదియుఁ
జెలువార కండు నేనిఁ
గెలత! పయోధరభరంబు నిలువదు సుమ్మీ.

ఈ పద్యమున స్తననితంబముల మధ్య మధ్యభాగము గానరాదు; కాని స్తనభారము మాత్రము చూచువారికే

గానవచ్చును. అందుచేత మధ్యభాగము లేనన్నచోఁ బయోధరభారమున కాధారమే లేకుండును. దాని యునికి కన్పట్టుటచే మధ్యభాగము గలదని యూహించుట కవకాశమున్నది. ఇట్లు నొకదానినుంచి వేరొకదాని నూహించుటచే నిందు ననుమానాలంకారము.

క॥ శీలము, శౌర్యము, రూపము
కౌలీనత విద్య గాంచి కమలాసనుఁడున్
బాలికను నభాగ్యంబున్
భావింప నొసంగునంచు భావింతుమదిన్. [illegible]

లోకమునఁ గన్యాదానమునకు బూర్వము తలిదండ్రులు వరుని కులశీలరూపాదులఁ బరీక్షించి తమ తనయల నిచ్చి వివాహ మొనరించుట సామాన్యముగ సంభవించును. అట్లనే ప్రజాపతియు తన ముద్దుకొమరితె ననఁగా నభాగ్యబాలికను వివాహ మొనరించుటకై కులశీలాది సంపన్నుఁ డైన వానిని వెదకి వానికి సహధర్మచారిణిగా నుండుటకై కన్యాప్రదాన మొనరించెనని పద్యమునందలి భావము. జగమున సాధారణముగ సత్పురుషులే దారిద్ర్య పీడితులగుటయు, జననీ జనకులు సత్పురుషులైనవారికే తమ కుమార్తెల ననుగ్రహించుటయు, సంభవించుటచే నీపద్యమున వీని రెంటికిని సాధ్యసాధన సంబంధము గూర్పఁబడుటచే నిచటఁ గూడ ననుమానాలంకారమే కానవచ్చును.

విశేషణములచే విశేష్యము సాకూతముగా
వచింపఁబడినచోఁ "పరికరాలంకారము".

గీ॥ మానధనులు, ధనార్చితుల్, మహితతేజు
లాజి సంప్రాప్తకీర్తులునై వెలుంగు
వీరవరుల సంహతులు నభేదవృత్తు
లసువులనొసంగి పోర నాయత్తులైరి.

ఈ పద్యమున వీరవరుల కుపయోగింపఁబడిన విశేషణములు సాకూతములు లేక సాభిప్రాయములునై ప్రకాశించుచున్నవి. 'వీరులు ప్రాణముల నొసఁగి యుద్ధ మొనరింప సిద్ధమైరి' యనునపుడా వీరులెట్టివారని ప్రశ్నించినచో వారికిఁ జెప్పఁబడిన విశేషణములన్నియు విశేషార్థ ద్యోతకములై కన్పట్టుచు విశేషణమునకు వైచిత్ర్యపుష్టిఁ గలిగించుటచేఁ బరికరాలంకారము. మానధను లనుటచే సంగ్రామరంగమునుండి పలాయమానులు గారనియు; ధనార్చితు లనుటవలన నుపేక్షారహితులనియు; నాజిసంప్రాప్తకీర్తులనుటచే మాహాత్మ్యవంతులు ప్రతాపశాలులనియు; మహితతేజులనుటవలనఁ బరులచే దుర్జయులనియు; ససంహతులనుటచే సహాయము నపేక్షించువారు కారనియు; నభేదవృత్తులనుటవలన నితరప్రయోజనానిరపేక్షులనియు; విశేషార్థము సంభవించి విశేష్యమును సాకూతముగాఁ జేయును.

గీ॥ విశ్వతాపనివారణ! ద్విజనృపాల!
యోగశాధార! నీవేల యూరకిష్వ

డబల నగునన్ను దయమాలి యక్కటకట!
క్రూరకరముల దహియించె దోరి చెపుము.

గీ॥ ఖర్వమొనరించితి మహేంద్రు గర్వభరము
లీలఁ గ్రోలి రూపంబు దాల్చితివి తొల్లి
నక్రముఖము చక్రమున భిన్నంబు సేసి
నీవు నన్నుఁ గాపాడఁ గాలేవె? దేవ!

రెండుపద్యములందును బరికరాలంకారమే. మొదటి దానిలోఁ జంద్రునకుఁ గల విశేషణములు విశేషార్థద్యోతకములై విరహిణీ సంతాప కార్యము న్యాయముగాదని బోధించును. ఇంక రెండవదానిలోని దాత్పర్యముచే ‘గోవర్ధన వసుంధరా గజేంద్రుల నుద్ధరించినవాఁడు భక్తుల నుద్ధరింపఁజాలఁడా’ యను విశేషార్థము వ్యక్తమగుచున్నది. కాన పరికరాలంకారము.

క॥ అమృతమయ! గగనశేఖర!
రమణీయాకార! చంద్ర! రజనీసఖుఁడా
సుముఖత ప్రియతమ నంటిన
సమకరముల నన్నుఁ గూడ సాకుము దేవా!

ఈ పద్యమునఁ బ్రోషితపతికాప్రార్థనమునఁ జంద్రున కుపయోగింపఁబడి విశేషణములన్నియు సాకూతముగానే చెలువారును.

సీ॥ కోరికల్ కొనసాగఁ గూరిమి మతి నిచ్చి
చెలువారఁ బెండిలి సేయువేళఁ
గన్యకామణి కరకమలంబు పతి పాణి
వారిజంబునఁ దండ్రి పదిలపఱచఁ

గేలుకేలఁ గదించు మేలిసుఖంబునఁ
బులకలు మెయినిండ మొలకలెత్తఁ
దత్తరపాటు చిత్తమ్మునన విధులెల్లఁ
దబ్బిబ్బులగురీతిఁ దానొనర్చి
గీ॥ "అహహా! శైత్యము హిమవంతు హస్తమం"చుఁ
బలుక శుద్ధాంత మాతృమండలగణంబు
చిరునగవుఁ జూపులం జూడ శిరముకొంత
వంచెడు శివుండు మిమ్ముఁ గాపాడుఁగాత!

ఈ పద్యమున వర్ణింపఁబడిన వధూవరుల పాణిగ్రహణ మహోత్సవమున, వరుఁడైన శంకరుని కొదవిన రోమాంచాది సాత్త్వికభావరూపమున, నిగూఢమై చెలంగిన ప్రమోదాతిశయము ప్రకటీకృతముగా, దానిని తుహినాచలకర సంస్పర్శ సంభూత శైత్యకారణతాసంజనిత చిహ్నములుగాఁ బ్రకాశిత మొనరించుటచే, నిందు వ్యాజోక్త్యలంకారము వెలుఁగొందుచున్నది.

ప్రమాణాంతరావగత మగుచున్నను, వస్తువు శబ్దముచేఁ బ్రతిపాదితమై, వేరొక ప్రయోజనము లేకయే, పోలికగల వేరొకవస్తువునందుఁ బర్యవసించినచో "పరిసంఖ్యాలంకారము" నాఁగాఁ గొంచెముకొంచెముగఁ బ్రశ్నరూపమున నడుగఁబడియు, వేరువిధముగఁ జెప్పఁబడియు, నదిమఱొక్క దానిని వర్ణించినచో "పరిసంఖ్యాలంకారముగాఁ" బ్రసిద్ధి వహించును.

చ॥ నరులకు సేవ్యనీయ మెది? తారకనాశని గాంగతీరమే
స్మరణ మొనర్చుచుండు రెది? మాధవు దివ్యపదారవిందముల్
ధరనెది కొల్వనౌను? సుకృతంబును; దేనిని గోరఁగా దగున్?
గిరిజను; ముక్తికాంత నెదఁ గైవశ్యం బొనరించువారికిన్.

గీ॥ నరుల కేది నగ? కీర్తి; రత్నంబు గాదు
చేయదగు నేది? సుకృతంబు; చెడుగు గాదు
కాంచు నన్నిటి నేది? బుద్ధి; కన్ను గాదు
పరఁ డెలుపుఁగునె నీకన్న బాగ నొగు.

గీ॥ కచనిచయమందు కౌటిల్య కలిమిగలుగు
కరచరణరదములను రాగంబు నిలుచుఁ
గుచయుగళమందుఁ గాఠిన్య గుణముగలుగుఁ
గలికి కన్గన్నులందు చంచలత నిలుచు.

గీ॥ భవుని పైభక్తి; కాదు వైభవమునందు
శాస్త్రమునరుచి; కాదు కౌమాస్త్రమందు
యశమునం జింత; కాదు దేహంబుకొఱకుఁ
గాన వచ్చు మహాత్ముల కథలసిట్లు

ఈ పై పద్యములు నాలుగును బరిసంఖ్యాలంకారమున కుదాహరణములు. అందు మొదటివి రెండును బ్రశ్నపూర్వకములై చెలంగ చివరవి రెండును నప్రశ్నరూపకములై చెలంగుచున్నవి. మఱియు నీనాల్గు పద్యములలో వస్తుకథనమున నొకటవ మూఁడవ పద్యములలోఁ బ్రతీయమానము వ్యవచ్ఛేద్యమై భాసిల్లగా, రెండవ నాల్గవ పద్యములలో వాచ్యము వ్యవచ్ఛేద్యమై ప్రకాశించును.

వెనుకఁ జెప్పఁబడినది ముందు చెప్పఁబడుదానికిఁ గారణమైనచోఁ "గారణ మాలాలంకారము." ఈయలంకారమునఁ దొలుతఁ బేర్కొనఁబడినది దాని పిఱుందవర్ణింపఁబడు దానికి హేతువై వెలఁగుచు దండ వలె నుండును.

450 క॥ వినయము జితేంద్రియత్వం
బునఁ గల్గున్ వినయగరిమ పుట్టు గుణములన్
గుణముల జనానురాగము
జనానురాగంబుచేత సంపదలొదవున్.

గీ॥ కలుగును శ్రుతంబు సాధుసంగతిని; శ్రుతము
వలన వినయంబు; వినయంబువలన నరుఁడు
వడయును జనానురాగము; వసుధలో జ
నానురాగముచేఁ బొందరానిదేది.

ఈ పద్యములో నొకమంచిగుణము వలన నింకొక సుగుణము గలుగుటచే, మొదటిది రెండవదానికిఁ గారణమై కన్పట్టును. జితేంద్రియత్వముచే వినయము, దానివలన గుణములు, వానిచే జనానురాగము, దాని కారణమున సంపదలు గల్గుచున్నవి. ఈ రీతిగానే రెండవపద్యమునఁ గూడ మొదటిది రెండవదానికిని, రెండవది మూఁడవదానికిని హేతువులై విలసిల్లుచున్నవి.

ఒక క్రియవలననే వస్తువులు తా మొండొంటికిఁ గారణము లయినచో "అన్యోన్యాలంకారము."

క॥ పరసుల సిరులకు నంచలు
సరసులచే నంచగాలను సౌరీకృతమై
తిరముగఁ దమలోఁ దా మొం
డొరులకు సొంపులు ముదంబు నొదవించు ధరన్.

క॥ ధనమునఁ బ్రజ్ఞ జనించును
ధనమా ప్రజ్ఞకు జనించు ధనాఢ్యస్థలిలో
ననయుఁ బిటులా ప్రజ్ఞా
ధనముల కన్యోన్యమైత్రి తనరుచు నుండున్.

గీ॥ నిన్నుఁగూడిన హాలేమ వన్నెగాంచు
హాప పొందిన పేర్యాని నందదీవు
రజనిఁగూడిన చంద్రుండు రాణకెందు
చంద్రుఁబొంది నిశీధిని చాలవెల్గు.

ప్రతివచనమును వినినవెంటనే ప్రశ్నవాక్యము మానసమున కవగమన మైనప్పుడును కొన్ని సమయముల ప్రశ్నానంతరమున నసంభావ్య రూపము లోకాతిక్రాంతగోచరము నైన సమాధానము వెలువడినప్పుడును "ఉత్తరాలంకారము."

గీ॥ ఎంతవరకును నాకోడ లింటిలోన
నకట! లలితాంగి కౌముది యగుచు మెలఁగు
హస్తిదంతము పులితోలు నంతదనుక
వర్తకా! నాకు నేరీతి వచ్చుఁ జెపుమ?

ఈ పద్యమునందలి భావ మొకానొక వర్తకుఁ డొక ముదుసలి బోయకాంతను 'మీయింట నమ్ముటకు నేనుఁగు దంతములును పులిచర్మములను గలవా' యని ప్రశ్నించి నట్లు చదువరులమదికిఁ బొడకట్టఁ జేయును.

గీ॥ అబల నేకాకిఁ దరుణియు నగుచునుంటి
నింటి యాతండు పరదేశ మేగె నకట!
యేని సాయ ముపేక్షింతు దీనురాల
నంధయుం జెవిటియును నాయత్త పాంధ!

ఈపద్యము 'పాంధుఁడు రేయి పరుండుటకుఁ దావడిగె' నను వగిది చదువరులకుఁ దోఁపఁజేయుటచే నాప్రశ్నమున కిది ప్రతివచనముగాఁ గన్పట్టును.

గీ॥ ధరణిలో నేదివిషమంబు? దైవగతియె
ప్రాప్తమెయ్యది? గుణగణగ్రాహి మైత్రి
సౌఖ్య మననేది? సద్వంశ జాతజాయ
దుఃఖమెయ్యది? కుజనుల తోడి పొందె.

ఈపద్యము ద్వితీయభేదమైన యుత్తరాలంకారమునకు లక్ష్యము.

ఇంగితాకారాదులలో దేనిచేనైనఁగాని లేక
యాకానాక ధర్మముచేఁగాని సూక్ష్మమైన
యర్థ మితరులఁవలన వెలిబుచ్చఁబడినచో
సూక్ష్మాలంకారము.''

ఇచట సూక్ష్మమైన యర్థ మనఁగా తీక్ష్ణమతులకు లేక కుశాగ్రబుద్ధులకు మాత్రమే గోచరించునది యని భావము.

క॥ నగుమొగమునుండి విరివిగ
దిగజారెడు చెమట మెడను తిలకము సెలఁగన్
మగువ మఁగసేత సూచిం
పఁగఁ జెలికత్తె కత్తిపటమున్ వ్రాసెన్.

ఇచట నాకృతి నవలోకించి విరివిగ దిగజారుచెమటఁ గరఁగి కుంకుమబొట్టు నాయికామణి కంఠసీమ నలంకరించుట వలనఁ బురుషాయితకేళి నూహించి చతురురాలైన సఖిమణి తానామె హస్తమున ఖడ్గలేఖను రచించుటచే వైదగ్ధ్యము ప్రకాశించుచున్నది. ఏలనన పురుషులకు మాత్రమే పాణితలమున కృపాణము యోగ్యమై చెలువారును, అట్టి యసిలతాలేఖన మిచటఁ గన్పట్టునటుఁజేసి నాయకామణీ వీరవిహారము సూక్ష్మభంగి సూచింపఁబడెను.

గీ॥ కలసికొనువేళఁ దెలియంగఁ దలఁపువుట్టి
చాల తహతహపడు విటు జాణగాంచి

చిరునగవు గనుఁగొలఁకులఁ దురఁగలింపఁ
గరమునందలి కమలంబు గప్పి వైచె.

ఇచట నేత్రోత్సాహరూపమున నింగితమును గుఱుతించి సంకేతకాలాభిలాషియైన కాముకునకుఁ గామినీమణి చేష్టావ్యంగ్యమూలకమున సమాధాన మొసంగుచున్నది. కర కమల సమ్మీలనమున నిశాసమయము సంకేతసమయమను సూచనము గలదు.

ఒకదానికన్న నింకొకటి తుదిదనుక వన్నె
గాంచుచున్నచో «సారాలంకారము.»

౫౸౧ క॥ పరిపాలనకుఁ జారము
ధరయే, దానికిఁ బురంబు, దాన గృహము, మం
దిరమునఁ దల్పం బందున
సరసిజముఖియే రతీశసర్వస్వముగన్.

కార్యకారణ భూతములైన రెండుధర్మములెచట
భిన్నదేశ మూలకముగ నత్యంతము వివరింపఁ
బడునో యచట «నసంగత్యలంకారము»

క॥ వెలయఁ నరుని కెట నటనే
పలుఁ బెత్తునటన్న నుడి యసత్యమును బూ్ని

చెలిచెక్కిట పలుగాటులు
పాలుపారఁగ సవతులకును బొటొత్తు గదా!

క॥ మును విని కని యెఱుఁగము గద
కనకాంగిరో! యిట్టిఁయింత గలదంచు విషం
బును విషధరములు గ్రోలఁగ
మునిగిరి పెనుమూర్ఛ పథిక పూర్ణేందుముఖుల్.

గీ॥ ఆమె తన సుకుమార తరాంగకములఁ
బూల మురిపెంపు సోయగముల హరించె
నవనిఁ దిరుగాడు కొమరుఁ బ్రాయంపు వారి
నలరువిల్తుఁడు ప్రహరించె నక్కటకట!

గీ॥ జఘనభరమున నడువీథి జనుచు నామె
వనటపాల్జేసెఁ గోమల పాదములను
నట్టి రూపవిలోకనా యాసమునను
వనటపాలైరి కటకటా! వయసువారు

ఈపద్యములనెల్లఁ గారణ మొకచో నుండ కార్య మింకొకచోఁ గానవచ్చును.

కారణాంతరయోగమునఁ గార్యము సుకర
ముగా సంభవించినచో «సమాధ్యలంకారము.”

క॥ తరుణికిఁ గోపముపోవఁగఁ
జరణద్వయమునకు నేను సాగిలి మ్రొక్కన్ 465

దరితో ఘనగర్జాడం
బర ముపకారంబు సేసె భాగ్యంబది రా;

ఇచట కోపశాంతికొఱకు నాయకుఁడు మానినీమణికి నతిరూపక సాంత్వనోపచార మొనరించుచుండెను. అందుచేఁ బాదపతన హేతువు మానాపనయన కార్యమును బుట్టింపఁజాలి యుండగా ఘనగర్జిత మను కారణాంతర యోగముగూడ సమకూడెను. దానివలన లేశమేనియు క్లేశము లేకుండఁగనే నాయకుని బ్రియత్నము సఫలమాయెను. కావున దీనిని సమాధ్యలంకారమందురు.

ఎచట యోగ్యతామూలకమై వస్తువు లొం
డొంటికిఁగూడిక సర్వసమ్మతముగా జతపడునో
యచట "సమాలంకారము."

౪౬౬ గీ॥ ధాతృశిల్పాతిశయ కపస్థాన మీమె
రూపమున నోడిపోయె స్మరుండు నీకుఁ
గళిగెఁ గూటమి దైవసంఘటన మీవు
రమణరాజ్య మేకాతపత్రముగఁ గాఁగె

గీ॥ ఖలులు భువిఁగూడబెట్టిన కలిమి యెల్ల
ననుభవించెద రవని దుర్జనులె మున్ను

పరువు మీఱిన యా వేపపండ్లనెల్ల
తెనరుమెయి కోకిలోకము దినుటలేద.

ఇచట మొదటిపద్యమున సద్యోగమూలకమును రెండవ దానిలో నసద్యోగ ఘటితము నై సమాలంకారము గాన వచ్చును.

ఎచట నత్యంతము విలక్షణమైన వస్తువులకు సంఘటనము సముచితము కాదో, యెచటక్రియా ఫలావాప్తి కర్తకుఁ జేకూరక దానికిమాఱుగ ననర్థము సంభవించునో, యెచటఁగార్యకారణ ముల గుణక్రియలు క్రమముగా విరుద్ధము లై సమకూడునో యచటనెల్ల (విషమాలంకారము'

క॥ లలిత శిరీషమృదుత్వము
దలడన్నెడు నాయతాక్షి తనువున కెనయే?
తెలపఁ గుకూలాగ్ని సమం
బలఘుకఠోరంబు మన్మథానల మకటా!

గీ॥ సింహికాసుతసంత్రస్త చిత్తయగుచు
శశము శీతమయూఖు నాశ్రయము గాంచెఁ
జోద్య మరయఁగ సింహికా సుతుఁడు బల్మి
సాశ్రయంబుగఁ బట్టి తా నాఁగించె.

గీ॥ ప్రతిరణంబున నీకర స్పర్శనంబు
వడయఁగ తమాలనీల కృపాణరేఖ

త్రిజగదాభరణము శరదిందుపాండు
యశము విచిత్రముగఁ గను నవనినాథ!

క॥ జలజాక్షి నీవు నాకున్
గొలదికి మీఱిన ముదంబు గూర్తువు; కుటి నీ
వలనన్ బుట్టిన విరహం
బొడలికి తాపంబు మిగుల నొదవించుఁగదా.

క॥ రణరణకము పరితాపము
తనుకార్శ్యము జాగరంబు తహతహయే నా
కనుభూత సుఖము లయ్యెను
వనజాయతనయనఁ గనిన ఫలమున కకటా!

గీ॥ ఎవఁడు కల్పాంతమున నెల్ల భువనములను
విపుల జఠరంబులోనికిఁ బీల్చుకొనియె
నతని మదవిభ్రమాలస యైన పౌర
విద్రుమాధరి క్రీఁగంటఁ బీల్చుకొనియె.

ఇందు మొదటిపద్యమున శిరీషమృదు శరీరమునకును గఁకూలాగ్నితుల్య మన్మథానలమునకును వైషమ్యము గాన వచ్చును. రెండవపద్యమున సింహికాసుతుఁడనుటచే సింగపు గొదమకును రాహువునకును సర్ధముగలదు. కావున శశమునకు నాధారము లేకుంటయేకాక మహానర్థముగూడ సంభవించెను. మూఁడవపద్యమున నల్లనికత్తికిఁ దెల్లనికీర్తి పుట్టుటచేఁ గార్య కారణములకు విరోధము. ఇంక నాలుగవ, యైదవపద్యము లలో మోదమునకు మాఱుగ ఖేదమును సౌఖ్యమునకు బదులుగ దుఃఖమును గలిగెను. ఇంక నారవపద్యమున పానకర్త్ర

కన్మతారూపమైన వైషమ్యమున్నది. ఇటుల లెక్కకు మించిన భేదముల నెన్నిటినో బుద్ధిమంతులు గ్రంథాంతరమున నూహింపఁజాలుదురు.

వర్ణనీయోత్కర్షాపేక్షకొఱకై కొలఁదిగానున్న యాధారాధేయముల గొప్పగా నుతించినచో నధికాలంకారము.”

గీ|| తొడఁబడి విస్తీర్ణ నిర్మలోత్తుంగములుగఁ
బెరుగు హృదయగగన పయోధరము లరయ
నోమహీపాలశేఖరా! భూమి వీనిఁ
గప్పుటకు నేరికైనను గలదె శక్తి?

క|| తనకన్న మిఁపులఁ బెద్దగఁ
దనరెడి నీకీర్తి నెల్ల ధరియించుటచేఁ
గన భువనత్రితయోదర
ము నృపా! కడుగొప్పదగుచుఁ బొలుపొందు నహో.

గీ|| సర్వజగములఁ గల్పాంత సమయమునను
సంహరించి లోఁదాపఁగాఁ జాలు కైట
భారి తనలో నడంప లేదయ్యె నహహ!
నార దాగమనమునను జేకూరు ముదము.

ప్రతిపక్షమునకు బ్రతీకార మొనరింపలేక వాని నాశ్రయించినవానిని దిరస్కరించినట్లు వివరించుచు నుతించినచోఁ «ప్రత్యనీకము.”



క॥ విను నిర్జిత మన్మథ రూ
పుని యందనురక్తయయ్యెఁ బూఁబోఁడి కటా;
కినుకం గాముఁ డొకేతరి
వనితం బీడించు పంచబాణంబుల చేన్.

క॥ తనుమధ్యా! నీమధ్యము
తన నడుముం గెలిచెనంచు ధర కేసరి నీ
స్తనకుంభ నిభంబగు వా
రణకుంభములన్ సతంబు వ్రియ్య లొనర్చున్.

క॥ తనతలఁ ద్రుంచిన వైరం
బును దీర్పం దరముగామి మురరిపువదనం
బును బోలిన రాకాచం
ద్రుని రాహువు బాధసేయుఁ గ్రోధంబు మెయిన్.

ఆగంతుకము లేక స్వాభావికమునైన సమానమైన చిహ్నముగల వస్తువుచే నింకొకవస్తువును మఱుఁగుపఱచినచో "మీలితము."

గీ॥ అధిప! నీదాడికోడి హిమాద్రిగుహల
మెలఁగు పగతురు వణఁకుచుఁ బులకములను
వివశులై మేనఁ దాల్చిరి; భీతి నకట!
జడులు గూడ నభిజ్ఞులై పొదల రహహా?

చ॥ ఉడిముడిపాటు జంకెనల చెల్వము చిమ్మెడు వాలుఁజూపులన్
గడుగడి ముద్దులొల్కు నుడికారము సొంపుల నీటుమాటలన్

దడఁబడుచుండు నెన్నడల నైపుణియుఁ మొదలైన సాత్త్వికో
త్కలికలు స్త్రీలకుఁ మదవికారముగాదు తనూవిలాసముల్

ఇచట మొదటిపద్యమున పకతురకుఁ గలిగిన వణకు పులకములు హిమాలయకందరముల నివసించుటవలన నచటి చలివలన వచ్చినవిగా బుద్ధిమంతులు దలంతురు. కాని పులకకంపములు భీతివలనఁ గలిగినవికాని మఱివేరు కాదు. బుధులుగూడ పొరపడుచుందురనుటచే నిట నాగంతుకమైన మీలితాలంకారమున్నది. ఇంక రెండవపద్యమునఁ దరళాపాంగములు, మధురవక్రవచనములు, విలాసమంథరగమనములు మొదలైన చిహ్నములు మధుపానజన్యములుగావు; కేవల సాత్త్వికలీలలనుటచే నిట స్వాభావికమైన మీలితాలంకారము సిలంగును.

మొదట వచింపఁబడిన వస్తువు పిదపఁజేర్కొనఁబడిన వస్తువుచే బహుళముగ విధింపఁబడినపుడును నిషేధింపఁబడినపుడును "ఏకావళ్యలంకారము."

క॥ పురమునఁ దరుణీమణి,
తరుణీమణికిఁ సురూపతయును సురూప
స్ఫురణంబునకు విలాసం
బరయఁ మనసను విలాస మస్త్రముసుమాస్త్ర.

గీ॥ తమ్మిపువ్వులేకున్న జలమ్ముగాదు
తుమ్మెదమెలంగకున్న నెత్తమ్మిగాదు ౪౮౩

మించి రొదసేయుచున్న తుమ్మెదయుగాదు
చిత్తము హరించుచున్న గుంజితము గాదు.

ఇందు మొదటిపద్యమునఁ బుష్పమునకుఁ దరుణీము నామెకు రూపమును, దానికి విలాసమును, నదియేమనునకు కరకుటమ్మునియు: గ్రమాక్రమముగా విశేషణము విధింపఁ బడెను. ఇంక రెండవపద్యమునందుఁ బై విధముగనే క్రమక్రమముగా నిషేధము వచింపఁబడెను.

పోలికగలవస్తువు నొకదానిని గాంచినంతనే తానీవరలో ననుభవించిన యర్థములు తలంపు వచ్చినచో "స్మరణాలంకారము"

గీ॥ చంచలాక్షులు జలకేళి సల్పువేళ
నిమ్ననాభిబిలంబుల నీరుసారఁగఁ
బుట్టు బహుబహుధ్వనులు ముద్దియలకు
సురతకంఠరుతంబుల స్మరణ గొల్పె

485 క॥ కాటుకపిట్టల రవతో
సీటారెను తమ్మిపువ్వు సెగనుఁగొనఁగా
బోటి నిగనిగని కన్నుల
తోటి మరిపెంపు నగుమొగము దోచుఁ మదికిన్.

ఈరెండుపద్యములలోఁ బ్రస్తుత జన్మమునఁ దాననుభవించిన సౌఖ్యములు స్మృతికిఁదగిలెను. అందు మొదటిపద్య

మున నాయికానుభూతసుఖమును, రెండవదానిలో నాయకుఁ
డనుభవించిన సౌఖ్యమును లక్ష్యములుగా నొసంగఁబడెను.

గీ॥ చిన్ని చేతులతోఁ దల్లి చన్ను బట్టి
చిగురుఁ బెదవులఁ జను మొనఁ జేర్చినపుడు
పాంచజన్యము తలపోయు బాలకృష్ణు
మేనిపులకల కంజలి నేనొనర్తు.

ఈపద్యమున జన్మాంతరానుభూత సౌఖ్యము స్మరణకు వచ్చెను.

పోలికగలవస్తువు నొకదానిని గాంచినంతనే
దానిని వేరొక వస్తువుగాఁ దలంచినచో
"భ్రాంతిమదలంకారము."

క॥ పలుమారు జారుదారికి
వలపుల చెలికాని వెంటఁబెట్టు మఱదియు దా
నిలువరగా వర్షపు ధా
రల నే చేయూత కౌఁగరంబులఁ జాచున్.

క॥ విరహము సంగమములలో
విరహము సంగమము కన్నఁ బ్రియము గూర్చున్
వరుఁ డొకఁడే సంగమమున
విరహమునం ద్రిభువనముల [illegible]

చ॥ తలపయి పిల్లి పాలమును దాగనఁగ నాలుకసాచు; చెట్టుతో
ఉట్టిల వెలివచ్చు [illegible] గజముఁ; కాముకే 489

ళులఁ దమిదీరినట్టి సతులుఁ దమపుట్టములంచు వెన్నెలన్
దలిమము లాగుచుందురు; సుధానిధిలోకము భ్రాంతి గొల్పెడిన్.

ఈ మూఁడుపద్యములలోను భ్రాంతిమదలంకారమే భాసించును. మొదటిపద్యమున నభిసారిక కామోద్రేకమున వర్షపుధారలనే చేయూతగా గ్రహించెను. రెండవపద్యమున విరహోత్కంఠితకు నేదిక్కునఁగాంచిన నాదిక్కుననే వలపుఁ జెలికాఁడు కన్నులకుఁ గట్టినట్లు కానవచ్చుటచే విరహమే సంగమముకన్నఁ బ్రియతరముగ వర్ణింపఁబడెను. ఇంక కడపటి పద్యమున పండువెన్నెలలు గాయుచుండ నాతళతళలఁ గాంచి నంతనే మారాల మాతంగ మానినీమణులుగూడ భ్రమకు లోనైరి.

ఉపమానమును బ్రయోజనాశూన్యమని యాక్షేపించినపుడును లేక తిరస్కారనిబంధ నార్థమై ప్రసిద్ధోపమానమునకు నుపమేయ భావమును గల్పించినపుడును “ప్రతీపాలంకారము.”

490 క॥ వనితాలలామ! దయతో
వినఁదగు పలుకుల రవంత విని పోఁగదవే!
యణుమధ్యా! నీమోమును
జనములు చంద్రునకు సాటి సల్పుదురు సుమా!

క॥ తలకున్ మీరిన గర్వం
బిల నీకన్నుల వహింతు వేలా? బాలా!

కలవీ చెలువపు నీలో
త్పలములు జలజాకరమున పందలువేలుగా.

క॥ అరయ నేనేగురుడను
దారుణత కటంచుc దుర్భిక్షc దగదు గరళమా!
ఘోరతరంబై కాల్చుచు
ధారుణి దుర్జనుల నుడులు తేనరాదు సుమీ.

వీనిలో మొదటిపద్యమున నుపమానమున కుపమేయ త్వము కల్పింపcబడెను; రెండవదానియందు లోచనములకుc దిరస్కారముగూర్పcబడెను. మూcడవపద్యమున హాలాహలము నకు ఖల వచనోపమానత్వ మసంభవమైనను సంఘటత మగుటచే నీ పద్యముల ప్రతీపాలంకారము ప్రకాశించు చున్నది.

ప్రస్తుతమునకు నితరమునకుగల గుణసామ్య వివక్షచేతను లేక యైకాత్మ్యముచేతను యోగ మునుగూర్పcబడినచో "సామాన్యాలంకారము"

గీ॥ చారుమల్లికామాలికాధారిణులును
సరవి సర్వాంగ సంలిప్త చందనులును
క్షౌమవతులైన యభిసారికలను పొందు
చంద్రికారాత్రులం బోల్ప శక్యమగునె?  ౪౧౩

కొందఱిందతిశయోక్తియు మఱికొందఱు మీలితముగల దందురు. కాని దీన సామాన్యాలంకారమే చెలువారుచున్నదని తలంపవలయు.

క॥ మిఱుమిట్లుగొలుపు రూపము
మెఱయు ప్రతాపము వెలుంగు మేటికళలతో
ధరణీశ! నినుసృజింపఁ
మరునిఁ రవినిఁ గురునిఁ విధాత మఱల సృజించెఁ

౫౦౦ గీ॥ సఖియు, నెచ్చెలి; బంటును, జంటనేర్చు
లలితకళలను బ్రియశిష్యురాలునైన
ముద్దుగుమ్మను దయలేక మోసగింప
మృత్యువింక నెద్దాని హరింపకుండు?

ఈ పద్యముల రెండింటను నొకపనిని జేయఁబూని యశక్యకార్యాంతరమునుగూడ చేయుటచే నిదియు విశేషాలంకారభేదమే. ఇందు మొదటిపద్యమున శాబ్దముగు రెండవ దానిలో వ్యంగ్యమునై యలంకారము సెలంగును.

ఈ విశేషాలంకార భేదములనెల్ల సవిమర్శదృష్టిఁవిల కించినచో నతిశయోక్తియే ప్రాణప్రాయమై ప్రకాశించునని చెప్పక తప్పదు. కాన నతిశయోక్తి లేనిచో నలంకారము లేదనియే చెప్పనొప్పును. అందుచేతనే కాఁబోలు భామహాచార్యులీక్రింది శాసనమును విధించెను. ".ఈ వక్రోక్తియే యన్నిచోట్లను జెలంగును. దీనివలననే యర్థము విశేషముగ భావింపఁబడును. కావున కవీశ్వరుఁడు దీనికై ప్రయత్నింప వలయు. ఇది లేనిచో వేఱుగ నలంకారమేదిగలదు?"

ఈభామహాచార్యుల శాసనమునావలఘరించియే నవీనాలంకారికులు ప్రాయశముగ వక్రోక్తియే లేక యతిశయోక్తియే

కావ్యజీవమనియు సర్వాలంకార బీజ భూతమనియు వచించిరి.

> ఒకానొకవస్తువు వేరొకదానితోఁగూడి దాని వన్నెలొల్కు గుణమువలనఁ దనగుణమును వీడి రెండవదానిగుణమును గైకొనినచోఁ "తద్గుణము."

గీ॥ అరుణుచే భిన్నవర్ణంబులై వెలుంగు
భానురథఘోటకములు రైవతకగిరి సె
లంగు వంశకకీరనీలంబులైన
మణుల దీప్తిని దమకాంతి మఱలదాల్చె.

క॥ తొలుతక్ వానర మదియుక్
గలుదాఁపుట మత్తుక్రిమ్మి కడలఁజరించెక్
అలి తేలుగుట్టె భూతం
బలమె నికక్ దాని గంతు లలవియె పొగడక్? 50½

ఇందు మొదటిపద్యమునఁ దద్గుణద్వయము గలదు. తొలుత నరుణుని యెఱ్ఱఁ దనమును బిదప వెదురు మొలకలవంటి మణుల పచ్చదనమును సూర్యుని గుఱ్ఱములకుఁ గలిగెను. ఇఁక రెండవపద్యమునందుఁ బుట్టినప్పటినుండియుఁ దనకున్న గుణము మఱికొన్నిటి పొందువలన నంతయును బంతును మీఱి పెంపొందెననుటచే నిచటఁగూడ తద్గుణాలంకార విశేష ముగనే యలంకారికులు పల్కుదురు.

దానిరూపమును జేకొనకున్న చో ననతద్గుణము."

५०३ క॥ డెందమురంజించితివో
సుందర! ధవళుండవైన; నుచిరము నిను నా
డెందమునం దుంచిననో
సుందర! రక్తుండవగుచుం జూపట్టవదేమా!

క॥ తేటతెలినీటి గంగన్
గాటుకనీళులంజెలంగు కాళిందినదిన్
మాటికి మున్గిన నీకిం
నీటులు రావింకం బోవు నిజమో హంసా!

ఇందు మొదటిపద్యమునం బూర్వార్ధమున విరోధము గన్పట్టును. ఉత్తరార్ధమున భిన్నాధారత్వమున రక్తారక్తత్వ ప్రతీతిగలదు. రక్తమైన నా హృదయమున నిను చిరముగ నుంచినను నీవు రక్తుండవు గాకుంటివనుటచే 'ననతద్గుణాలంకారము' గలదు. నీవు ధవళుండవైనను డెందము రంజించితివనుటచే మొదటి సగమున విరుద్ధరాగ జనకత్వముచే విషమాలంకారముగూడం గానవచ్చును. ఇంక రెండవపద్యమునందు నన్యాప దేశపక్షమున రాజహంస మప్రాకరణికమై సత్పురుషప్రశంస ప్రాకరణికమై చెలంగుచున్నది. మఱియు నీపద్యమునం బ్రకృతమున హంసమునకు నప్రకృతజలయోగమున్నను మేని తెలుపుకెలుపులు గంగాజలములం దేలియాడుటచే హెచ్చలేదు. యమునాంబువుల నడయాడుటవలనం దగ్గిపోలేదు. కావున ననతద్గుణాలంకారము గానవచ్చును.

ఒకరిచే నొకవిధమున సాధింపఁబడిన కార్య మింకొకరిచే నటులనే తారుమారొనరింపఁ బడినచో «వ్యాఘాతము.»"

క॥ కన్నులుఁగాల్చెను మన్మథుఁ
గన్నులు వెస జీవమిచ్చి కాపాడెను; నే
రెన్నిక ముక్కంటిఁ గెలుచు
కన్నెల ననుసోగవాలుకనుల నుతింతున్

గీ॥ చిత్తమందున దారిద్ర్య చింతనాని
విడువఁగాలేఁడు లోభి దా విత్తమెపుడు
గాఢముగ మది నా చింత నాటుకొంట
విడువఁగా నోపు దాత దా విత్తమెపుడు ౫౦౬

ఇచట ముక్కంటికంటిమంటఁ గాలి నీఱైన మనసిజుఁడు మఱల మానినుల ననుసోగవాలుఁగనుల జీవముదాల్చి చెలంగె ననుటచే మొదటిపద్యమునఁ గనులకు దాహహేతుభూతత్వ మును దాని విపరీతకార్యమైన జీవనసంపాదనావ్యాపారమును రెండునుగూడ కల్పింపఁబడెను. అందుచే వ్యాఘాతాలంకా రముగలదు. ఇంక రెండవపద్యమున దారిద్ర్యచింతచే విత్తమును లోభి విడువఁడు. దాత విడుచుననుటచే నిచట తాత్కాలిక జన్మాంతరీయదారిద్ర్యశంక వారివారి మనంబులఁ గలదని గ్రహింపవలెను. అందుచే నిచటఁగూడ వ్యాఘాతమే చెలంగును.

ఇవియే వేరువేరుగ నొక్కచోటనే కలసిమెలసి
చరించినచో "సంసృష్ట్యలంకారము." అనఁగా
పైనరచించిన యలంకారములే యొండొంటి
కంటువడక యొకచోటనే శబ్దమూలమునఁ
గాని యర్థవిషయమునైన నుభయముగనేని
కూడిమాడి చెలంగినచో "సంసృష్ట్యలంకార"
మని పేర్కొందురు.

509 గీ॥ వన్నెచిన్నెల నీకన్నె మిన్న మించి
మెఱపుకరణిఁ గనుల్ మిఱుమిట్లుగొల్పి
యువమనోలుంఠనంబయి యొప్పులొలుక
లేమ లీగ్రామమున వేర లేరు సుమ్ము.

ఈ పద్యమున ననుప్రాసరూపకంబుల సంసృష్టి గాన
వచ్చును.

గీ॥ పొలుపుగా మేన చీకటి పూసెననఁగ
గొప్పగా మిన్నుకొలుకు గురిసె ననఁగ
క్షితితలంబునఁ జెనటుల సేవవోలెఁ
జూపు విఫలతచెందునో సుందరాంగి

ఇందుత్ప్రేక్ష యుపమానమును వేరువేఱఁ గన్పట్టు

విశ్రాంతిలేకుండుటవలనఁ దామంగాంగిత్వమున
వెలుంగుచున్నచో "సంకరాలంకారము"

అనఁగా నలంకారములకు స్వతంత్రశక్తి చాలక పోవుటచే నొకటి వేఱొకదానిపై నాధారపడియున్నచో 'సంకరమ' ని వచింతురు.

క॥ నయనానందప్రదమై
ప్రియమూపాదించె నిందుబింబం బదుగో
వియదంతర వినిరుద్ధం
బయినం దిమిరము విశీర్ణ మయ్యెడుఁ గంటే?

క॥ కలువలుగన్నులు ముల్లెల
పలువరుసగ నిందునెలను వదనంబుగ నీ
జలమున స్థలమునఁ జదలఁ
గల చెలువముజేర్చి బ్రహ్మ కాంత సృజించెఁ 510

ఇచట మొదటిపద్యమున ననేకాలంకార సంశయము గోచరించును. ఇందు మొగముతోటిపాటుగా నభేదమారోపింపఁబడుటచే నిది యతిశయోక్తియా? లేక మోమును లక్షించి చంద్రుని సమారోపణము సంభవించుటచే నిది రూపకమా? కానిచో ముఖనైర్మల్యప్రస్తావమూలకమున నప్రస్తుత ప్రశంసయా? ఇచట సముచ్చయమైన క్రియా సంకలితమైన దీపకముగలదా? పరిదోషవర్ణనమున విశేషణసామ్యము విలసిల్లుటచే నీపద్యమున సమాసోక్తి చెలువారుచున్నదా? అట్లుగాక మదనోద్దీపకమైన కాలము సమీపించుచున్నదను తాత్పర్యము సంభవించుటచే నిందు పర్యాయోక్త్యలంకారము ప్రకాశించునా? అను సంశయము చదువరులకుదయించును, కాన దీనిలో ననేకాలంకార

సంకరము చూపట్టెను. ఇంక రెండవపద్యమునం దుపమా రూపకాలంకారములకు సంశయము పొడగట్టెను.

ఇటులనే తక్కినచోట్లందియు మహాకవుల సాహిత్య సాగరమునుండి కావ్యామృతసారమును విబుధవరేణ్యులు పడసి మనసారం గ్రోలి మైమఱచి పరబ్రహ్మాస్వాదానంద సబ్రహ్మచారి సౌఖ్యము ననుభవింపఁగలరు.

---

# అలంకారమంజరి.

## అనుబంధము 1

## శబ్దము

### అభిధ

శబ్దమునకు మూఁడు శక్తులుగలవు. అభిధాశక్తి; లక్షణాశక్తి; వ్యంజనాశక్తి. ఆయాశక్తులవలన నాయా వృత్తులు పుట్టును. ఈశక్తుల ననుసరించి వ్యాపారములు జనించును. ఆయా వ్యాపారములవలన నాయా అర్థములు కలుగునని వైయాకరణుల సిద్ధాంతము. ఇటుల శబ్దమునకు శక్తియు, దానిచేవృత్తియు, దానివలన వ్యాపారమును, దాని ననుసరించి యర్థమును వచ్చుచుండును. అందుచే వాచక, లక్షక, వ్యంజకములని శబ్దసముదాయము త్రిమూర్త్యాత్మకమై చెలువారును. కావున అభిధ, లక్షణ, ధ్వననమని వ్యాపారము గూడ హరుని నేత్రములవలె జగమును ప్రకాశింపఁ జేయును. ఇంక సరస్వతి గంగానదివలె పరమపావనమై త్రిపథగామినియై వాచ్య, లక్ష్య, వ్యంగ్యార్థముల నొసఁగుటచే సహృదయులచే నుపాసింపఁబడుచున్నది.

ఈ మూఁడువిధములలో, అభిధ, లేక వాచకమెట్టిదనగా "శక్తిచే ప్రతిపాదితము అభిధ"నాబడును.

ఈశక్తి; ఈశ్వరేచ్ఛ; వక్త్రిచ్ఛావిశేషము లేక ఇచ్ఛామాత్రము. ఈ రెండవదానిని వృద్ధవ్యవహారమని కొందఱందురు. దీనినే సంజ్ఞ లేక సంకేతమని పిలుతురు. ఈసంకేతము చిరంతనము లేక ప్రాచీనము; ఉదా- హరి; హరుఁడు; ఆధునికము లేక నవీనము ఉదా- బుద్ధి; కుర్రి, అని పేరొందెను. అందుచే "సంకేతితార్థ గోచర శబ్ద వ్యాపారము అభిధ" యనఁబడును.

ఈ అభిధ; రూఢిపూర్వము; యోగ పూర్వమని ద్వివిధమని విద్యానాథుఁడు రచించెను. అప్పయదీక్షితుఁడు రూఢి; యోగము; యోగరూఢమని రచించెను. ఇచట అఖండశక్తిలేక సముదాయశక్తిని, రూఢియనియు; అవయవ శక్తిని, యోగమనియు; రెంటి సంకరమును యోగరూఢి యనియునందురు. ఉదా-కుశలుఁడు; పాచకుఁడు; పంకజాదులు.

నైయాయికులు శబ్దమును ముఖ్యము; గౌణమనియు, వీనిలో మొదటిది, యౌగికము; రూఢము; యోగరూఢము యౌగికరూఢమనియు విభజించిరి. ఉ॥ పాచకుఁడు; గోమండపము పంకజము; ఉద్భిదము.

వైయాకరణ మహాభాష్యకారులు జాతి; గుణ; క్రియ; యదృచ్ఛాభేదముల శబ్దములు నాలుగువిధములుగా వచించిరి. ఉ- ఆవు; తెలుపు; వంట; బుద్ధి; అలంకారమంజరియందీమత మనుసరింపఁబడెను.

జయ దేవాదులు ధర్మిను షడ్విధము; దాని ననుసరించి శబ్దమూరువిధము లందురు. ఎట్లన- జాతి; ఉ॥ ఘటము; గుణము; ఉ॥ శుక్లము; క్రియా; ఉ॥ పాకము; యోగము; ఉ॥ దండి; యదృచ్ఛా; ఉ॥ డిత్థ; నిర్దేశము; ఉ॥ కంసుఁడు.

ఇట్టుల "సమయాపేక్షచే వాచ్యమును బోధించు శక్తిని అభిధాశక్తి" యందురు. దానిమూలమున వచ్చునదియే అభిధార్థము. ఇది నిరంతరార్థనిష్ఠము. ఇందు అభిధ, వాచ్యము ముఖ్యములను పదములోకే యర్థమును సూచించు నామాంతరములు.

లక్షణ

ఈ లక్షణను,అభిధాపుచ్ఛ భూతమందురు. ఇది సాంతరార్థనిష్ఠము. అభిధాశక్తివలన శబ్దము నుచ్చరించిన వెంటనే అర్థావగమనము కలుగును. ఉచ్చారణకును, అర్థబోధకును అంతరముండదు; ఎడము లేకయే ఉచ్చారణను వెంటనంటి అర్థము అభిధ వలన బోధపడును. ఇక లక్షణయందు నంతరముండును. ముఖ్యార్థబాధ, అనగా అభిధార్థమునకు బాధలేక అన్వయానుపపత్తి; రూఢి; ప్రయోజనము లీమూడును లక్షణకు బీజములు. ఇవి కలిగినప్పుడే లక్షణవర్తించు. అభిధకువలెనే, లక్షణకుగూడ శక్తి, వృత్తి, వ్యాపారము, అర్థమును క్రమముగ సంభవించును.

"ముఖ్యార్థ సంబంధముచే శబ్దప్రతిపాదకత్వము లక్షణ" యనఁబడును. ఈ లక్షణ; సంబంధము; సాదృశ్యము;

సమవాయము; వైపరీత్యము; క్రియాయోగమని ముకుళాదులచేఁ బంచవిధములుగా విభజింపఁబడెను.

అప్పయ్యదీక్షితులు సాదృశ్యగర్భ మైనచో, గౌణి యనియు; తదన్యసంబంధ నిమిత్తము వలన శుద్ధమనియు, రెండువిధముల వచించిరి. ఈగౌణి, శుద్ధములను రెండు లక్షణా విధములును, ప్రత్యేకముగ; నిరూఢ లక్షణ; ఫలలక్షణయని రెండు తెఱఁగులఁ బేర్కొనఁబడెను. రూఢితుల్యతచే, నిరూఢి లక్షణయు, వివక్షితార్థాంతరద్యోతన ఫలమగుటచే, ఫలలక్షణ యనియు వచింపఁబడును.

ఇట్టుల జహల్లక్షణ [విడిచే లక్షణ]; అజహల్లక్షణ [విడవని లక్షణ]; జహదజహల్లక్షణ [విడిచీ విడవని లక్షణ]; సారోపము; సాధ్యవసాయము; శుద్ధము; గౌణమునను ఫల లక్షణ సప్తవిధములుగ అప్పయ్యదీక్షితులవారురచించిరి. ఇచట శుద్ధము పంచవిధము, గౌణము ద్వివిధము గలసి సప్త విధమయ్యెను. "విషయ విషయి వాచక ద్వయ నిర్దేశము ఆరోపము". "విషయి పదమాత్రమునకు విషయలాక్షణికముచే నిర్దేశము అధ్యవసాయము" అని వచింపఁబడెను. అలంకార శాస్త్రమున ఉపమానమునకు; విషయి; అప్రకృతము; అవర్ణ్యము; ఆరోప్యమాణమనియు; ఉపమేయమునకు విషయము ప్రకృతము; వర్ణ్యము; ఆరోప్య విషయమనియు నామాంతరములు గలవు. అందుచే "లక్ష్యవాచక పదసత్వమునసారోపమ"నియు; 'లక్ష్యవాచక పద అసత్వమాత్రమున సాధ్యవసానమ'నియు ప్రసిద్ధము.

"వాచ్యార్థానుపపత్తిచే దాని సంబంధమువలన నారోపితశబ్ద వ్యాపారమును లక్షణ"యని విద్యానాథుడు వ్రాసెను. ఇతఁడు జహద్; అజహద్; సారోప; సాధ్యవసాయములను భేదచతుష్టయమునంగీకరించెను. 'ఉపమేయోపమానములకు భేదము లేక పలికినప్పుడు ఆరోపము'నియు; ఉపమేయమును గప్పిపుచ్చుటచే భేదము లేక పలుకుట అధ్యవసాయము'నియు విద్యానాథుఁడువిధించెను.

లక్షణను, శుద్ధము; గౌణము' అని కావ్యప్రకాశ కారులు విభజించిరి. సంబంధాంతరముగలది శుద్ధము; సాదృశ్య హేతుకము గౌణము. ఇందు మొదటి భేదమైన శుద్ధము మరల ఉపాదాన లక్షణ, లక్షణ లక్షణ యను పలుకఁబడెను. "ఒక పదము తన కర్థము గలుగుటకొరకింకొక పదమును లాగుకొనినచో ఉపాదానమనియు; ఇంకొక మాటకర్థము గలుగ జేయుటకే తన్నొసంగు కొనినచో లక్షణ లక్షణ" యనియు మమ్మటాచార్యుఁడు వచించెను.

ఉపాదాన లక్షణకు అజహల్లక్షణ యనియు; లక్షణ లక్షణకు జహల్లక్షణయనియుఁ బేరులుగలవు. ఈ శుద్ధలక్షణా భేదములు రెండును ప్రత్యేకముగ సారోపము; సాధ్యవసాన మని విభజింపఁబడి నాలుగు విధములయ్యెను. ఇంక రెండవ భేదమైన గౌణమును ఉపచారమిశ్రమని వచింతురు. ఇదికూడ సారోపము, సాధ్యవసానములని రెండు విధములు. ఇటుల శుద్ధము నాలుగు విధములును, గౌణము రెండువిధములును

గలసి లక్షణ ప్రకాశకారుని మతమున షడ్విధము. అలంకార మంజరి యందీ విభాగమే పాటింపఁబడెను.

“ఉపమానోపమేయములకున్న భేదము గప్పబడక, రెండునుఒకదానియందుఁ జెప్పబడినచో సారోపము; అటుగాక ఉపమానము నందుపమేయము గప్పబడి, ఉపమానము మాత్రమే చెప్పబడినచో సాధ్యవసానము”– సారోపమున భేదము గానవచ్చును. సాధ్యవసానమున భేదము గానరాదు.

లక్షణ. రూఢి. ప్రయోజనములపై నాధారపడి యుండు నని సాహిత్య దర్పణమున విశ్వనాథ కవిరాజు వర్ణించెను. వ్యంగరహితమై రూఢి లక్షణ చెలఁగును; వ్యంగ సహితమై ప్రయోజన లక్షణ లేక ఫలలక్షణ వెలుంగును. ఇది మరల ఉపాదానలక్షణ లేక అజహత్స్వార్థము; లక్షణ లక్షణ లేక జహత్స్వార్థ మనియు ప్రత్యేకముగ ద్వివిధము. వీనిలో ఉపాదానము; ఇతరాక్షేపము; లక్షణ లక్షణ, ఉపలక్షణా హేతుకము. ఇవి తిరుగ ఆరోపము; అధ్యవసానమని రెండువిధములు. ఇందు సాదృశ్య హేతుకము, ఆరోపము. ఇచట విషయమునకు [ఉపమేయమునకు] అనిగీర్ణములేక అన్యతాదాత్మ్య ప్రతీతి గలదు. ఇంక ఉపమానతిరోహితోపమేయము, అధ్యవసానము. ఇటులరూఢి, ప్రయోజనలక్షణలు ప్రత్యేకముగ అష్ట భేదములయ్యెను. ఈ ఎనిమిది విధములును, శుద్ధము, గౌణ మని మరల రెండురీతులఁ జెలఁగును. ఇచట, ఉపచారామిశ్రమై సాదృశ్యేతర సంబంధయుతము, అనగా కార్య కారణ భావ

సంయుక్తమై శుద్ధము చెలంగును, గుణయోగయుక్తమై, ఉప చారమిశ్రమై, గౌణము చెలువారును. అందుచే సాదృశ్య సంబంధ నిబంధముగలది, గౌణము; సాదృశ్యాతిరిక్త సంబంధ నిబంధముగలది శుద్ధమని తెలియనగును. అత్యంత విశకలిత శబ్దములకు సాదృశ్యాతిశయ మహిమచే భేదప్రతీతస్థగనమే, ఉపచారము.

ఇటుల రూఢి లక్షణ ఎనిమిది విధములయ్యెను (శుద్ధము; గౌణము)

రూఢి సారోప ఉపాదానలక్షణ-
రూఢి సారోప లక్షణ లక్షణ
రూఢి సాధ్యవసాన ఉపాదాన లక్షణ
రూఢి సాధ్యవసాన లక్షణ లక్షణ
రూఢి గౌణి సారోప ఉపాదాన లక్షణ
రూఢి గౌణి సారోప లక్షణ లక్షణ
రూఢి గౌణి సాధ్యవసాన ఉపాదాన లక్షణ
రూఢి గౌణి సాధ్యవసాన లక్షణ లక్షణ

ఇటులనే ఫల లక్షణలేక ప్రయోజన లక్షణకూడ శుద్ధ గౌణభేదముల ఎనిమిది విధములయ్యెను. ఈ ఫలలక్షణ మరల గూఢము అగూఢమని రెండు తెఱంగులగుటచే, ఫలలక్షణ పదియారు రీతులఁజెలంగును, వాక్యార్థభావనాపరి పక్వబుద్ధి విభవమాత్ర వేద్యములేక సహృదయ హృదయసంవేద్యము,

గూఢము  సర్వజనవేద్యము లేక అతిస్ఫుటము, అగూఢము. ఈ షోడశభేదముల ఫలలక్షణ యందలి ఫలము లేక ప్రయోజనము, ధర్మిగతము, ధర్మగతమని ద్వాత్రింశద్భేదము. రూఢి లక్షణా భేదములు ఎనిమిదియు, ఫలలక్షణాభేదములు ముప్పదిరెండును గలసి లక్షణ చత్వారింశతి భేదములు. ఈనలువది భేదములును పదగతము, వాక్యగతమని రెండు తెఱంగు లగుటచే మొత్తము అశీతి లేక ఎనుబది విధముల లక్షణ వెలుంగునని విశ్వనాథుండు రచించెను.

---

# అలంకారమంజరి.

అనుబంధము 2

---

## రసము

---

"విభావానుభావ వ్యభిచారి సంయోగమువలన రస నిష్పత్తి" సంభవించునని నాట్యాచార్యుఁడైన భరత మునీంద్రుఁడు పఠించెను. ఈసూత్రమునకర్థమును విప్పి చెప్పునపుడు కొన్ని ప్రశ్నలు కలుగును, ఇచట విభావాదు లెవరవి? విభావాదుల సంయోగము [కూడిక] ఎటుల? విభావాదుల మేళనము సంభవించినచో సహృదయులకును, సామాజికులకును రసోదయమెట్లు చేకూరును? ఆయా శాస్త్రముల నాధారముగ నాయా గ్రంధకారులు భరతముని సూత్రమునకు వ్యాఖ్యానముల రచించిరి. వీనిలో భట్టలొల్లట, శ్రీ శంకుక, భట్టనాయక, అభినవగుప్తపాదుల మతము లొకదాని వెనుక నొకటి వెలువడినవి.

### భట్టలొల్లటుఁడు.

---

ఇతని రసమతవిచారము మీమాంసశాస్త్రము ననుసరించును. దీనిని ఉత్పత్తివాదమందురు.

ఇందు విభావము కారణము; రసము కార్యము. అందుచే రసము, అనుకార్యము లేక ఉత్పాద్యముగ వచింపఁబడెను. వీనికి కార్యకారణసంబంధము గలదందురు. ఇచట రత్యాదులు స్థాయిభావములు [స్థిరమైన భావము] లలనాదులు, ఆలంబన విభావములు (ఆశ్రయించునవి; అనగా వారిని చెట్టబట్టి యుండును.) ఉద్యానాదులు, ఉద్దీపన విభావములు వీనిచేఁ బెంపొందును. కటాక్షాదులు, అనుభావములు నెంటనంటు భావములు [వీనిచే ప్రతీతి యోగ్యమగును] ఉత్కంఠాదులు, వ్యభిచారి లేక సంచారి భావములు [అటు నిటు తిరుగు భావములు] వీనిచే పరిపోషితము. ఈ మతమున, రామాదుల ననుకరించునటులచే, అభినేయమై [అభినయింపబడినవై] శృంగారాది రసములు పుట్టు వొందును. నటులచే తుల్యరూపాను సంధానవశమున నారోప్యమాణమై ఆరోపింపఁ బడినదై అనగా లేకపోయినను ఉన్నటుల భావింపఁబడినదై సామాజికు లకు చమత్కార హేతువగును. అనఁగా నటుఁడు రామునివలె వేషముధరించి, భావములప్రకటించి. నటించుటచే, చూచు వారికి సంతోషము పుట్టునని భావము.

ఈమతవివరణము, రజ్జు సర్పన్యాయమునఁ జెలంగును. పాముగాకున్నను, త్రాటినిజూచి, పామని తలంచినవెంటనే మనకు భయముకలుగును. అటులనే, సీతాదివిషయానురాగ రూపకమైన రామాది రతి గానరాకున్నను, నర్తకుని అభినయ నైపుణ్యమున, ఆతనియందున్నటులనే కానఁబడుచు, సహృ

దయు హృదయములయందు చమత్కారమును పుట్టించి, రసపదవి నధిరోహించును.

ఇది హృదయ గ్రాహకముగాదు. సామాజికులయందు రసనిష్పత్తి లేకున్నచో చమత్కారానుభవ ముండదు. లౌకిక శృంగారాది దర్శనమున, ఆనందము జనింపదు; కావున అజ్ఞానము చమత్కారకారణము గానేరదు. చందనసరో బంధరీతి, చందనారోపము చమత్కారహేతువుగాదు. అటు లనే సుఖముగూడ ఆరోప్యమాణముగాదు; అది విద్య మానము. ఈమతమున సామాజికులకు స్థానము గానరాదు. మరియు కార్య కారణములు లోకమున సమకాలమున సంభ వింపవు. విభావాదులును రసాదులును సమకాలీనములు గానే రవు. చందనలేపము, దానివలన సౌఖ్యము నొకేసారి కలుగుటలేదు.

## శ్రీ శం కు కు ( డు .

---

ఇతని విచారణ, న్యాయము లేక తర్కశాస్త్రముపై నాధారపడియున్నది. దీనిని అనుమితవాదమందురు.

మొదటి మతమునందువలె నిందు విభావములు ఉత్పాదకములు లేక కారణములుగావు. అవి అనుమాపకములు లేక గమకములు. అందుచే భట్టలొల్లటుడు పలికినటుల ఉత్పా ద్యము లేక కార్యములుగాక, శ్రీ శంకుకుని మతమున రసాదులు

అనుమాన్యములు లేక గమ్యములై చెలంగును. సత్య బుద్ధి, మిథ్యాబుద్ధి, సంశయబుద్ధి, సాదృశ్యబుద్ధి యని బుద్ధి నాలుగు విధములు.

1. మొదట నటుని జూడగనే 'అతడు రాముడు' అను బుద్ధి కల్గును.

2. పిదప 'అతడు రాముడు గాడు' అని తోచును.

3. తరువాత 'అతడు రాముడు కావచ్చును; కాక పోవచ్చును' అను సందియము ఉదయించును.

4. కడకు 'అతడు రామునివలె నున్నాడు' అని చూపరులు తలంతురు.

ఈ మతవిచారము చిత్రతురగ న్యాయమందురు. పట మునందలి గుఱ్ఱమును గాంచి దానిని గుఱ్ఱమని పలుకుదురు. అటులనే నటుని నర్తనా కౌశల్యమును గాంచి రసాదు లాతని యందున్నట్లే చూపరు లనుమానింతురు—ఊహింతురు— లేక తలంతురు ఇచట అనుమితి 'నిప్పులేనిచో పొగలేదు' అను లోకోక్తి ననుసరించును. అనగా 'ఒక చోట పొగను జూడ గనే, అచట నిప్పు కలదని మనము తలంతుము. అరీతినే నటుడు ప్రకటించు విభావాదులచేత సామాజికులకు రసాను మితి కలుగు నందురు.

ఇది మనోరంజకము గాదు నేలనన లోకమున ప్రత్యక్ష జ్ఞానమే చమత్కార జనకము; అంతియేకాని, అనుమిత్యాది

మూలక జ్ఞానము సంతోషదాయకము గాదు. మరియు లోక ప్రసిద్ధిని త్రోసిపుచ్చి, వేరొక రీతిని కల్పించుట మానా భావము [ప్రమాణదూరము] ఈ కారణమున సామాజికులకు స్థానము లభించెను. ఇందుగల విశేషమిదియే.

## భట్టనాయకుఁడు.

---

ఇతని విమర్శనము సాంఖ్యశాస్త్రసమ్మతము. దీనిని భుక్తివాదమని వచింతురు. శ్రీశంకుకుని అనుమితివాదము నంగీకరింపక భట్టనాయకుడు దానిని క్రిందివిధమున విమర్శించి, నూతన మతమును నెలకొల్పెను.

నటుని యందున్నదని తలచుట తప్పు. రామాదులు లేనప్పుడు, వారి రత్యాదులుఁగూడ నుండవు. అట్టిచో సామాజికుల యందవి కలుగుటెట్లు? కావున కలుగనేరవు. రసము అన్యనిష్ఠమైనచో [ఇతరులయందున్నచో] నది తాటస్థ్యము వహించును. అందుచే రామాదుల కార్యములు మనకు మోదము గూర్పలేవు. అట్లుగాక రసము, స్వనిష్ఠమనినచో (మనయందున్నదన్నచో) దానికి మనలో ననగా సామాజికులలో విభావాదులు లేవు. ఇంక నదియెట్లు కలుగు ననినచో, విభావాదులు భోజకములును, రసాదులు భోజ్యములునై సంభవించును. ఈ భోగము అలౌకికము. రసము అసిద్ధమగునపుడు భోగ మెట్లు కలుగును? ఇతరులయందున్న రత్యాదులు

పరులయందున్న విభావాదు లేరీతి వే స్వీకరించే భోక్తవ్య ముగును? అను సంశయము లుద్భవించును.

పైన పేర్కొనఁబడిన సందియముల కీ సమాధానమును భట్టనాయకుడు వచించెను. శబ్దాత్మకమైన కావ్యము నకు మూడు వ్యాపారములు గలవు. 1 అభిధాయకత్వము; ఇది వాచ్య విషయము. 2 భావకత్వము; ఇది రసాది విష యము. 3 భోజకత్వము; ఇది సహృదయ విషయము. వీనిలో భావకత్వమును సాధారణీ కరణమందురు. ఈ వ్యాపారము వలన స్థాయి, విభావాదులు సాధారణీకృతము లగును. అనగా సీతాది విశేషణములు సామాన్య కామినీత్వాదులగును. వారి విభావాదులు సామాన్యము లేక సాధారణములైనవి భావాదు లగును. ఇటుల భావకత్వ వ్యాపారమువలన సాధారణీ కృత ములైన విభావాదులు, తృతీయమైన భోజకత్వ వ్యాపారసాహి త్యమువలన సక్షాత్కరింపఁబడిన రత్యాది స్థాయిభావములు భుజిం పఁబడును. దీనినే ఆస్వాదము, భుక్తిచర్వణము, భోగమను పేరులఁబిలుతురు. సత్వగుణోద్రేకమువలన ప్రకాశించునదియే భోగము. ఆనందమే దాని స్వరూపము. ఆసంవిత్స్వరూప మనన్యాలంబనమై లౌకిక సుఖానుభవవిలక్షణమై ప్రకాశిం చును.

ఇది హృదయావర్జకముగాదు. అభిధా, లక్షణా, వ్యంజ నావ్యాపారమువలననే రసాభివ్యక్తి కల్గుచున్నపుడు, వీనికి మిం చిన వ్యాపారద్వయ కల్పనము ప్రమాణాభావము. వ్యంజనా

స్థానమున, తాదృశమైన భోగవ్యాపారమును సృష్టించుట అనావశ్యకము. మరియు భావకత్వరూపమైన అధిక వ్యాపారాంత ప్రతిపాదన మనౌచిత్య సూచకము.

## ఆచార్యాభినవగుప్తపాదులు.

---

ఇతని వ్యాఖ్యానము వేదాంతశాస్త్ర సరణిని వెలయించుచున్నది. దీనిని వ్యక్తివాదమందురు. ఇతనిమతము నొకల ముత్యాలసేసవోలె అలంకారికులందరు తాల్చిరి.

ఈమతమున ప్రమదాదులు, ఆలంబన కారణములును; చంద్రికాదులు, ఉద్దీపన కారణములును; అశ్రుపాతాదులు, కార్యములును, చింతాదులు, సహకారులు నగును. పూర్వవాసనారూపమున సామాజికుల హృదయములందు నిద్రించుచున్న రత్యాది స్థాయిభావములు మేల్కొలుపబడును. ఇందులకు వారి పరిశీలనాబలమే కారణము. అంతట రసాభివ్యక్తి చేకూరును. కావ్యమునందు గుణాలంకార యోగముచేతను, నాట్యమునందు కాయిక, వాచిక, సాత్త్విక, ఆహార్యరూపములైన అభినయముచేతను, విభావానుభావ సంచారిరూప వ్యాపారముల చేతను, అలౌకిక విభావానుభావ సంచారి పదవ్యవహారము కలుగును. ఇచట కావ్యార్థములను భావింపజేయుటచే భావములనియు, విశేషముగ భావింపజేయుటచే విభావములనియు తాత్పర్యము. ఇంక అనుసరించి యుండునవి

అనుభావములు'ను. సంచరించుచుండునవి సంచారిభావము లనియు పరింతురు. ఈ సంచారి భావములను 'వ్యభిచారి' భావములనియుగూడ పల్కుదురు. వివిధముగ నభిముఖ ములై చరించుటచే వ్యభిచారములయ్యెను. ఈ మతమున విభావాదులు వ్యంజకములు; రసాదులు వ్యంగ్యములు. ఇందు సీతారాములయందలి విశేషాంశము పోయి, కామినీ త్వాది ప్రతీతి వ్యక్తమగును. అంతట ఆత్మనిష్ఠము లేక స్వనిష్ఠ ములైన రత్యాదుల ప్రతీతి సంభవించును. పిదప రసాస్వా దము లభించి సహృదయు లానందింతురు.

ఈ మత నిరూపణము పానకరసన్యాయమును బోలి యున్నది. మొదట నెమటనుండి, పిదప లోనికేగి, తరువాత నంతటనిండి, తుదకుఁ గానరాక మదికి ముద మొనవించును. అటులనే రసాభివ్యక్తి సామాజికులకుఁ గలుగును. ఇచట క్రమ మెట్లన 1 కావ్యమందలి పదములకు నర్థము కలుగును, 2 అచ టనున్న విభావాదులకు కనబడుచున్న వాక్యార్థము దోచును. 3 అంతట గుణాలంకారాభినయాదులు దీపించును. 4 తరు వాత నా రత్యాదులు సహృదయుల, సామాజికుల, వాసనా వశమున సాధారణ విభావాములై బోధ జనించును. అపుడు చిదానందావరణ భంగములు నశించి, రత్యాదిస్థాయి భావ ములు శృంగారాది రసములై, బ్రహ్మాస్వాదసదృశ సౌఖ్య మును సహృదయ సామాజికు లనుభవింతురు.

ఈ మతము సరసజనసమ్మతము. ఇందు పూర్వమతము లలో గల లోపములు, దోషములు, కల్పనములును లేవు.

ఇచట భట్టనాయకుని భుక్తివాదము, అభినవగుప్తుని వ్యక్తివాదమయ్యెను. అందుచే నందలి భావకత్వమింక వ్యంజనయు, భోగమింక రసప్రతీతియు నై పరిణమించెను.

## జగన్నాథపండితుడు.

V. రసగంగాధరమునందు పండితరాయలు నవ్యమతము నిట్లు నిరూపించెను.

i. కావ్యమున కవిచే, నాట్యమున నటునిచే, విభావాదులు ప్రకాశితములు. వ్యంజనావ్యాపారముచే నీ విభావాదుల రామాది విషయక సీతాది రతి గ్రహింపబడును. అనంతరమున "శుక్తికాశకలము వలె రజతఖండమున్నదో" నీ తమలో నున్న కల్పిత రామత్వానె అజ్ఞానము తొలంగును. ఇది సహృదయులయందున్న భావనా విశేషరూపదోషమహిమచే సంభవించును. అంతట అనిర్వచనీయ సాక్షికమైన సీతాదివిషయక రత్యాదులే రసాదులై సహృదయులగు సామాజికులహృదయములలో వెలుంగును.

ii. ఇది దోషవిశేషము. నాశముయొక్క కార్యము. ఈ నాశము సంభవించిన పిదప భేదము తొలంగును. అంత లోకోత్తరాహ్లాదముచే సుఖపద వ్యవహారము గల్గును. ఏకత్వ అధ్యవసానము లేక వ్యంగ్యమువలన నెదుట గానవచ్చు రత్యాదులు వర్ణనీయములై వెలుంగును.

---

# తప్పు ఒప్పుల పట్టిక.

| పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| 9 | సంయోగననగా | సంయోగమనఁగా |
| 19 | వేలి | వెలి |
| 16 | కానిత | కాతని |
| 1 | తృతీయ | తురీయ |
| 6 | బోషిత | బ్రోషిత |
| 7 | లనుదారులై | లనుసారలై |
| 20 | కొందఱీదు | కొందఱందు |
| 18 | రమర...క్షితితలమున | రరయ...యవనిలోన |
| 22 | సెవరిమాటుకు | సెవరిమట్టుకు |
| 3 | వ్యంగ్యార్ధ | వ్యంగ్యార్థ |
| 19 | గావ్యలింగారలంకారము | గావ్యలింగాలంకారము |
| 12 | క్రమమునసే | క్రమముసే |
| 10 | మూలము లై | మూలకములై |
| 19 | మొలకలెతు | మొలకలెత్తు |
| 24 | నాలౌకిక | నలౌకిక |
| 20 | అవిమలిన | అతి మలిన |
| 12 | సెటిం | సెలిం |
| 21 | కొందఱు దు | కొందఱైదు |
| 16 | పాటి | సాటి |
| 11 | తుంటవిలుకాని | తూటవిలుకాని |
| 19 | నప్రలేశిత | నక్షత్రలేశిత |
| 11 | మద్రపై | ముద్రసై |